# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి : 50 సంచిక : 7 394 సెప్టెంబర్-అక్టోబర్ 2022 పేజీలు 52 వెల : 20/- రూ॥లు



# నూరేళ్ల రావిశాస్త్రి

## ప్రత్యేక సంచిక

# కొత్త పుస్తకాలు






1991లో కాంగ్రెస్ ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాలను ప్రవేశపెట్టాక సామ్రాజ్యవాద అనుకూల విధానాలు వేగవంతం అయ్యాయి. వాటిని ఇవాళ బిజెపి ఇంకా ముందుకు తీసికెళ్లింది. ప్రజలను కుల మత సమస్యల సుడిగుండంలో పడేసి పబ్లిక్ రంగాన్ని, సహజ వనరులను కార్పొరేట్ సంస్థలకు అప్పగిస్తున్నది. దేశవ్యాప్తంగా అనేక రంగాల్లో కార్పొరేటీకరణకు వ్యతిరేకంగా ఉద్యమాలు జరుగుతున్నాయి. వాటి మీద తీవ్రమైన అణచివేత సాగుతున్నది. ఈ నిర్బంధం కూడా కార్పొరేటీకరణలో భాగమే. భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యం నుంచే కార్పొరేటీకరణ, హిందుత్వ ఫాసిజం తలెత్తాయి. ఈ సమగ్ర అవగాహన కలగడానికి ఈ ప్రసంగ వ్యాసాలు దోహదపడతాయి.

ప్రతులకు:

రచన: ◆ఎన్.వేణుగోపాల్ ◆అశోక్ ◆పాణి ◆ఎన్.రవి — అనేక, వీక్షణం

ప్రచురణ: దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం  పేజీలు: 100  వెల: 100/-  92472 53884

---




వీక్షణంలో 2013 నుంచి 2016 వరకు సమకాలీన రాజకీయార్థిక పరిణామాలపై 'చరిత్ర గమనం' శీర్షిక కింద రాసిన ముప్పైకి పైగా చిన్నా పెద్దా వ్యాఖ్యలు, వ్యాసాలు, వీక్షణంలో 2013లో వెలువడిన రెండు సుదీర్ఘ రాజకీయార్థిక దృక్పథపు వ్యాసాలు సమీకరించిన సంపుటం.

## సమాజ చలనపు సవ్వడి

**రాజకీయార్థిక విశ్లేషణ**

ప్రచురణ: స్వేచ్ఛా సాహితి  పేజీలు: 244  వెల: 200/-

రచన: ఎన్.వేణుగోపాల్  ప్రతులకు: వీక్షణం, జి–1, మైత్రీ రెసిడెన్సీ, 3–6–394, స్ట్రీట్ నెం:3, హిమాయత్‌నగర్, హైదరాబాద్–500029

గూగుల్ పే, పేటిఎం, ఫోన్ పే నెం: 9848577028

---



'నేను చావును నిరాకరిస్తున్నాను' పేరుతో జిఎన్ సాయిబాబా ఇంగ్లీష్‌లో రాసిన జైలు కవిత్వం 2019లో విరసం ప్రచురణగా తెలుగులో వెలువడింది. అత్యంత దుర్భరమైన జైలు జీవితానుభవాల తాకిడిని ఒడిసి పట్టుకొని తన జీవనదృక్పథపు తెరచాపతో దృఢంగా నిలబడేందుకు చేస్తున్న సాహస ప్రక్రియే ఆయన కవిత్వం. అది ఆధునిక తెలుగు కవిత్వపు స్థాయిని ఎంతగానో పెంచింది. ఇప్పుడు ఆ కవిత్వంతో పాటు మరి కొన్ని కవితలు, ఉత్తరాలు కలిపి ఇంగ్లీష్‌లో ప్రచురించారు.

## WHY DO YOU FEAR MY WAY SO MUCH?

Poems and Letters from Prison

ప్రచురణ: స్పీకింగ్‌టైగర్ పబ్లిషర్స్  పేజీలు: 224  వెల: 306/-

రచన: జిఎన్ సాయిబాబా  ప్రతులకు: అమేజాన్

---




ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పటి నుంచి రాయలసీమ ఆకాంక్షలు వినిపిస్తూ వచ్చాయి. అయితే అవి వ్యక్తుల కేంద్రంగానే నడిచాయి. ఇక్కడి ప్రాంతీయ ఉద్యమాల చరిత్రకూడా ఆ రెడ్డీ, ఈ రెడ్డీ చుట్టూ తిరుగుతూ ఉంటుంది. ప్రజల పాత్ర అప్పుడూ, ఇప్పుడూ తక్కువగానే ఉంటుంది. ఈ స్థితిపై రాయలసీమ విద్యావంతుల వేదిక అందిస్తున్న విశ్లేషణ.

## రాయలసీమ ప్రజా ఉద్యమాలు– ఒక విశ్లేషణ

ప్రచురణ: రాయలసీమ విద్యావంతుల వేదిక  పేజీలు: 24  వెల: 25/-

రచన: అరుణ్  ప్రతులకు: 9440294462

KLVA101M203




సంపుటి : 50 ◆ సంచిక : 7 ◆ సెప్టెంబర్-అక్టోబర్ 2022 ◆ వెల : రు. 20/-

సంపాదకీయం



# ఈ కాలానికి రావిశాస్త్రి

పి. వరలక్ష్మి

వ్యవస్థ పట్ల ఎంతో విమర్శనాత్మక దృష్టి ఉన్నవాళ్లు కూడా న్యాయస్థానాల పట్ల అంతో ఇంతో నమ్మకం ఉంచుతారు. న్యాయపోరాటం అంటే న్యాయమైన పోరాటం అనేకన్నా న్యాయస్థానాల్లో పోరాటం అనే అర్థంలో వాడటం చూస్తుంటాం. 1961లోనే న్యాయవ్యవస్థ వర్గస్వభావాన్ని నగ్నంగా చూపించిన రచయిత రావిశాస్త్రి. ఇంగ్లీషువాడు కట్టించిన కోర్టులూ, జెయిళ్ళూ అలాగే వాడు స్థాపించిన న్యాయం ఎలా వర్ధిల్లుతున్నదో ఇన్నేళ్ల తర్వాత ఇప్పుడు మరింత స్పష్టంగా, అమానుషంగా మనముందు ఉంది. రావిశాస్త్రి పుట్టి నూరేళ్లయిన సందర్భంగా తెలుగు సాహితీ లోకం ఆయన సాహిత్యాన్ని తలచుకుంటున్నది, విశ్లేషిస్తున్నది. కాని వ్యవస్థలో సంక్షోభం ముదిరి, పాలన అంతకంతకూ నిరంకుశంగా తయారవుతున్న కొద్దీ రావిశాస్త్రి కథల్లోని పాత్రలు, సంభాషణలు మన కళ్ల ముందు కదలాడుతూనే ఉంటాయి.

నిన్నటికి నిన్న ప్రొఫెసర్ సాయిబాబా విడుదల కాకుండా చూడ్డానికి సుప్రీం కోర్టు అసాధారణంగా ఆఘమేఘాల మీద సెలవురోజు కూడా పనిచేసింది. ఏరోజన్నా న్యాయాన్ని కాపాడ్డానికి ఇంత హడావిడి పడటం మనం ఎరగం. "ఏ దేశంలోనైనా కోర్టు అభాగ్యుల్ని మింగేసే ముసలి మొసలి గొయ్యిలా, గుండెలేని గోరీలా... లాయర్లు, జడ్జిలు నునుమెత్తని పులుల్లా, అందమైన తోడేళ్ళలా, దుక్కబలిసిన గుంటనక్కల్లా... వుంటారని" వర్ణిస్తూపోయిన రావిశాస్త్రి కథ గుర్తురాక మానదు. కోర్టులను అబద్ధాల పుట్టలని అంటారాయన. స్వయంగా పీడిత ప్రజల ప్లీడరుగా, క్లయింట్స్ ఎంతగానో అభిమానించిన ఛాత్రిబాబుగా, పౌరహక్కుల కార్యకర్తగా ఉండిన రావిశాస్త్రికి కోర్టుల వర్గస్వభావాన్ని విప్పిచెప్పడానికి ఏ మాత్రం మొహమాటం లేదు, జంకు లేదు. జైళ్లన్నీ అభాగ్యులకి, దౌర్భాగ్యులకి, దరిద్రులకి మాత్రమేనని, అసలు నేరాల మీదే బతికే పోలీసులు, లాయర్లు, జడ్జిలకు ఆ పాపాలేవీ అంటవని అంటారు. నేరం, విచారణ, తీర్పు వెనక సభ్యసమాజానికి కనిపించని మాయంతా సారా కథల్లో ఆయన విడమర్చారు. 'జరగని విషయం జరిగిందని, జరిగినదని చెప్పబడిన జరగని విషయం చివరికి జరగలేదని, ఉందని, లేదని నడిపించే కథలో ఉన్నందంతా మాయే' అని ఆయన అన్న విషయం యుఎపిఎ, కుట్ర కేసుల విషయంలో ఎంత సరిగ్గా అతుకుతుందో చూస్తే ఆశ్చర్యపోతాం. అసలు కుట్ర జరిగిందని కేసులు పెట్టడమే పెద్ద కుట్ర. అది లేనేలేదని తేలగొట్టేలోపల ఏళ్ల తరబడి నడిచే విచారణ తంతు, కోర్టులు, జడ్జిలు, ప్రాసిక్యూటర్లు అంతా మాయే కదా. ఇదంతా మాయని తేల్చేసి ఊరుకోకుండా ఈ మాయ మధ్య ఎంతటి బాధ ఉందో చూపిస్తాడు.

ఈ బాధ వినడానికి చూడ్డానికే జడుసుకునే న్యాయమూర్తి ఆనవాయితీ పూర్తి చేసి కాయితాలు చుట్టేస్తాడు. ఎందుకంటే ఆయనకు కాగితాలతో తప్ప ఏ రోజూ జీవితాలతో పరిచయం ఉండదు. ఏ దరిద్రులకో జైలు పడుతుంది. న్యాయం అలా వర్ధిల్లుతూ ఉంటుంది. న్యాయం కథలో ఒంట్లో ఊపిరిలేని, ముఖంలో కళాకాంతుల్లేని పేరులేని స్త్రీ పాత్ర ఒకటి 'నేరం చేయలేదు. కేసు ఒప్పేసుకుంటాను' అంటుంది. ఇదే కదా మీక్కావల్సింది అనే అర్థం ఉంటుంది అందులో. నేరానికి, శిక్షకు సంబంధం ఉండదు. ఆ మనుషుల స్థాయిని బట్టి శిక్షకు పాత్రులా కాదా అని తేలుస్తారు. వ్యభిచార గృహాలు నడిపించే ప్రొప్రైటర్ డబ్బు పారేయగలడు కాబట్టి శిక్షకు అతీతుడు. అందులో పనిచేసే స్త్రీ 'కట్నం' చదివించుకోలేదు కాబట్టి కేసు ఒప్పుకోక తప్పదు. జరిమానా కూడా కట్టలేదు కాబట్టి జైలు తప్పదు. కోర్టులో ఈ తంతు అంతా అది ఎంత రోతగా రొష్టుగా ఉంటుందంటే ఒక కథలో డబ్బుకట్టుకోలేని దౌర్భాగ్యులు వరుస పెట్టుకొని వందలు వందలుగా జడ్జి ముందు నిలబడటం, ఆయన శిక్షలు రాయడం చేసిచేసి చివరికి పిచ్చిపట్టేస్తుంది. ప్రభుత్వ పిచ్చాసుపత్రి బోర్డు చూసి ప్రభుత్వానికి పిచ్చిపట్టింది అని అరుస్తాడాయన.

ఇవి ఊరికే కథలు కావు కదా. ప్రొహిబిషన్ కాలంలో సారా కేసులు తీసుకుని రావిశాస్త్రి చెప్పింది ఆ సందర్భానికి మాత్రమే సరిపోయేది కాదు. ఇప్పుడయినా, ఎప్పుడయినా జైళ్లలో ఉండేదెవరు? ఆదివాసులు, దళితులు, మతమైనారిటీలు, నిరుపేదలే కదా. అసలు వ్యవస్థలో నేరం-శిక్ష అనే భావనలే ఎంత అర్థంలేనివిగా ఉంటాయో నిరూపించాడాయన. వ్యవస్థతో ముడిపడిన చాలా మౌలికమైన విషయాలను మానవ

(మిగిలినది 6వ పేజీలో...)

సంచిక - 390




ఎడిటర్
అరసవిల్లి కృష్ణ

వర్కింగ్ ఎడిటర్
పి. వరలక్ష్మి

రచనలు పంపించాల్సిన చిరునామ:
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు-516360.

* email : arunatara1977@gmail. com

Like Page:
//viplava rachayitala sangahm arunatara

facebook:
//viplava rachayitala sangahm virasam

Virasam website :
www. vasanthamegham.com

చందాలు, విరాళాలు పంపవలసిన చిరునామా
అరసవిల్లి కృష్ణ, 6-1/16-7ఎ/1, పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-520001.
చెక్‌లు / డ్రాఫ్టులు / ఆన్‌లైన్‌లో పంపడానికి
A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595; IFSC : SBIN0020714,
Branch : Vagu Center, Vijaywada.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

విడి సంచిక వెల - రు. 20; సంవత్సర చందా - రు. 240;
రెండు సంవత్సరాల చందా - రు. 450; మూడు సంవత్సరాల చందా - రు. 680;
ఐదు సంవత్సరాల చందా - రు. 1100; దశాబ్ది చందా - రు. 2200/-

# ఈ సంచికలో



## వసంతమేఘం వెబ్ పత్రికలో ...

## సెప్టెంబర్ 15, 2022 సంచిక

సంపాదకీయం:

రాహుల్ గాంధీ 'భారత్ జోడో యాత్ర' ఫాసిజాన్ని నిలువరిస్తుందా? -సాగర్

వ్యాసాలు:

అణచివేత మధ్యనే నూతన పోరాట ప్రపంచం -ధరణి

దేశద్రోహుల జేబు సంస్థ ఎన్ఐఏ ముస్లింలను దేశద్రోహులని ఆరోపించడమా? -పాణి

జనశక్తి నాయకులు కామ్రేడ్ కూర రాజన్న అరెస్టు-కోర్టు వాయిదాలు- అనారోగ్యం -వంగల సంతోష్

నిజనిర్ధారణ నివేదిక;

వాళ్లేం నేరం చేశారు? -జార్ఖండ్ జనాధికార్ మహాసభ

కథ:

హస్బెండ్ స్టిచ్ -3: భ్రమాన్వితుడా..! -గీతాంజలి

కవిత్వం:

పెను చీకటి-ప్రచండ కాంతి -మహమూద్

నాలుగు పిట్టలు -మహమూద్

ములాఖాత్ -వంగల సంతోష్

సంభాషణ:

అసలు 'హక్కులు' అనడమే నేరం. ముస్లిం హక్కులు అనడం ఇంకెంత నేరం! -పి. వరలక్ష్మి

ఆర్థికం: కార్పొరేట్ సేవలో మోడీ ప్రభుత్వం -ఎ. నరసింహారెడ్డి

లోచూపు: అంబేద్కర్ అస్తిత్వవాది కాదు, అచ్చమైన దేశీయ ఆధునికతావాది -మెట్టు రవీందర్

## అక్టోబర్ 1, 2022 సంచిక

సంపాదకీయం:

ఎన్నికలు - మరోసారి అర్బన్ నక్సల్స్, ముస్లింలే టార్గెట్ -సాగర్

వ్యాసాలు:

ఈ నిషేధం పిఎఫ్ఐ మీదా? ముస్లింల మీదా? -పాణి

మరో హిందుత్వ విషసర్పం -63 పేజీల కల్పిత రహస్య దస్తావేజు -ప్రగతి

సంభాషణ:

ఇద్దరు మిత్రులు-విప్లవోద్యమంలో రెండు ప్రవంతులు -సహ విద్యార్థి

వ్యాసం:

ఎట్టకేలకు కప్పన్‌కు బెయిల్ -ఎ. నరసింహారెడ్డి

లోచూపు: బజరా 'మనువాచకం' సమకాలీన అనుభవసారం -మెట్టు రవీందర్

క్లాసిక్స్ పరిచయం: హెర్ వోగ్డ్ -ముక్తవరం పార్థసారథి

కవిత్వం:

అదే వర్షం -గవిడి శ్రీనివాస్

దేశమంతా నెత్తురు వాసన -కలీం

మరో వైపు.. -కెక్యూబ్

(3వ పేజీ తరువాయి..)

జీవితానుభవంలో లోతైన భావావేశాలతో చిత్రించాడు. ఆయన పాత్రలు ఎన్నేళ్లయినా అలా ఉండిపోతాయి. ముత్తేలమ్మలు, కిరీటిరావులు, వేతనశర్మలు ఈ వ్యవస్థ ఉన్నంతకాలం మనచుట్టూ తిరుగాడుతూనే ఉంటారు.

వ్యవస్థలోని మాయామర్మాలు చెప్పడం మాత్రమే కాదు, దీన్నంతటినీ నడిపించే శక్తులను, అవి ప్రవచించే నీతిని ఆయన సూటిగా ఎదుర్కుంటాడు. ప్రపంచంలో ఎక్కడికెళ్లినా పీకలు తీసే అధికారం ప్రభుత్వాలకుంటుంది తప్ప ప్రజలకుండదు అంటాడు. హింస-అహింస-ప్రతిహింస చుట్టూ ఎంత మాట్లాడుకున్నా ఈ మాట అంతిమం. పౌరులంటే భూస్వాములు, పెట్టుబడిదార్లు, పోలీసులు కాదు. సంపదంతా సృష్టించి దోపిడికి, దౌర్జన్యాలకు గురయ్యే ప్రజలు. మురికిలో, ఇరుకులో, రొష్టులో నలిగే అసహాయులు, అభాగ్యులు, అల్పజీవులు. వీరి పట్ల ఆయనకు ఎంత ఆర్తి, ఆరాటం ఉందో ఆయన వాక్యాలన్నీ సాక్ష్యాలు. ఆయన కథల్లో స్త్రీల పట్ల, ముఖ్యంగా అట్టడుగు వర్గాల స్త్రీల పట్ల ఎంతో ఆపేక్ష వ్యక్తం అవుతుంది. అయితే భాషలో స్త్రీలను కించపరిచే పదాలు అక్కడక్కడా పడటం ఒక పరిమితిగా గుర్తించాల్సిందే.

రావిశాస్త్రి ఆలంకారిక శైలి గురించి, కవితాత్మక వచనం గురించి అందరూ చెప్తారు. ఆయన ఏం చెబుతున్నాడో ఆ విషయానికి సంబంధం లేకుండా ఆయన కథ చెప్పే పద్ధతిని అభిమానించే సాహిత్యాభిమానులు ఉన్నారు. కాని ఆ శైలి తన దగ్గరికొచ్చే పేద క్లయింట్ల నుండి నేర్చుకున్నానని ఆయనే చెప్పారు. ఆ ప్రజల నుండి తీసుకున్నది తిరిగిచ్చే ధగ్గర ఆయన కమిట్మెంట్ ఆయన సాహిత్యం నిండా, సామాజిక ఆచరణలోనూ కనపడుతుంది. రచయితలారా మీరెటువైపు అని శ్రీకాకుళ పోరాట అమరుల సాక్షిగా విద్యార్థులు ప్రశ్నించేటప్పటికే ఆయన పోరాటంవైపు ఉన్నారు. విరసం వ్యవస్థాపక ఉపాధ్యక్షుడిగా, ఆ తర్వాత ఏర్పడిన పౌరహక్కుల సంఘం ఉపాధ్యక్షుడిగా కూడా పనిచేశారు. సాంకేతికంగా విరసం నిర్మాణం బైట ఉన్నా చివరిదాకా, విరసం కార్యకలాపాలలో ఉన్నారు. సాహిత్య అకాడెమీకి ఆయన నవలకు అవార్డు ప్రకటించినప్పుడు మీ అవార్డుకో నమస్కారం అంటూ దాన్ని తిరస్కరించారు.

ఇప్పుడు రావిశాస్త్రిని మళ్లీ ఒకసారి చదవాలి. కొత్తగా చదవాలి, వెచ్చగా తలచుకోవాలి. ఆయన పదునైన రాతని, సూక్ష్మ దృష్టిని, భావాల లోతుని అనుభూతి చెందాలి. నూరేళ్ల సందర్భమనే కాదు. నిజానికి ఏ సందర్భమూ దానికదే విడిగా రాదు. ఈ లోకమంతా ఘోరమైన నరకంగా అనిపిస్తుంటే, చుట్టూ నిరాశ కమ్ముకొస్తుంటే కొంచెం ఆశ నిలుపుకోడానికి ఆయన్ని చదవాలి. ఏ ప్రజాసమూహాల నుండి ఏం నేర్చుకోవాలో ఆయన రచనలు చెబుతాయి. 'లాభం లేదు, ఈ మనిషి వెధవలు మరింక బాగుపడరు... ఈ లోకం, ఇదంతా ఘోరమైన నరకం అనిపించి బతకడం దుర్భరంగా తోస్తుంది. కాని, అంతలోనే... పకపకలాడే ప్రజాసమూహమంతా ఎదరకొస్తుంది' అని ఒక కథలో ఆయన రాసినట్లు ఆ సమూహాలను చూడగలగాలి.

దేశంలో ఏం జరుగుతోందో అబద్ధాల ప్రచార సాధనాలేం చెప్తాయి. వాట్సాప్ గ్రూపుల బైట, ఎలెక్ట్రానిక్ మాధ్యమాల ఆవల ప్రపంచాన్ని, జనం తండ్లాటలను, ఆరాటాలను, పోరాటాలను కండ్లతో చూసి, చెవులతో వినాలి. రావిశాస్త్రిలా సాహసోపేతంగా కుండబద్దలు కొట్టినట్లు ఏ మంచికీ హాని చేయకుండా, ఏ చెడుకూ మేలు చేయకుండా మాట్లాడాలి, రాయాలి.





# రావిశాస్త్రి - విరసం

ఫెలో ట్రావెలర్

'అభ్యుదయ రచయితలు ఆగిపోయిన నుంచి రావిశాస్త్రి పయనం మొదలైంది....' అని రాశారు శ్రీశ్రీ.

అందుకు రావిశాస్త్రి రచనల్లో 'అల్పజీవి' నవల మొదలు 'ఆరు సారా కథలు', 'గోవులొస్తున్నాయి' నవల దాకా ఆయన సాహిత్యం నుంచి ఎన్ని ఉదాహరణలు అయినా యివ్వవచ్చు.

ఒక రేడియో యింటర్వ్యూలో రావిశాస్త్రి తన తొలి రచనలు మొదలు, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తాను చదివిన సాహిత్య ప్రభావాల గురించి చెప్పాడు. అట్లాగే ఆయనకు ఒక సామాజిక జీవిత నేపథ్యంలో తన తల్లిగారి ఊరయిన శ్రీకాకుళం జిల్లాలో పుట్టి, తండ్రిగారి ఊరయిన తుమ్మపాలెంలో తండ్రిగారు ప్లీడరీ మానేసి వ్యవసాయం చేస్తున్న కాలంలో బాల్యం, తొలి విద్యాభ్యాసం గడిచింది. అనకాపల్లి గ్రంథాలయంలో పుస్తకాలన్నీ చదివాడు. పాలేరు రామయ్య దగ్గర పొలంలో రైతుల భాషను పరిశీలించాడు. చదువు అయిపోయాక మిలిటరీలో ఉద్యోగంతో దేశమంతా తిరిగి 1949లో విశాఖపట్నంలో న్యాయవాదిగా చేరాడు. తన మీద ప్రభావాలు చాలా వివరంగా చెప్పాడు. కానీ చార్లెస్ డికెన్స్ రచనల్లోని అధోలోకం (అండర్ వరల్డ్) మీదనే ఇంగ్లండులో గానీ, ఫ్రాన్సులోగానీ సభ్య ప్రపంచం మనుగడ ఉన్నదని గ్రహించాడు. సారాకథల్లోని 'మాయ'లో ముత్యాలమ్మ నోట ఆ మాటలే చెప్పించాడు. అట్లే మార్క్సిస్టు రచయిత, అన్ని సాహిత్య ప్రక్రియల్లో అనితర సాధ్యంగా రాసిన మార్క్సిస్టు సాహిత్యవేత్త అప్టాన్ సింక్లియర్ నుంచి 'పవర్ పర్ఫార్మ్స్' పర్ఫార్మెన్స్ ఇజ్ పవర్ అనేది ఒంటపట్టించుకున్నాడు. అంటే ఆధిపత్య భావజాల ప్రదర్శన (శక్తి) అంతా దాని అధికారంలో ఉంది. ఆ అధికారాన్ని పడగొట్టగలిగేది (ప్రజల) ప్రదర్శనయే.

బ్రిటిష్‌వాడి మార్కెటు పరిపాలనా మాయ అంతా దాని కోర్టుల్లో, జైళ్లలో, పోలీసుల్లో ఉంది. అమ్మకానికి ప్రజల్ని బలిపశువులను చేసే మాయ, అదీ ఆ తర్వాతి కాలంలో వాళ్ళే అధికారం అప్పజెప్పిపోయిన దళారీ షావుకారులు, అదే కోర్టులు, చట్టాలతో అమలు చేస్తున్నారన్న గ్రహింపు నుంచి ప్రజలంతా తిరుగబడే రోజు వస్తే ఏమవుతుందో 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' నుంచి 'సొమ్ములు పోనాయండి' దాకా చెప్పాడు.

అభ్యుదయ రచయితలు వదిలేసిందేమిటి– తెలంగాణలో ప్రజలు చేసిన సాయుధ పోరాటాన్ని. అంత మాత్రమే కాదు 1951 నాటికే ఎర్ర జెండాను. వాళ్ళు నమ్ముకున్న పార్టీ ఆ జెండాను, నెత్తురుటేర్లలో పారించిన ఎర్రగులాబీకి దాసోహం చేశారు, రావిశాస్త్రి అప్పుడు 'అల్పజీవి' నవలతో "రచయితలు ఏ మంచికి హాని చేస్తున్నారు, ఏ చెడుకు దోహదం చేస్తున్నారు" అనే పరిశీలనా దృక్పథంతో రచన ప్రారంభించాడు. ఆరు సారా కథల నాటికే వ్యవస్థ, రాజ్యస్వభావాలను నిశితంగా పరిశీలించి నెహ్రూ రాజకీయాలను నిశితంగా విమర్శించాడు, అయితే ఆయన న్యాయవాది అయిన ఇరవయ్యేళ్ళలోనే ఆయన ఆశించిన ప్రజల పోరాట వెల్లువ శ్రీకాకుళంలో వచ్చింది.

అల్పజీవి నుంచి ఆరు సారా కథలు దాకా శ్రీశ్రీ, కొ.కుతో పాటు రావిశాస్త్రి సాహిత్యంతో ప్రభావితమైన సృజన 1969 నవంబర్‌లో కథల సంచికపై కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి ముఖచిత్రం వేసింది. ఈ సంచికలో వాళ్ళ కథలు లేవు. (కొ.కు, ఇంటర్వ్యూ మాత్రం వేయగలిగాం) కానీ వాళ్ళ నుంచి యువ కథకులు ప్రేరణ పొందండి అని చిన్న నోట్ రాసింది.

అందులో కథ ప్రచురించబడిన అత్తలూరి నరసింహారావు

ఎమర్జెన్సీలో ఆయనతో పాటే జైల్లో ఉండడం యాదృచ్ఛికం కాకపోవచ్చు.

అభ్యుదయ రచయితలు ఎక్కడ వదిలేసి ఎక్కడ తేలారో కూడ మరింత నగ్నంగా విశాఖపట్నంలో శ్రీశ్రీ అరవై పుట్టిన రోజు సభలోనూ, ఆ తర్వాత ఎమర్జెన్సీలోనూ బయట పడింది.

రావిశాస్త్రి అక్కడ అందుకొని, విరసం నిర్మాణంలో నాయకత్వం వహించిన సాహిత్య సాంస్కృతిక సేనానిగా ఎక్కడ చేరాడో కూడ ఆ రెండు సందర్భాలే చరిత్రలో అరుణాక్షరాలతో లిఖించదగినవి.

1970 ఫిబ్రవరి 1వ తేదీన శ్రీశ్రీ షష్ఠిపూర్తి సభల్లో పాల్గొనడానికి వెళ్ళిన సృజన సాహితీ మిత్రులం ఆ రాత్రి ఆంధ్రా యూనివర్సిటీ హాస్టల్‌లో మమ్మల్ని కలవడానికి చలసాని ప్రసాద్ వెంట వచ్చిన రావిశాస్త్రిని మొదటిసారి చూశాం. ఆ 'చల్లని సముద్ర గర్భం' మీద పరచుకున్న మెత్తటి వెన్నెల వంటి చిరునవ్వుతో మమ్మల్ని ఆత్మీయంగా పలకరించాడు.

అక్కడ అభ్యుదయ రచయితల సంఘానికి ప్రాతినిధ్యం వహించే 'త్వమేవాహమ్' ఆరుద్ర ఆరోపణలకు శ్రీశ్రీ షష్ఠిపూర్తి మహాసభలో సమాధానం చెప్పే బాధ్యత రావిశాస్త్రి మీద పడింది. ఎందుకంటే అతను ఆహ్వాన సంఘ ఉపాధ్యక్షుడు. సమస్య శ్రీశ్రీ ఆరుద్రల వ్యక్తిగత వైషమ్యాలు కాదు. విశాఖ విద్యార్థులు సవాల్ విసిరినట్లుగా 'రచయితలారా "మీరెటువైపు?" అనే ప్రశ్నను అరసం శిబిరం నుంచి ఎదుర్కొనే బాధ్యత ఆరుద్ర, సోమసుందర్‌లపై పడింది. శ్రీకాకుళం ఆదివాసీ రైతాంగ సాయుధ పోరాటం వైపు అని చెప్పే బాధ్యత అరసం నుంచే అసంతృప్తితో వున్న శ్రీశ్రీ, కొ.కు, కెవిఆర్‌లపై పడింది. దిగంబర కవులు, తిరుగబడు కవులు సరేసరి. అప్పటిదాకా ప్రకటితంగా ఏ దృక్పథ రచయితల సంఘంలోనూ సభ్యుడు కాని, ఒక విధంగా 'సాగర గ్రంథ మాల' విశాఖలో (చలసాని ప్రసాద్, కృష్ణాబాయి, తుమ్మల వేణుగోపాలరావు, ఎన్.ఎస్. ప్రకాశరావు, కాళీపట్నం రామారావు మొదలైన వారితో పాటు) భాగంగా రావిశాస్త్రి విశాఖ విద్యార్థుల పక్షం నిలిచాడు. అంటే శ్రీకాకుళ పోరాటం వైపు నిలిచాడు. 'విశాఖ విద్యార్థు'లలో ప్రధాన భూమిక నిర్వహించిన జ్ఞానేశ్వర్ ఆ రోజుల్లో ఒక ఏడాదిపాటు "లాంగ్ మార్చ్" అనే పత్రిక నిర్వహించాడు. ఆ పత్రికకు 70 జూన్‌లోనే ఆయన ఒక సందేశం ఇచ్చాడు.

'.. .. విద్యార్థులు పేదవారికి ట్రస్టీలుగా ఉండనవసరం లేదు. వారి తరపున ఛాంపియన్లుగా ఉండవలసి వుంది. వారి పక్షాన నిలబడి ఏం చెయ్యాలి 'అనేది విద్యార్థిలోకం తెలుసుకోవాలి. అంటే లోకం మారడానికి విద్యార్థులేం చెయ్యాలో చర్చించుకోడానికి వారికి వారి పత్రిక చాలా అవసరం అని నా అభిప్రాయం.'

పైకి చూడడానికి ఇది చాలా మామూలు అభిప్రాయం వలె కనిపిస్తుంది. కానీ 70 ఫిబ్రవరి 2,3 తేదీల నుంచి ప్రారంభమై జూలై 4, 70 దాకా జరిగి ఒక కొలిక్కి వచ్చిన చర్చలో భాగమే ఆ అభిప్రాయం.

ఆ సభల్లోనే నక్సల్బరీ, శ్రీకాకుళ పంథాను, పోరాటాన్ని బలపరచే ఒక రచయితల సంఘం అవసరమని కొ.కు, జ్వాలాముఖిల ప్రతిపాదన.

ఈ వర్గపోరాటాన్ని నిర్వహిస్తున్న సిపిఐ ఎం.ఎల్ పార్టీ ఎటువంటి బహిరంగ కార్యకలాపాలు గానీ, ప్రజా సంఘాలు కానీ ఉండకూడదు, ఎక్కడికక్కడ విడివిడిగా నిర్మాణానికి అనుబంధమైన బృందాల దోహదమే ఉండాలి అనే అవగాహనతో ఉన్నది. రావిశాస్త్రి 'లాంగ్ మార్చ్' వంటి విద్యార్థి పత్రికల అవసరాన్ని చెప్తూ రచయితల సంఘం ఏర్పాటుకు కూడ మద్దతు ప్రకటించడం ఇందులో ఉంది. ఇది స్థూలంగా 'సాగర గ్రంథ మాల' అవగాహనగా, అభిప్రాయంగా విశాఖ నుంచి హైదరాబాదులో జులై 4 విరసం ఏర్పాటు దాకా తన మీద వేసుకొని చలసాని చేసిన కృషిని చాలా సందర్భాల్లో చెప్పాను. అందుకే న్యాయంగానే అట్లా ఏర్పడిన విప్లవ రచయితల సంఘానికి రావిశాస్త్రి ఇద్దరు ఉపాధ్యక్షుల్లో ఒకరయ్యారు. ఒక విధంగా అధ్యక్షుడు, మరొక ఉపాధ్యక్షుడు మద్రాసులో ఉన్న స్థితిలో. కార్యక్షేత్రంలో కార్యదర్శికి అండగా ఉన్న ఉపాధ్యక్షుడు ఆయనే అయ్యాడు. ఆయన విశాఖ విరసం యూనిట్లో భాగం కావడం వల్ల నిత్య క్రియాశీల కార్యక్రమాలకు దోహదం చేసింది.

అప్పటికి ఆయనకు ప్రజల న్యాయవాదిగా అపారమైన వృత్తి అనుభవం ఉంది. ట్రేడ్ యూనియన్‌లో తలమునకలుగా పని చేస్తున్న ఆకెళ్ళ కృష్ణమూర్తి, వాసిరెడ్డి వెంకటప్పయ్యలతో ప్రాణస్నేహం ఉంది. విద్యార్థి రంగంలో పని చేస్తూ విరసంలోకి వచ్చిన ఎన్. ఎస్. ప్రకాశరావుతో ఆత్మీయ స్నేహం వుంది. ఇంక కృష్ణక్క, వేణుగోపాలరావు, చలసాని ప్రసాద్‌ల ఇల్లు ఒక విరసం కార్యక్షేత్రంగా ఉంది. అది ఆయనకు 93లో మరణించేదాకా విరసంతో సజీవ సంబంధాలు కొనసాగించడానికి దోహదం చేసింది. అయితే ఇవి కొండ గుర్తులుగా చెప్పుకునేదే గానీ పోలీసు బాధితులు మొదలు రాజకీయ బాధితుల వరకు న్యాయం కోసం తన దగ్గరికి వచ్చేవాళ్లే కాదు పోరాటరంగంలోని అన్ని వర్గాల ప్రజలతో ఆయనకు సంబంధాలు వున్నాయి. శ్రీకాకుళ పోరాట నాయకత్వంతో బహిరంగ జీవితంలో చెట్టాపట్టాలేసుకొని టీచర్స్ ఫెడరేషన్‌లో నడిచిన మేరంగి భూషణం మాష్టారుకు రావిశాస్త్రి గురువు వంటివాడు.

విరసం ప్రథమ మహాసభలు, ఖమ్మం సుబ్బారావు పాణిగ్రాహి నగర్‌లో జరిగినప్పుడు ఆయన 'విప్లవ మార్గం' గురించి నిర్దిష్టంగా స్పందించాడు. దోచుకు తినడం అనేదే ఈ సమాజపు అసలు తత్వం. దాన్ని దాచకుండా మిగతావారికి చెప్పాలని రాయటం ప్రారంభించాడు. ప్రతి కళా ప్రచార మాధ్యమమే అన్నాడు. అప్టాన్ సింక్లియర్ భగవద్గీత రామాయణాలు, భారతం ప్రచారానికే పుట్టినవి.

అయితే మంచిని ప్రచారం చేయడం కర్తవ్యం. మార్క్సియన్ సోషలిస్టు సమాజంలోనే సమానత్వం సాధ్యమని తెలుసుకున్నాను.

ప్రజలను ధైర్యహీనులుగా చేయడమే ప్రభుత్వ లక్ష్యం. ప్రజలంటే భయం వల్లనే ఉన్న ఆయుధాలన్నీ ప్రభుత్వం దగ్గర, ధనికుల దగ్గరే వున్నాయి. అయితే వారు తమను చూసి భయపడుతున్నారని ప్రజలకు తెలియదు. భయం అనే ఈ అడ్డుగోడను (ఫియర్ బారియర్) ఛేదిస్తే విప్లవం వస్తుంది..... ఎన్ని బాధలున్నా ప్రజల్లో ధైర్యం కలిగిస్తే చాలు ధైర్యం ఉంటే మంచి లక్షణాలన్నీ పెంపొందుతాయి. ఈ భయాన్ని నిర్మూలించడమే రచయితల కర్తవ్యం – అని ప్రసంగించాడు.

1970 జూలై 4న పెండ్యాల కిషన్‌రావు సంపాదకత్వంలో విప్లవ కవులు వెలువరించిన 'మార్చ్' ను, అక్టోబర్‌లో విరసం మహాసభల్లో విరసం వెలువరించిన ఝంఝు (కె వి రమణారెడ్డి సంపాదకుడు)ను 71 మార్చ్‌లో ప్రభుత్వం నిషేధించింది. 'మార్చ్' సంపాదకుడు పెండ్యాల కిషన్‌రావును రాజద్రోహం నేరం కింద, అలాగే నక్సలైటు నాయకునికి ఆశ్రయమిస్తున్నాడనే ఆరోపణతో జనగామ తాలూకాలో చెన్నూరు గ్రామంలో అరెస్టు చేసారు. పుస్తకాలు జప్తు చేశారు. టార్చర్ చేసి వరంగల్ జైల్లో పెట్టారు. అప్పుడు 'ఓ ఆంక్షా ఓ అరెస్టు' అని రావి శాస్త్రి సృజనలో రాశాడు.

'శ్రీ కిషన్‌రావు గార్ని ప్రభువులు అరెస్టు చేసేరంటే, మనం ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. ప్రజల పక్షాన పిట్ట నిలుచున్నా

**" ప్రజల పక్షాన పిట్ట నిలుచున్నా సరే పెద్దలు దాని రెక్కలు విరిచి రక్తం తాక్క మానరు. అయితే వారు చేసే పాపాల గురించి మనం నిరసన తెలియచెయ్యక పోతే దెబ్బ తిన్న పిట్టల యెడల మనం పరమ పాపం చేసినవాళ్ళమవుతాం. " -రావిశాస్త్రి**

సరే పెద్దలు దాని రెక్కలు విరిచి రక్తం తాక్క మానరు. అయితే వారు చేసే పాపాల గురించి మనం నిరసన తెలియచెయ్యక పోతే దెబ్బ తిన్న పిట్టల యెడ మనం పరమ పాపం చేసినవాళ్ళమవుతాం.'

అయితే ఆ రచనలో 'నా ఆకాంక్ష ప్రతిఫలనం గురించి రాయాలి. ప్రజలను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేడు కవి' అనే సందేశంతో 'విప్లవకవులు' రాసిన కవితల ప్రచురణ బాధ్యత పల్లెటూరులో వ్యవసాయం చేసుకునే విరసం సంస్థాపక కార్యవర్గ సభ్యుడిగా తర్వాత ఎన్నికయిన కిషన్‌రావు చేశారు. ఆ పుస్తకం విరసం ఆవిర్భావ దినం రోజు శ్రీశ్రీ చేతుల మీదుగా హైదరాబాదు గోల్డెన్ థ్రెషోల్డ్‌లో (జులై 3 సాయంత్రం) ఆవిష్కరించుకున్నాం, డాక్టర్ ఎం. వి. రమణారెడ్డి తెచ్చిన 'ప్రభంజనం' పత్రికతో పాటు. కనుక ఫ్రెంచి విప్లవ విద్యార్థి ఉద్యమం (1968) లో మావోయిస్టు యువకులు తెచ్చిన పత్రికకు జీన్ పాల్ సార్త్ర్ అండగా నిలిచినట్లుగా విరసం అగ్రనాయకులు ఎవరైనా అండగా నిలవాలని నేను ఆకాంక్షించాను. నా మనస్సు చదివినట్లుగానే రావిశాస్త్రి రాశారు.

'ఈ విప్లవం రావడం న్యాయం అవుతుందా, అన్యాయం అవుతుందా? ఎవరన్యాయం చేసినా సరే ఆ అన్యాయం మీద తిరుగుబాటు చేయడం న్యాయమే అవుతుందని కిషన్ గారూ, నేనూ కూడా అంటాం...' అంటూ తనదైన శైలిలో అటువంటి దృష్టాంతాలు ఎన్నెన్నో ఇస్తాడు.

అదే సంవత్సరం బాంబులు దొరికాయని అరెస్టు చేసిన డాక్టర్ ఎం.వి. రమణారెడ్డి గురించి, పిడి చట్టం కింద అరెస్టయిన జ్వాలా రాజేశ్వరుల గురించి రాసాడు.

1991లోనే కొ.కు. రావిశాస్త్రిల సంపాదకత్వంలో 'ఇప్పుడు వీస్తున్నగాలి' వెలువడింది. ఆ సంకలనానికి కథల ఎంపిక ప్రధానంగా ఎన్.ఎస్. ప్రకాశరావు (పేపర్ టైగర్) మరువాడ రాజేశ్వరరావు, బి టి రామానుజం విశాఖ నుంచి, శ్రీపతి, చంద్ర, సి.ఎస్.రావు (ఊరుమ్మడి బతుకులు) హైదరాబాదు నుంచి చేసి, కొ.కు, రావిశాస్త్రిలవి చేర్చారు. అంకితం పేర్లు రావిశాస్త్రి గారు రాసారు. తప్పులయితే అందరం చేస్తాం. త్యాగాలు కొందరే చేస్తారు. శ్రీకాకుళ విప్లవోద్యమంలో అమరులైన వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం, పంచాది నిర్మల, కృష్ణమూర్తి, సుబ్బారావు పాణిగ్రాహికి అంకితం – ఈ సంకలనంలోనే పంచాది కృష్ణమూర్తితో పాటు 27 మే 1969న సోంపేట రైల్వే స్టేషన్‌లో అరెస్టు చేసి పోలీసులు ఎన్‌కౌంటర్ చేసిన అరుగురిలో ఒకడైన పద్మాలుగేళ్ల బంగారు బాబు, పాణిగ్రాహి జముకుల దళంలో స్త్రీ పాత్ర వేసే తామాడ చినబాబు ఉన్నాడు. అతని గురించి, ఆ ఎన్‌కౌంటర్ గురించి ప్రచారంలో వున్న కథనాల ఆధారంగా చెరబండరాజు రాసిన 'చిరంజీవి' కథ ఉంది. ఈ అంకితం, ఈ కథ గురించే ముఖ్యంగా 'ఇప్పుడు వీస్తున్న గాలి' నిషేధించబడింది. ఈ నిషేధానికన్నా ముందే ఈ పుస్తకం వెలువడగానే ఢిల్లీలో నేషనల్ బుక్ ట్రస్ట్ నిర్వహించిన అఖిల భారత స్థాయి పుస్తక ప్రదర్శనలో ఆ సంవత్సరం వచ్చిన తెలుగు సాహిత్యంలో ఉత్తమ పుస్తకంగా దానిని ప్రదర్శించారు. కనుక సహజంగానే ఆంధ్రప్రదేశ్ శాసనమండలి టీచర్స్ ఎంఎల్‌ఏలు ఈ నిషేధాన్ని ప్రశ్నించారు.

శ్రీకాకుళం జిల్లా నుంచి వాసిరెడ్డి కృష్ణమూర్తి హెూం మంత్రి. ఆయన నిషేధం జి.ఓ. చదవడం ప్రారంభించాడు. ఉత్తర్వులు-కారణాలు- ఆ అంకితం. చెరబండరాజు 'చిరంజీవి' కథ చదువుతూ ఉంటే ప్రశంసాపూర్వకంగా చప్పట్లు కొట్టిన శాసన మండలి సభ్యులు "అందులో నిషేధించవలసింది ఏముంది. అన్నీ వాస్తవాలే కదా" అన్నారు. అయ్యయ్యో నిషిద్ధ సాహిత్యం శాసన మండలిలో చదువుతున్నానని ఆయన నాలుక కరుచుకున్నారు. కానీ శాసనసభల్లో చర్చ అంతా చట్టబద్ధం అవుతుంది కనుక అప్పుడు ఎంఎల్‌సిగా ఉన్న కోటేశ్వరరావు తాను నిర్వహిస్తున్న 'తెలుగు విద్యార్థి'(మచిలీపట్నం) పత్రికలో అది ప్రచురించాడు. అట్లా కొ.కు, రావిశాస్త్రి, చెరబండరాజు వల్ల 'ఇపుడు వీస్తున్న గాలి' కథా సంకలనానికి విస్తృత ప్రచారం లభించింది.

1972లో ఏర్పడిన 'జననాట్యమండలి'లో హైదరాబాదులో చెరబండరాజు ఎంత భాగమయ్యాడో, విశాఖపట్నంలో రావిశాస్త్రి అంత లీనమయ్యాడు. స్వయంగా మంచి గాయకుడు. 'నరుడో! భాస్కరుడో' పాటను ఆయన నోట వినవలసిందే. విశాఖ పోర్టులో పనిచేస్తున్న వంగపండులో కళాకారుణ్ణి కనిపెట్టినవాడు రావిశాస్త్రియే. జగదంబ సెంటర్‌లో పోర్టు వర్కర్స్ ప్రదర్శనలో పాడడం చూసి, పరిచయం చేసుకొని విప్లవగీతాలు రాయాలని ప్రోత్సహించాడు. పార్వతీపురంకు చెందిన వంగపండు ప్రసాద్ ప్రజా వాగ్గేయకారుడుగా రూపొంది ఎన్నో విప్లవ పాటలు రాశాడు. విశాఖ జననాట్యమండలి పల్లెకారుల దగ్గరికి, చుట్టుపట్ల గ్రామాలకు ప్రదర్శనలివ్వడానికి వెళ్లినప్పుడు వీలయితే రావిశాస్త్రి కూడ వెళ్ళేవాడు. నరుడో భాస్కరుడు పాటకు ధూలా నృత్యం చేస్తూ సామూహికంగా పాడటం ఆయనకు యిష్టం. పల్లెకారుల దగ్గరికి, పల్లెలకు వెళ్ళే కార్యక్రమాల్లో చలసాని, నవత, మమత, నళిని కూడ పాల్గొనేవాళ్లు.

వంగపండు అనుకరణ గాయకుడు అనడంలో రావిశాస్త్రి ఆయన కవిత్వ శక్తిని, శ్రీకాకుళం బాణీలను భాషను పట్టుకునే అర్థంలో అనలేదు. ఆయన ఆదివాసీ సామాజిక నేపథ్యం నుంచి రాలేదు కనుక ఆ ఆదివాసీ భాషను, కళలు, సంస్కృతిని అనుకరించడమే అవుతుందనే అర్థంలో అన్నాడనుకుంటాను.

విరసం సభ్యుడు, పేపర్ టైగర్ కథతో ప్రసిద్ధుడైన విద్యార్థి నాయకుడు ఎన్.ఎస్. ప్రకాశరావు ఇంజినీరింగు పూర్తయ్యాక వాసిరెడ్డి వెంకటప్పయ్య ప్రోత్సాహంతో ఆయనే ఏర్పాటు చేసిన ఒక ల్యాబ్‌లో పరిశోధనలకు చేరి అది పేలి 1973 జూన్‌లో దుర్మరణం చెందాడు. ఆయనపై సృజనలో రావిశాస్త్రి సుదీర్ఘమైన ఎలిజీ రాశాడు.

రెండు రెక్కలు మండిపోయి
కళ్ళు రెండూ మాడిపోయి
ఏదేమైనప్పటికీ
పెనుపులితో
పిగిలిపిట్ట పోరాడినట్టు
పాపపు మృత్యువుతో
నువు సల్పిన
భీకర పోరాటం
అది

నీవు మాకిచ్చే సందేశం.

మరుక్షణంలో కాయితం మీద కలం పెట్టి కావలసినవారందరికీ సందేశాలందించిన నీ మనోధైర్యం నీ గుండె నిబ్బరం మాకాదర్శం.

1971లో జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లని పిడి చట్టం కింద అరెస్టు చేశారు. అప్పుడు జ్వాలా రమణ రాజేశ్వరులని సెప్టెంబర్ 71 సృజనలో రాశాడు.

అట్లాగే ఎం.టి. ఖాన్, చెరబండరాజులతో పాటు నన్ను 73 అక్టోబర్‌లో మీసా కింద అరెస్టు చేసినపుడు, కులమతరహితంగా ముగ్గురు రచయితలను 'వరవరరావు, చెరబండరాజు, ఎం.టి. ఖాన్‌లను' నిర్బంధించారు. పీడించేవాళ్ళంతా ఒక కులం వాళ్ళు కాదు. పీడించబడేవాళ్లు అన్ని కులాల్లోనూ వున్నారు. అందువల్ల వర్గం ముఖ్యం అన్నారు గానీ ఏదో ఒక మేరకు తొలినుంచీ బ్రాహ్మణీయ, హిందుత్వ భావజాలం అమలవుతున్న మన వ్యవస్థలో పీడితులు శ్రామిక కూలీల నుంచి, దళిత, ఆదివాసుల నుంచి వచ్చిన వారుగా, పీడకులు అగ్రకులాలవారుగానే ఉంటున్నారు. ఇంక దేశ విభజన, కశ్మీరు, తెలంగాణపై మిలిటరీ చర్య కాలంలోనూ, గత ఎనిమిది సంవత్సరాలుగానూ మరో సందర్భంలో రావిశాస్త్రి చెప్పినట్లు పీడకులు - పీడితులు, మనం - వాళ్ళు మత వివక్ష వచ్చింది.

రావిశాస్త్రి 1973 డిసెంబర్‌లో గుంటూరులో ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ఉపాధ్యక్షుడయ్యాడు. ఇంక రాష్ట్రవ్యాప్తంగానూ, విశాఖపట్నంలోనూ ఆయన కోర్టులో రాజకీయ ఖైదీల (ముఖ్యంగా నక్సలైటు ఖైదీల) న్యాయవాదిగా పార్వతీపురం కుట్ర కేసు విశాఖపట్నంలో ట్రయల్‌కు వచ్చినప్పుడు, బయట సభల్లో చేసిన కృషి విడిగా రాయవలసిన అంశం. 1974లో ఆరుగురు విప్లవ రచయితలు అరెస్టు అయి సికిందరాబాదు కుట్రకేసులో ఉన్నప్పుడు, ముఖ్యంగా కె.వి.ఆర్, త్రిపురనేని మధుసూదనరావు, చెరబండరాజు, ఎం.టి. ఖాన్ కూడా జైల్లో వున్నప్పుడు రావిశాస్త్రి విరసం ఉపాధ్యక్షుడుగా శ్రీశ్రీతో పాటు సభలకు తిరిగి, పత్రికల్లో రాయడమే కాకుండా సికిందరాబాదు పదవ మేజిస్ట్రేట్ కోర్టులో బొజ్జా తారకంతో పాటు విప్లవ రచయితల తరఫున వాదించాడు. 1974 అక్టోబరులో రాడికల్ విద్యార్థి సంఘం ఏర్పడింది. ఆర్ఎస్‌యు నిర్మాణదశలోనే రావిశాస్త్రి పాత్ర ఉన్నదని ఆయనను సన్నిహితంగా తెలిసిన ఉణుదుర్తి సుధాకర్ రాసిన 'రాచకొండ గుర్తులు' (కథల బంగారం - మన రావిశాస్త్రి) లో చదివి నేను ఆశ్చర్యపోయాను.

సురా గా పిలవబడే సి వి సుబ్బారావు, ఉణుదుర్తి సుధాకర్ ప్రాణ స్నేహితులు. రావిశాస్త్రి పట్ల ఆరాధనాభావం అనదగినంత అభిమానం ఉన్నవాళ్ళు.

"విశాఖలో ఆర్ఎస్‌యు స్థాపనకు ముందస్తు సంప్రదింపులు శాస్త్రిగారి ఇంట్లో డాబా మీద జరిగాయి. అప్పటి తొలి అధ్యక్షుడు రమణిని చూశాను. ఆ తర్వాత సురా ఉపాధ్యక్షుడు కావడం, యూనివర్సిటీ విద్యార్థి రాజకీయాల్లో పాల్గొని.... అరెస్టయిన సురా, రావిశాస్త్రి, తుమ్మల వేణుగోపాలరావు, చలసాని ప్రసాద్, భూషణం, అత్తలూరిలతో సహా విశాఖ సెంట్రల్ జైల్లో సుమారు సంవత్సరం పాటు ఉండడం - ఆ విశేషాలు కూడా చెబుతుండేవాడు. రావిశాస్త్రి రత్తాలు-రాంబాబు జైల్లోనే రాశాడు.

ఆర్ఎస్‌యు సందర్భం వచ్చింది కనుక రావిశాస్త్రి ప్రమేయం ఉన్న మరొక విషయం చెప్పాలి.

వరంగల్ రీజనల్ ఇంజనీరింగ్ కాలేజీలో సూరపనేని జనార్ధన్‌తో ప్రభావితుడైన ఆయన జూనియర్ చెరుకూరి రాజకుమార్ ఎమర్జెన్సీలో అరెస్టయి వరంగల్ జైల్లో వున్న ఒక నెల రోజులకే, 1975 జూలై 24-25 రాత్రి గిరాయిపల్లిలో మరో ముగ్గురు విద్యార్థులతో పాటు సూరపనేని జనార్ధన్ ఎన్‌కౌంటర్ జరిగింది. అక్టోబర్‌లో విడుదల అయిన రాజకుమార్ బిటెక్ పూర్తి చేసి పూర్తికాలం విప్లవ విద్యార్థి కార్యకర్తగా 1978 ఫిబ్రవరిలో వరంగల్‌లో ఆర్ఎస్‌యు రెండవ మహాసభల్లో రాష్ట్ర అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. విశాఖపట్నంలో ఆర్ఎస్‌యును గైడ్ చేయడానికి విప్లవోద్యమ నిర్మాణానికి విశాఖపట్నం ఇంజినీరింగు కాలేజీలో ఎం.టెక్‌లో చేరాడు. 1979లో విశాఖపట్నంలో ప్రైవేట్ బస్సులను జాతీయం చేయాలని ఆర్ఎస్‌యు నాయకత్వంలో విద్యార్థి లోకమంతా చారిత్రాత్మకమైన పోరాటం చేసి విజయం సాధించింది.

అయితే ఈ సందర్భంలో బస్సులు తగులబెట్టిన కేసులో రాజకుమార్‌ను అరెస్టు చేసి జైలుకు పంపారు. రావిశాస్త్రి రాజకుమార్ బెయిలు కోసం కోర్టులో వేయడమే కాదు, పూచీకత్తులు ఏర్పాటు చేశాడు. అప్పటికి రావిశాస్త్రికి, అతను విడుదలయినాక అజ్ఞాత జీవితానికెళ్తాడని స్పష్టంగా తెలుసు.

విరసం సభ్యుడు మానేపల్లి సత్యనారాయణ పుస్తకం 'ప్రజల మనిషి'కి 11-5-1974న పోరాటపు మాట అని ముందుమాట రాశారు. ఈ నాటికీ వర్తించేది 'మధ్యతరగతి మేధావుల్ని బెదిరించి ప్రజల్ని నిరాయుధుల్ని చేసి దోచుకు బతుకుతోంది ఈ ప్రభుత్వం. నీరు కూడా దొరకని ప్రజల నెత్తుర్ని మంచినీళ్లు తాగినట్లు తాగుతున్నారు. ఈ గుత్తాధిపతుల ప్రభుత్వంవారితో ఎలా పోరాడాలో ఈ ప్రజల మనిషి స్పష్టం చేస్తున్నారు.'

చరిత్రాత్మకమైన రైల్వే సమ్మెను బలపరుస్తూ 16-5-1974న సృజనలో రాశారు. సరిగ్గా అదే రోజు 20వ తేదీన సికిందరాబాదు కుట్రకేసులో నిందితులుగా చూపడానికి నన్ను, చెరబండరాజు, ఎం.టి ఖాన్, ఎం. రంగనాథంలను, జనగామ నుంచి గోపాలరెడ్డిని పోలీసులు అరెస్టు చేసి సిసిఎస్ బషీర్‌బాగ్ లాకప్‌లో పెట్టారు. అప్పుడు కాజీపేట డోర్నకల్ రైల్వే డివిజన్‌లో సూరపనేని జనార్ధన్ సమన్వయం చేసిన ప్రజాసంఘాలు (విరసంతో సహా) రైల్వే సమ్మెలో తలమునకలుగా ఉన్నాయి గనుక 20వ తేదీన కోర్టులో హాజరు పరిచే దాకా మమ్ములని రైల్వే సమ్మె సందర్భంలోనే అరెస్టు చేశారనుకున్నాం.

దేశంలో ఈ ప్రభుత్వము అన్ని వృత్తులవారినీ, అన్ని రంగాలలో శ్రామికులను అణచివేస్తూ, ఎదురుతిరిగితే నిర్బంధిస్తూ వుంటే వాళ్ళంతా ఈ ప్రభుత్వం తమది కాదని తెలుసుకుంటున్నారు. అదే విషయాన్ని ఇప్పుడు, ఈ రోజు మన రైల్వే కార్మికులు తెలుసుకుంటున్నారు -అని

"అయితే యింత మంచిది కాని ఈ ప్రభుత్వం ఎవరిదబ్బా! ఈ ప్రభుత్వం"

'జవాబు కావాలా?' 'కావాలి'

'అయితే అడగవయ్యా అల్లూరి సీతారామరాజుని'.

'అతనిప్పుడు లేదు కదా'

'అయితే వెళ్లవయ్యా వెంపటాపు సత్యం దగ్గరికి.'

'అతనిప్పుడు లేదు కదా'

'మరైతే అడగవయా మన చారు మజుందార్ని'

'అయ్యో అతనూ లేడే.'

'మరైతే మనం ఏం చేద్దామంటే' 'ఒక్కటి చేయాలి. విడివిడి సమ్మెల్లో పడి పడి లేచిన వారందర్ని ఒక్కసారిగా లేచి, ఉవ్వెత్తుగా లేచి పెను ప్రళయంగా ఓ సకలజన సమ్మెకు పిలుపునిద్దాం. అప్పుడు ఎవడైతే వారి మీదికి దండెత్తుతాడో వాడిది మాత్రం ఈ ప్రభుత్వం అని మనకు తెలిసిపోతుంది.'

'తెలిసిపోతుంది. బాగానే ఉంటుంది కానీ, తర్వాత ఏం చేద్దాం..'

మనమేమీ చేయకముందే ఇందిరాగాంధీ ఓడిపోయి ఎమర్జెన్సీ విధించి ప్రభుత్వాన్ని నిలుపుకున్నది. అంటే ప్రజలు మూడు రకాల పోరాటాలలో తీవ్రంగా నిమగ్నమయి ఉన్నారు. నక్సల్బరి, శ్రీకాకుళంలో సెట్‌బ్యాక్‌కు గురయినా, విప్లవశక్తులు స్వీయవిమర్శ చేసుకొని పునరేకీకరణ పొందుతున్నాయి. బాబూ నాయక్ తండా (జనగామ), గార్ల ఒడ్డు (వరంగల్), బోయినపల్లి (సికిందరాబాదు)లలో విప్లవపార్టీ ఏర్పడి, ప్రచారం కోసం విరసం ఏర్పాటు చేసి కుట్ర చేసిందనేదే సికిందరాబాదు కుట్ర కేసు. ఆరు మంది విరసం నాయకత్వాన్ని విప్లవ పార్టీ నాయకులు, సానుభూతిపరులతో కలిపి పెట్టింది. 1970-74 మధ్యన ఆ నాయకత్వంలో తెలంగాణలో జరిగిన విప్లవ చర్యలే విరసం ఏర్పాటు, సభలతో సహ ఇందులో ఆరోపణలు.

ఇంక బీహార్‌లో జె.పి ఉద్యమం, అది విస్తరించి గుజరాత్‌లో నవ నిర్మాణ సమితి ఉద్యమం, దానికి పరాకాష్ఠగా జార్జి ఫెర్నాండెజ్ మిలిటెంట్‌గా నిర్వహించి విప్లవ శక్తులు బలపరచిన రైల్వే సమ్మె నిజంగానే కేంద్ర ప్రభుత్వాన్ని భయపెట్టాయి. ఇందిరాగాంధీ ఎన్నికను కోర్టులో కొట్టి వేయడం ఆ ప్రభుత్వాధినేత పరిపాలనపై ప్రజల తీర్పుకు ఒక చట్టబద్ధ వ్యక్తీకరణ మాత్రమే.

ఎమర్జెన్సీలో రావిశాస్త్రి అరెస్టు అనేది రచయితగానూ, న్యాయవాదిగానూ ఆయనకున్న అశేష ఆమోదం కన్నా విప్లవోద్యమ నిమగ్నతయే రాజ్యానికి బేరీజు వేసుకునే కారణమైంది. ఆయనను కూడా చలసాని, సుబ్బా వంటి యాక్టివిస్టుగానే చూశారు. జైల్లో నుంచి విరసంకు రాజీనామా చేస్తూ ఆయన కార్యదర్శి కెవిఆర్ కు లేఖ రాశారు.

ఇప్పుడు వెనక్కి తిరిగి చూస్తే ఆయన విరసంలో ఉన్నప్పటి కన్నా తర్వాతనే 1988 నుంచి 93 దాకా ఎక్కువగా విరసం కార్యకలాపాల్లో పాల్గొన్నాడు. రాశాడు.

అందులోకి వెళ్ళేముందు 1970-75కి ముందు ఆయన విరసం ఉపాధ్యక్షుడిగా ఎంత బాధ్యతతో వ్యవహరించాడో ఒక్క ఉదంతం ప్రస్తావిస్తాను.

"ఎవరో ఒక పెద్దాయన మా న్యూస్ ఎడిటర్ తెన్నేటి కేశవరావు గారి ముందు కుర్చీలో కూర్చున్నాడు. తలెత్తి చూస్తే గుండె గుభిల్లుమంది. వచ్చిన వాడు సాక్షాత్తు రాచకొండ విశ్వనాథ శాస్త్రి.....

రావిశాస్త్రి ఒక న్యూస్ ప్రింటు కాగితం తీసుకుని పది పన్నెండు లైన్లు రాసి, న్యూస్ ఎడిటర్ చేతికిచ్చి, వినయంగా, చిన్నగా నవ్వి నెమ్మదిగా వెళ్లిపోయాడు.... కేశవరావుగారు నా చేతికి ఆ కాగితాన్నిచ్చి విరసం ప్రకటనని వార్తగా రాయమన్నారు.

తర్వాత రోజుల్లో రావిశాస్త్రి కోసం ఒక విరసం మీటింగుకు వెళ్లాను.... "మరేన్లేదు. నేను చెప్పొచ్చేదేమంటే ... ఈ లోకంలో పేదవాడికి న్యాయం జరగాలి. ఏ చెడుకూ మేలు జరగకూడదనీ, ఏ మంచికీ హానీ జరుగకూడదనీ అనుకుంటున్నాను. కవులైనా, రచయితలయినా కష్టజీవుల పక్షానే ఉండాలని నేను అనుకుంటున్నాను అని చెప్పి ముగించారు."

ఈ మాటలు రాసింది తాడి ప్రకాష్. అప్పుడాయన విశాఖలో ఈనాడులో సబ్ ఎడిటర్, విరసం పట్ల ఆయనకున్న అసహనానికి తెలుగులో మాట లేదు. కంటెంప్ట్ తప్ప. ఆయన నోట వింటున్నాం రావిశాస్త్రికి విరసం పట్ల ఎంత బాధ్యత ఉందో.

విరసంలో ఉండగా రావిశాస్త్రికి విరసంతో అభిప్రాయ భేదాలు లేవా? ఉన్నాయి. ముఖ్యంగా, బంగ్లాదేశ్ విముక్తి పోరాటం శ్రీలంకలో తిరుగుబాటు పై.

విరసం తూర్పు పాకిస్థాన్‌లో తొలి బంగ్లా జాతి విముక్తి పోరాటాన్ని, ముఖ్యంగా మౌలానీ భషానీ (చారు మజుందార్-నక్సల్బరీ ప్రభావంలో మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ ఏర్పాటు చేసిన నాయకుడు) నాయకత్వంలో ఇందిరా - యాహ్యా ఏక్ హై, దో బంగాల్ ఏక్ హై అని నినదించిన విప్లవశక్తులకు సంఘీభావంగా ఎన్.కె సంపాదకత్వంలో 'బంగ్లాదేశ్' కవితా సంకలనం కూడా వచ్చింది. ఆ తర్వాత ముజిబుర్ రహ్మాన్ నాయకత్వానికి మద్దతుగా ఇందిరా గాంధీ ముక్తి ఫౌజ్‌ను పంపించి 'విముక్తం' చేశాక తెలంగాణలో నెహ్రూ సైనిక దురాక్రమణతో పోలుస్తూ వైఖరి తీసుకున్నది. సృజన జనవరి 72లో రావిశాస్త్రి బంగ్లాదేశ్-ఇండియా-చైనా అని చిన్న లేఖ రాశాడు.

'వియత్నాంలో అమెరికా చర్యలను ఖండిస్తూ ఐక్యరాజ్యసమితిలో ఏ తీర్మానమూ ప్రతిపాదించని చైనా, బంగ్లాదేశ్‌కు ఇండియా మద్దతు గురించి గొంతు చించుకోవడం ఆశ్చర్యంగా వున్నది. ఇండియాలోని నాగాలకు, మిజోలకు చైనా సహకారాన్ని ప్రకటించినపుడు బంగ్లాదేశ్‌లోని బెంగాలీలకు ఇండియా ఎందుకు మద్దతు ఇవ్వకూడదు'

ఇందులో రావిశాస్త్రి భారత ప్రభుత్వం గురించి నిర్విచక్షగా ఉన్నారు. తర్వాత విశాఖపట్నంలో విరసం సభలోనే ఈ నిర్విచక్ష గురించి నేను ప్రస్తావించవలసి వచ్చింది. ఇంకెందుకు కాకపోయినా బంగ్లాదేశ్ ఏర్పడడం, ఇవ్వాళ ప్రపంచంలోని అత్యంత దుర్భర రాజ్యహింసకు గురియై వలస వచ్చిన పది లక్షల మంది రోహింగ్యాలకు ఇండియా ఆశ్రయం యివ్వడానికి నిరాకరించినపుడు, బంగ్లాదేశ్ యిచ్చినందుకైనా మనం సంతృప్తి చెందాలి. నజ్రుల్ ఇస్లాం వంటి విద్రోహి కవికి ఆశ్రయం ఇచ్చినందుకు సంతోషించాలి.

రావిశాస్త్రి సమైక్యవాదం గురించి, విశాలాంధ్ర భావన గురించి సెంటిమెంటల్‌గా లేదు గానీ 1972లో ప్రత్యేక తెలంగాణ, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాల పట్ల క్రిటికల్‌గానే ఉన్నాడు. బ్రహ్మానందరెడ్డి, కాకాని వెంకటరత్నం వంటి పాలకులే పల్లకీలో ఊరేగుతారు గానీ ప్రజలు బోయీలుగానే ఉంటారని ఆయన అవగాహన. అయితే ఈ రెండు ఉద్యమాల పైన రాజ్యహింస గురించి మాత్రం తీవ్రమైన ఆగ్రహాన్ని ప్రదర్శిస్తూ మాట్లాడాడు, రాశాడు. సకల జనులు సమ్మె చేసి, పనులన్నీ బంధు పెడితే బస్సులు, రైళ్లు కూడా పోలీసులు, అర్ధ సైనిక బలగాలు నడిపినపుడు ఈ ప్రభుత్వాలను ఎవరు నడుపుతున్నారో ఇప్పుడు స్పష్టంగా బయటపడుతున్నదని రాశాడు.

బహుశా ఈ తరానికి చాలా ఆశ్చర్యమనిపించేది ఆయన భారత, రామాయణాల నుంచి, పురాణాల నుంచి తీసుకునే పోలికలు రాముడు, నృసింహస్వామి వంటివి. అట్లాగే రావణాసురుడు, హిరణ్యకశ్యపుని వంటి వారి విషయంలో ఆధిపత్య భావజాల అవగాహననే.

విరసం ఏర్పడిన కొద్ది రోజులకే 31.7.70న సృజన ఆగస్టు-అక్టోబర్ సంచికలో ఆయన 'రాముడు' అనే శీర్షికతోనే మొట్టమొదటి సారి ఒక రచన చేసారు. 1970 జూలై 4న విరసం పుట్టింది. 1970 జూలై 10న పార్వతీపురం కొండల్లో గిరిజన నాయకుడు సత్యాన్ని కాంగ్రెస్ ప్రభుత్వం కాల్చి చంపింది. ఈ నేపథ్యంలో రాసిందే వ్యాసం అని నోట్ వుంటుంది. ఆ వ్యాసం యిట్లా ముగుస్తుంది.

".... నా గుండెల మీద కూర్చున్న పెద్ద పులి మనసు మార్చుకొని సన్యాసం పుచ్చుకొని కమండలం పుచ్చుకొని తావళం తిప్పుకొంటూ వాయుభక్షణం చేసుకుంటూ హరి నామ సంకీర్తనలో కాలం గడుపుతుంటే దానికీ నాకూ పేచీ లేదు. లేకపోతేనే పేచీ."

ఇది చదివిన నా స్నేహితుడు ఒకాయన చిరునవ్వు నవ్వి నీ గుండెల మీద కూర్చున్నది పెద్ద పులి కాబట్టి మారదు. కానీ కూర్చున్నది

మనిషైతే మారొచ్చు కదా అన్నారు. అప్పుడు నా వంతు ప్రకారం నేను చిరునవ్వు నవ్వి, 'వాడే మనిషైతే అలా కూర్చోనే కూర్చోడు కదా' అన్నాను. ఈ కొస మెరుపులో మార్క్సిస్టు రావిశాస్త్రి ఉన్నాడు.

1980లో హైదరాబాదులో విరసం దశాబ్ది ఉత్సవాలు అక్టోబరు నెలలో జరిగాయి. ఆగస్టులో కుటుంబరావుగారు చనిపోయారు. ఆ సభకు వరూధిని గారిని, రావిశాస్త్రి గారిని విరసం ప్రత్యేకంగా ఆహ్వానించింది. (కొ.కు. నగర్ లో జరిగిన సభలవి)

'నా వ్యక్తిగత జీవితంలో విరుద్ధ ప్రవర్తన వుంది. అందుకే విరసంలో సభ్యుడిగా ఉండలేకపోయా. విరసం ఆశయాలే నా ఆశయాలు. ఆ లక్ష్యాలతో పూర్తిగా ఏకీభవిస్తున్నా. నాకు విరసంతో ఎలాంటి భేదాభిప్రాయాలు లేవు. సాహిత్యం, రాజకీయాలలో నేను విరసంతో ఆమోదిస్తున్నా. హింసను బోధిస్తున్నారని విరసం వారి మీద ఒక ఆరోపణ వుంది. కానీ విరసంది హింస కాదు. ప్రతిహింస. హింస ఎప్పుడూ ప్రభువులదే. ప్రజలది కాదు. ఆయుధాలన్నీ ప్రభువుల దగ్గరే వున్నాయి. వాటితో జనాన్ని అణచిపెడుతున్నారు' అంటూ ఆంధ్ర సరిహద్దులోని ఉత్తరఆర్కాట్, ధర్మపురి జిల్లాల్లో అప్పుడప్పుడే రగుల్కొంటున్న రైతాంగ పోరాట ప్రస్తావన తెచ్చి, వ్యవసాయ కూలీల పోరాటమది. మరి పోలీసులు ఎవరి తరపున వచ్చారు? వచ్చి బుగతల కొమ్ము కాశారు, ప్రజల్ని పిట్టల్లా కాల్చి చంపుతున్నారని - ముగించాడు.

విశాఖ విరసం సభలో 26-07-1981న సంస్కరణవాదం - విప్లవవాదం అనే అంశంపై అధ్యక్షోపన్యాసం చేశాడు.

విశాఖ విరసం, రావిశాస్త్రి ఎంత అవిభాజ్యమైన యూనిట్ అంటే కృష్ణాబాయి, చలసాని వంటి సీనియర్స్ ఉన్నచోట కూడా రావిశాస్త్రిదే అధ్యక్షోపన్యాసం. మళ్ళీ 27-12-1981న విరసం సాహిత్య సమావేశంలో 'ఇవాళ ప్రభుత్వం విప్లవ రచయితల మీద దాడి చేస్తోంది. అయితే విప్లవ రచయితలు చెదరడం లేదు. నిబ్బరంగా నిలబడుతున్నారు. జైళ్లపాలవుతున్నారు. కేసుల్లో ఇరుక్కుంటున్నారు. ఆరోగ్యాలు కోల్పోతున్నారు. ఆసుపత్రుల్లో మగ్గుతున్నారు. సమాజానికి కావాల్సింది విప్లవ రచయితలే' అని మాట్లాడాడు.

1985 జూలై 25నాడు వరంగల్ జిల్లా మానుకోట (మహబూబాబాదు)లో రాడికల్ విద్యార్థి సంఘం గిరాయిపల్లి విద్యార్థి అమరుల సంస్మరణ సభ నిర్వహించింది. ఆ సభకు మహబూబాబాదు జనాభాకు మూడు రెట్లు, వేల సంఖ్యలో జనం వచ్చారు. తిరుగు ప్రయాణంలో వాళ్ళను టికెట్లు లేకుండా రైలెక్కనివ్వడం లేదని, లాఠీచార్జీ చేస్తున్నారని వేదిక మీద ఇంకా ప్రసంగిస్తున్న నాకు సమాచారం వచ్చింది. వచ్చేప్పుడు రానిచ్చి అంతమందిని వెళ్ళేటప్పుడు వెళ్ళనివ్వకపోతే ఆ పట్టణ ప్రజలకే అసౌకర్యమవుతుందని నేను పోలీసులకు విజ్ఞప్తి చేశాను. బాగా అర్ధరాత్రి సమయం. ఆ చీకట్లో రైలు తలుపులు తెరవకుండా, జనాన్ని ఎక్కనివ్వకుండా చెదరగొట్టడానికి గాలిలో కాల్పులు కూడా జరిపినట్టున్నారు. మర్నాడు ఉదయం రైలు దిగగానే నన్ను పోలీసులు అరెస్టు చేశారు. నా అరెస్టును, పోలీసు చర్యలను ఖండిస్తూ రావిశాస్త్రి, కాళీపట్నం రామారావు 26-07-1983న పత్రికా ప్రకటన ఇచ్చారు.

ప్రకటనతో మాత్రమే 83 నాటికి కూడా రావిశాస్త్రి విరసం పట్ల తన బాధ్యత మరచిపోలేదు. శ్రీశ్రీ మరణం తర్వాత శ్రీశ్రీని కించపరుస్తూ, చలసాని ప్రసాద్‌ను తప్పు పడుతూ ఆరుద్ర రాసిన దానిని ఖండిస్తూ 'విశాఖ మెడికల్ కాలేజీకి శ్రీశ్రీ గారి భౌతికకాయాన్ని ఇచ్చి ఉండినట్లయితే ఆ కాలేజీవారు పరిశీలించి పాఠాలు నేర్చుకుంటానికి శ్రీశ్రీ గారి మెదడునైనా నిల్వ చేసేవారు. పోనీయండి ఆయన జన్మస్థలంలో దహనపర్చడానికి ఆయన మృతదేహాన్ని విశాఖ తెచ్చి ఉండినట్లయితే లక్షలాది ఆంధ్రులు కూడా ఆయన్ను ఆఖరుసారి చూసి ఉండేవారని' శ్రీశ్రీ పట్ల తన అపార గౌరవాన్ని, చలసాని పట్ల అభిమానాన్ని ప్రకటించడమే కాకుండా ఎంతో శక్తివంతంగా విరసాన్ని సమర్థించారు.

"తరువాత ఆ సంచిక (ఆంధ్రజ్యోతి)లో 37వ పేజీలో "శ్రీశ్రీ విరసం జేబులో కలమా?" అనే శీర్షిక కింద రాసిన అంశాలు విరసం వారి యెడల విపరీతమైన ద్వేషంతో రాసినట్టుగా నాకు తోస్తున్నాయి. ఆ అంశాలు ఎవరు రాసినవో మీరు చెప్పలేదు. కానీ, మహాకవి శ్రీశ్రీని మహాకవిగా మార్చినది మేమేనని ఏ విరసం సభ్యుడు ఎప్పుడు చెప్పేరో ఆ రచయిత చెప్తే బాగుండేది. విరసం సభ్యుల్లో ఎవరూ ఎప్పుడూ అలా చెప్పి ఉండలేదు."

అదే వ్యాస సందర్భంలో మరొక విషయం.

మహాకవి శ్రీశ్రీగారి మరణం గురించి యావదాంధ్ర దేశం విచారించి కంట తడి పెట్టింది. కానీ ఆ మరణం శ్రీశ్రీ గారి "మిత్రులు, హితులు, ఆత్మీయులు, అభిమానులు, అభిమానాలు" - వారందరికీ కలిగే విచారపు ఆవేదనా, కన్నీటిధార కూడా మిగతావారికి కలిగిన దానికంటే ఎక్కువ స్థాయిలో ఉంటాయి కదా! ఉంటాయి ఏంచేతనంటే మిగతావారికంటే వారికి ఆయన దగ్గరి మనిషి, స్వంత మనిషి కాబట్టి అటువంటప్పుడు విరసం జన్మకి కారణభూతులు, ఒక దశాబ్దానికి పై నుంచీ చివరి క్షణం వరకూ విరసం ఆశయాలతో ఏకీభవిస్తూ నిల్చిపోయిన శ్రీశ్రీ గారిని విరసం సభ్యులు తమ స్వంత మనిషిగా భావించుకుంటే అందులో తప్పు వున్నదా? ఉన్నదని నేననుకోను.

"శ్రీశ్రీ విరసం జేబులో కలం మాత్రమే కాదు అన్యాయాలని ఎదిరించి హతమార్చడానికి ఇచ్ఛాపూర్వకంగా విరసం చేతికి వెళ్ళి అమరిన మహత్తర శక్తి మహాకవి శ్రీశ్రీ అని రావిశాస్త్రి 29-7-1983 ఆంధ్రజ్యోతి వారపత్రికలో రాసాడు.

శ్రీశ్రీ మరణం తర్వాత మద్రాసు వెళ్ళిన చలసాని ప్రసాద్, కెవిఆర్, టి.ఎం.ఎస్‌లు శ్రీశ్రీ తన వీలునామాలో రాసినట్లు తన మృతదేహాన్ని విశాఖ మెడికల్ కాలేజీకి ఇవ్వాలని సరోజ గారిని కోరినప్పుడు ఆమె నిరాకరించింది. అక్కడే అంత్యక్రియలు జరిగాయి.

కానీ విరసం చేసిన ప్రతిపాదనను ఆంధ్రజ్యోతి వారపత్రిక పురాణం సుబ్రహ్మణ్య శర్మ వివాదాస్పదం చేశారు. పేరు పెట్టకుండా రాసిన రచయిత ఆయనే. ఆయనకు రావిశాస్త్రి అంటే ఆరాధనా భావంతో కూడిన అభిమానం అయినా నిర్మొహమాటంగా శ్రీశ్రీని, తనను సమర్థించుకోవడానికే కాదు విరసంలో లేని రావిశాస్త్రి, విరసంను, అందులోని ప్రతి సభ్యుణ్ణి సమర్థించడానికి ఇంత బాధ్యతతో రాశాడు.

బలివాడకాంతారావు కథలు ఆవిష్కరిస్తూ ఆయన 5-9-87న చేసిన ప్రసంగం రచయిత-దృక్పథం అనే పేరుతో అరుణతార నవంబర్ 87-జనవరి 88 సంచికలో వచ్చింది.

'పీడిత ప్రజల బాధలు సుబ్బారావు పాణిగ్రాహి బాగా పసికట్టారు.... పది మంది బాగు గురించి ఆలోచించేవాళ్లు కేవలం విషయాలు తెలుసుకొని ఊరుకోకూడదు. దాన్ని పోగొట్టడానికి ఏదో ఒకటి చేయాలి ఏం చేస్తే బాగుంటుందో నిన్న శ్రీకాకుళం పోరాటం చెప్పింది. ఇవాళ వరంగల్ పోరాటం చెప్తూంది. నేనూ అదే సరయిందని తలుస్తున్నాను. ఈ మార్పు జరిగితీరాల్సిందే. దీనికోసం మన అందరం మారాల్సిందే.' (ఉత్తరాంధ్ర విరసం మహాసభ 24-12-89).

నాకు తెలిసి నాకు జ్ఞాపకం ఉన్న చివరి ఉపన్యాసం ఆయన

1991 విశాఖ విరసం సాహిత్య పాఠశాలలో చేసాడు. అప్పుడు వేదిక మీద నేను కూడా వున్నాను. అప్పుడు కూడ 'నేను విరసంలో లేను కానీ విరసంతోనే ఉన్నాను' అని దశాబ్ది ఉత్సవాల సందర్భంలోకన్నా అద్భుతంగా మాట్లాడాడు.

నేను కూడా మాట్లాడాక, సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతూ వుంటే ఇద్దరమూ వెళ్ళి జనం వెనుక ఒక మూల నిలబడ్డాం. గాలిలో ఒక అద్భుతమైన అపూర్వమైన స్వరం తరంగాలుగా జీరబోయిన గొంతుతో వినొస్తున్నది. ఈ ప్రజాగాయకుడెవరో ఇతడిదే భవిష్యత్తు అని ఇద్దరమూ ఒకేసారి అనుకున్నదే అనేసాం. అదే గోరటి వెంకన్న గొంతు.

అంతకు ముందు సంవత్సరమే 1990 ఫిబ్రవరి 18వ తేదీన జననాట్యమండలి సదస్సు తర్వాత సాయంత్రం ప్రెస్‌క్లబ్‌లో ఆ సందర్భంగా అజ్ఞాతం నుంచి బయటికి వచ్చిన గద్దర్ ప్రెస్ కాన్ఫరెన్స్‌లో పాల్గొనడానికి రావిశాస్త్రి ప్రత్యేకించి హైదరాబాదుకు వచ్చాడు. ఆయన అధ్యక్షతన చలసాని ప్రసాద్ కూడా పాల్గొన్న బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో గద్దర్ తాను కొత్తగా రాసిన 'పొద్దు తిరుగుడు పువ్వు పొద్దును ముద్దాడే' పాట వినిపించి సభను సమ్మోహితం చేసి చార్జ్ చేశాడు.

గద్దర్ గురించి రావిశాస్త్రి ఏం మాట్లాడాడో నా జ్ఞాపకం నుంచి కాకుండా గ్రంథస్థం అయింది రాస్తాను '..గద్దర్‌ది సహజమైన ఉద్రేకం. ఇంపుగా ఉంటుంది. వాయిస్ కల్చర్ వుంది. అది అతడికి తెలియకపోవచ్చు.... గద్దర్‌ది నేచురల్ ఎమోషనల్ బేసిస్. ...'నాది సహజ జలపాతము' అని సుంకు అప్పారావు అంటుండేవాడు. అట్లాగా గద్దర్‌ది సహజ జలపాతం... కంఠం బాగా ఎత్తి పాడలేనివారిని చూస్తే నాకు చాలా చిరాకు. సింహంలా గర్జించవలసి వచ్చినపుడు ఎలకలా కిచకిచలాడినట్లు పాడితే ఎలా? (త్రిపురనేని శ్రీనివాస్ ఉదయం 21-09-88).

'సారాంశం' లోకి వెళ్ళే ముందు రావిశాస్త్రి 'సారా కథలు' దృక్పథంతో, అవగాహనతో జననాట్య మండలి గద్దర్ ద్వారా ఎపిసిఎల్‌సి బుర్రా రాములు ద్వారా, 'ఆ కళ్ళు చూస్తున్నాయి' (కె. రాంమోహన రాజు) వంటి సాదా కథలు, అల్లం రాజయ్య కథల ద్వారా విప్లవ సాహిత్యం, విరసం ఎట్లా కనెక్టయ్యాయో క్లుప్తంగా ప్రస్తావిస్తాను. ఇది విడిగా సారా-రాజ్యం-సాహిత్యం-ప్రజలు అనే అంశంగా పరిశోధించవలసిన అంశం. ఎందుకంటే మతం అనే (మన దేశంలోనైతే కులం అనే) పుట్టుకతో వచ్చిన జబ్బుతో పాటు ప్రజలకుండే కల్లు, సారా, గుట్కా మొదలైన మాదకద్రవ్యాల బలహీనతపై ప్రభుత్వాలు బతుకుతున్నాయి. దోపిడీ వర్గాలు తమ దోపిడీని, అణచివేతను అమలుచేస్తున్నాయి. రాజ్యానికి, కల్లు, సారాలకున్నలింకు చూద్దాం. సెంట్రల్ ఎక్సైజ్, స్టేట్ ఎక్సైజ్ (ఆబ్కారీ) అనే ప్రభుత్వ శాఖల ద్వారా ఈ మాదక ద్రవ్యాల చట్టబద్ధ, చట్ట వ్యతిరేక కార్యకలాపాలను ప్రభుత్వాలు నియంత్రిస్తాయి. వీటితో పాటు ఆయా కాలాల్లో చేసే శాసనాలు, అమలు చేసే పోలీసులు, ఆ పైన చట్టాలను అన్వయించవలసిన కోర్టులు ఉంటాయి. బ్రిటిషిండియా కాలంలోనే బ్రిటిష్ తొత్తు సంస్థానమైన నైజాం రాష్ట్రంలో చక్కెర మిల్లులొచ్చాయి. చెరుకునుంచి చక్కెర తీసే క్రమంలో వచ్చే మొలెసెస్‌ను సారా తయారుచేయడానికి వాడుతారు. నైజాం కాలంలో బొబ్బిలి నుంచి బోధన్ దాకా చక్కెర ఫ్యాక్టరీలు నిజాం షుగర్ మిల్స్ పేరుతోనే వచ్చాయి. కనుక అందులో వచ్చే మొలెసెస్ నుంచి సారా తయారు చేసే విధానంపై ప్రభుత్వ నియంత్రణ వచ్చింది. అట్లే కల్లు వచ్చే తాటి, ఈత చెట్లు ఉండే భూములు ప్రైవేటువైతే భూమి, చెట్టు పన్ను రూపంలోనూ, భూమి ప్రభుత్వందైతే సరేసరి - కల్లు వ్యాపారంపై కూడ ప్రభుత్వానిదే నియంత్రణ. అందుకే రావిశాస్త్రి గారు సారాపై ప్రభుత్వ నిషేధం ఉన్న కాలంలో రాసిన 'సారా కథలు' వస్తే, మిగతా సాహిత్యం అంతా అక్టోబర్ 2 గాంధీ జయంతి రోజు కల్లు, సారా వ్యాపారాలు కాంట్రాక్టర్లకు వేలం వేసే కాలంలో వచ్చాయి. ఆ గతమంతా ఇక్కడ ప్రస్తావించను కానీ, 1967 నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల తర్వాత ఒక రకంగా సెట్‌బ్యాక్ కాలంలోనే 1972లో జననాట్యమండలి వచ్చింది. రావిశాస్త్రి సారా నిషేధం కాలంలో సారా వ్యాపారం అధోలోకాన్ని ముందుపెట్టి దోపిడీ, అణచివేతలు అమలుచేసిన 'మాయ' (పోలీసుల, కోర్టుల మాయ) గురించి రాస్తే, నిషేధం లేని కాలంలో కల్లు, సారా వ్యాపారం ద్వారా రాజ్యం చేసిన మాయ గురించి గద్దర్ రాసాడు. 'కల్లు ముంతో మాయమ్మ' అని అల్వాల్‌లోని కల్లు దుకాణం దగ్గర మొదలుపెట్టి, గుడుంబావంటి ఇతర మాదక ద్రవ్యాల గురించి రాస్తూ సారాను 'మమ్మేలే రాజ్యానికి మారుపేరువే నువ్వు' అని ఇంక నేను ఏమీ తాగను నను దోచుకునేవాని రక్తం తాగుతానని ముగిస్తాడు. కానీ విప్లవోద్యమం మాత్రం చైతన్యపూర్వకంగానే ఈ సారా వేలం పాటలు, సారా అమ్మకాలలో సారా కాంట్రాక్టుల విషయంలో ప్రజల తరపున కనెక్ట్ కావడం 1980ల నుంచే మొదలైంది. ప్రజలకు సంబంధించిన విద్య, ప్రయాణ సౌకర్యాలు, అభివృద్ధి కార్యక్రమాల్లో ముఖ్యంగా కరీంనగర్, వరంగల్ నుంచి గ్రామీణ ప్రాంతాల్లో రాడికల్స్, పీపుల్స్‌వార్ గణనీయమైన పాత్ర నిర్వహించింది. అందులో కీలక ఘట్టం ఎన్టీఆర్ ముఖ్యమంత్రిగా స్వయంగా ప్రభుత్వ సారా దుకాణం (ప్రసాదు) ఊరూరా నెలకొల్పి, తండాలల్లో లంబాడాలు, పేదజనం, అడవిలో ఆదివాసీలు ఇప్ప పూవు వంటి లభ్య పదార్థాలతో తమకవసరమైన సారా తయారుచేసుకునే బట్టీలపై దాడులు మొదలుపెట్టాడు. ముఖ్యంగా వరంగల్ జిల్లాలో మాగంటి రవీంద్రనాథ్ చౌదరి అనే ఖమ్మం, వరంగల్ జిల్లాల సారా కాంట్రాక్టర్ ఇటువంటి తండాలపై గిరిజనుల మీద, వరంగల్ కోట, హనుమకొండలో ప్రజా సంఘాల కార్యకర్తల మీద పోలీసుల సహాయంతో మాఫియా చేసిన దాడిని ప్రతిఘటించిన పోరాటాల నేపథ్యంలో వచ్చిందే బుర్రా రాములు 'ఏడో సారా కథ.' తెలుగు ఆలోచనాపరులు ఆ పుస్తకం ముందుమాట (బాలగోపాల్) గురించి చర్చించినంతగా పుస్తకంలో ఉన్న విషయాన్ని పట్టించుకోలేదు. వరంగల్ గ్రామీణ ప్రాంతంలో ఈ సారా కాంట్రాక్టర్లకు వ్యతిరేకంగా ఒకవైపు పోరాడుతూ నల్లబెల్లి, ఉప్పరపెల్లి వంటి గ్రామాల్లో లంబాడీలు, అట్టడుగు వర్గాల ప్రజల పక్షాన పోరాడిన మామిడాల హరిభూషణ్‌ను కక్షగట్టుకొని ఎన్‌కౌంటర్ చేశారు. ఆ నేపథ్యంలో వచ్చినదే 'ఆ కళ్ళు చూస్తున్నాయి' తదితర సృజన వెలువరించిన సారా కథలు.

ఇంక గోదావరి ఖనిలో ప్రారంభమై సింగరేణి ప్రాంతం మొత్తం ఇంచుమించు ఉత్తర తెలంగాణ అంతటా సింగరేణి కార్మికుల కుటుంబాలు అమలు చేసిన సారా బంద్ ఉద్యమాన్ని ఎదుర్కోవడానికి ఎన్టీఆర్ ప్రభుత్వం హనుమకొండ, రఘునాథపల్లి పోలీసు స్టేషన్లలో, నిజామాబాద్ వంటి చోట్ల డైరీ పాల వ్యాన్లలో పొద్దున్నే సారా పొట్లాలు అమ్మించింది. ఈ అంశాలన్నీ అల్లం రాజయ్య తదితర విప్లవ రచయితల సాహిత్యంలో చూడవచ్చు.

'సారా కథ'ల్లోని దార్శనికత విప్లవోద్యమ ఆచరణలో సాహిత్యంలో ప్రతిఫలించిన తీరును ఒక విహంగ వీక్షణంతో ఇక్కడ ప్రస్తావించి, ప్రత్యక్షంగా ప్రభుత్వం సారా వ్యాపారం చేపట్టిన ఎన్టీఆర్ ప్రభుత్వ

కాలాన్ని (1985-89) కాకుండా సారా నిషేధాన్ని విధించి దొంగ సారా వ్యాపారం రావిశాస్త్రి కాలం కన్నా వెయ్యి రెట్లు విస్తరించిన కాలం (1994-95)కి సారా నిషేధాన్ని ఎన్టీఆర్ అమలు చేశాడని బుద్ధిజీవులు తలచుకోవడమే ఆశ్చర్యం.

సారావంటిదే సినిమా మాయ కూడ కనుకనే అటు జయలలిత డిఎంకె ఓటు బ్యాంకుకు ఇటు ఎన్టీఆర్ ప్రత్యేకించి తెలుగు సమాజంలో చంద్రబాబు, వైఎస్ జగన్, కెసిఆర్ ఓటు బ్యాంకుకు కూడ ఉపయోగపడ్డాడు. ఆంధ్రలో ఉపయోగపడుతున్నాడు.

ఇపుడు బెల్ట్ షాపులు మొదలు మారుమూలలలో విస్తరించిన లిక్కర్ వ్యాపారం - లిక్కర్ కేవలం ఒక బలహీనతకే కాకుండా జీవన విధానానికి, సంస్కృతికి పర్యాయపదం కావడం సాహిత్యం పట్టించుకోవాలి.

విరసం వ్యవస్థాపక (కార్యవర్గ) సభ్యుడు టంకశాల అశోక్ ఢిల్లీలో ఉన్న కాలంలో, ముఖ్యంగా 1985 వరకు ఢిల్లీలో విరసం యూనిట్ ఉండేది. అందులో అప్పుడు వున్న సభ్యులు ఇపుడు ఎవరెవరు ఎక్కడ ఉన్నారో లేదో కానీ, అమరుడు రాజుగా పిలుచుకునే పాండురంగరాజును మాత్రం తలచుకోవాలి. ప్రకాశం జిల్లాకు చెందిన ఆయన సుదీర్ఘకాలం రాడికల్ విద్యార్థి ఉద్యమం మొదలు విరసం ఎఐఎల్ఆర్‌సిలకే పరిమితం కాకుండా విప్లవోద్యమంలో పని చేశాడు.

విరసంతో పాటు అశోక్ స్థాపించిన 'ప్రగతి సాహితి' గురించి నాటక ప్రయోక్త, దర్శకుడు దేవరకొండ సుబ్రహ్మణ్యం, ఢిల్లీ రావిశాస్త్రి ఆరు కథలు ఆధారంగా, అత్తిలి కృష్ణారావు రాసిన 'సారాంశం' నాటిక ప్రదర్శన గురించి రాశాడు.

ఆ తర్వాత '1983లో ఢిల్లీలో జెఎన్‌యులో టంకశాల అశోక్‌గారి అధ్వర్యంలో ఉండే 'ప్రగతి సాహితి' మిత్రులతో కలిసి సారా కథల ఆధారంగా అత్తిలి కృష్ణారావు గారు రాసిన సారాంశం నాటికను నా దర్శకత్వంలో ఢిల్లీలో అయిదు చోట్ల తర్వాత విజయవాడలో జరిగిన విరసం సభల్లోనూ ప్రదర్శించామ'ని రాశాడు. (రావిశాస్త్రి గారి ఆరు సారా కథల్లో - కథల బంగారం)

ఆ విరసం సభ 1983లో విజయవాడలో నిర్వహించిన 'సాహిత్య పాఠశాల' బయట విరసం పతాక ఆవిష్కరణ (మధు కళా మంటపం) జరిగిన తర్వాత ఈ నాటికను వీధి నాటికగా ప్రదర్శించారు. ఆ తర్వాత 83 అక్టోబరులో 'ఢిల్లీలో జరిగిన ఎఐఎల్ఆర్‌సి ఆవిర్భావ సభలో గురుశరణ్ సింగ్ 'ఖెడ్డా' స్ట్రీట్ ప్లే తో విపరీతంగా ప్రభావితులైన డానీ మొదలైన సభ్యులు - ఆలకూరపాడు 'ప్రజా కళా రూపాల వర్క్‌షాప్ (1984)లో స్ట్రీట్ ప్లేను ప్రత్యేకంగా శిక్షణాపాఠంగా అభ్యసించి అలకూరపాడులోనూ ఆ తర్వాత నాగార్జున సాగర్‌లో అణు విద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా కృష్ణా జిల్లా విరసం యూనిట్‌లో స్ట్రీట్‌ప్లేను ఒక విప్లవ సాహిత్య ప్రక్రియగా ప్రయోగించారు. వరంగల్ విరసం సభ్యుడు జె. ఎన్. రాసి విద్యార్థులతో తెలుగునేల మీదనే కాదు, పంజాబ్, ఢిల్లీలదాకా 'రామ జన్మభూమి' డిమాండు, బాబ్రీ మసీదు విధ్వంసం గురించి ఈ పార్లమెంటు భవనం/ రాష్ట్రపతి భవన్ కింద మన పూర్వీకుల అస్థికలెన్ని వున్నాయో తవ్వుదామా అని ఢిల్లీలో ప్రదర్శించిన స్ట్రీట్ ప్లే చాలా ప్రచారాన్ని పొందింది.

ప్రస్తావించవలసింది - విశాఖపట్నంలో 1984 ఆగస్టులో జరిగిన కథల వర్క్‌షాప్‌లో రావిశాస్త్రి ప్రారంభ ప్రసంగం. అంతమాత్రమే కాదు ఆ రెండు రోజులు కారా మాష్టారు యిచ్చిన శిక్షణ, రావిశాస్త్రి మా మధ్య వుండి మాతో పంచుకున్న తన అనుభవాలు అప్పటికే ఒక దశాబ్దం పైగా కథలు రాస్తున్న రాజయ్య, రఘోత్తమ్‌లకే కాకుండా ఆ వర్క్‌షాప్ తర్వాతనే కథలు రాయడం మొదలుపెట్టిన నల్లూరి రుక్మిణి, చక్రవేణులకు ఎంతో ఉపయోగపడింది.

ముగింపుగా ఒక మాట - 1961లో ఆంధ్ర సారస్వత పరిషత్‌లో పోతుకూచి సాంబశివరావు హైదరాబాదులో ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహించాడు. ఆ సభలు అట్లా మళ్ళీ ఆయన ఎపుడయినా నిర్వహించాడో లేదో నాకు తెలియదు. విరసం ఏర్పడినాక కూడ మా దృష్టికి రాలేదు.

అభ్యుదయ సాహిత్య వేదిక పేరుతో నక్షత్ర సప్తకం నిర్వహించిన 1970 జూలై 4 సదస్సును మేం బహిష్కరించింది మొదలు ప్రభుత్వమే పూనుకొని ఆంధ్రప్రదేశ్‌లో, రాష్ట్రం ఏర్పడినాక తెలంగాణలో కూడ ప్రభుత్వం నిర్వహిస్తున్న ప్రపంచ తెలుగు మహాసభలను విరసం, మరికొన్ని ప్రజా సాహిత్య సంస్థలు బహిష్కరిస్తున్న ప్రత్యామ్నాయ సంస్కృతి ముందుకు వచ్చింది.

పోతుకూచి సాంబశివరావు 1981లో కూడ విశాఖపట్నంలో ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించినట్లు నాకు రావిశాస్త్రి ఆ సభలను బహిష్కరించమని ఇచ్చిన పిలుపు వల్లనే తెలిసింది. అప్పటికి ఆరేళ్లుగా ఆయన విరసంలో లేడు. విశాఖ రచయితల సంఘం ఆ సభను బహిష్కరించింది. విరసం గానీ, విరసం విశాఖ యూనిట్ గానీ బహిష్కరణ పిలుపు ఇచ్చారో లేదో నాకు జ్ఞాపకం లేదు. కానీ రావిశాస్త్రి అధ్యక్షోపన్యాసం ఎంత బాధ్యతగా వుందో చూడండి.

"....కొందరు రచయితలు ప్రజలతో పాటు ఉంటారు. వాళ్ళ సమస్యల్ని పట్టించుకుంటారు. వాటిని గురించి రాస్తారు. ఇదే ప్రభువులకు కన్నెర్ర. ఇలాంటి రచయితలను ప్రభుత్వం నిర్బంధిస్తుంది.

మరికొందరు రచయితలు ప్రజా సమస్యల్ని పక్కదారి పట్టిస్తారు. ప్రజా పోరాటాలపై చన్నీళ్ళు చల్లుతారు. ప్రభువుల పల్లకీలు మోస్తారు. వీరు బానిస కవులు, తొత్తు రచయితలు, ప్రభుత్వ చర్యలకు పక్క తాళం వేస్తుంటారు. ఇలాంటి రచయితలనే ప్రోత్సహిస్తుంది ప్రభుత్వం. కొంతమంది రచయితలను అంటరానివాళ్ళుగా చూసి ప్రభుత్వం జైళ్ళలో పెడుతుంది. తమకి పక్కతాళం వేయని రచయితలను గదుల్లో పెట్టి తాళం బిగిస్తుంది. ఇదే ప్రభుత్వ ద్వంద్వ వైఖరి. దీన్ని మనం గట్టిగా ఎదుర్కోవాలి.

రాజకీయ రంగంలో వీళ్ళు చేయని పాపాలు, మోసాలు లేవు, అధికారం చేజిక్కించుకుని గద్దె మీద తిష్టవేసుక్కూర్చున్నారు. తమ రాజకీయ అవసరాలు తీరాక ఇప్పుడు సాహిత్యరంగ ప్రవేశం చేస్తున్నారు. సాహిత్య వాతావరణాన్ని కలుషితం చేస్తున్నారు. కొందరు కిరాయి రచయితలు వీరికి ఊడిగం చేస్తున్నారు.

ప్రజా రచయితలు, విప్లవ రచయితలు ప్రభువుల ఆట కట్టించవలసి వుంటుంది. అందుకు మనందరం ఒకటిగా నిలబడాలి."

(పోతుకూచి సాంబశివరావు ఆధ్వర్యాన 1981 నవంబర్ 14, 15, 16 తేదీల్లో విశాఖపట్నంలో అఖిల భారత తెలుగు రచయితల సంఘం వీటిని బహిష్కరించి విడిగా 15-11-81న ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసుకుంది. అందులో శాస్త్రిగారి అధ్యక్షోపన్యాసం)

ఆధారాలు:

1. రాచకొండ విశ్వనాథ శాస్త్రి రచనా సాగరం
2. సృజన
3. కథల బంగారం-రావిశాస్త్రిలలో విరసంకు సంబంధించిన భాగాలు.



# రావిశాస్త్రి రచనా సంవిధానం

జి. లక్ష్మీనరసయ్య



"గవర్నమెంటంటే మనకి పోలీసోడు. మన పల్లిటూళ్ళంట మున్సీబు కర్నాలు. పైకెల్తే తాసీల్దార్, కలెట్రు, ఇంకా పైకెల్తే ఎమ్మెల్యే నెంబరు, ఆడి పైని మినిస్ట్రు! ఈళ్ళందరూ గవర్నమెంటు. అంచేత ఆళ్ళ అడ్డు మనకి నేకుండ ఉండాలంటే ఆళ్ళని మనమే డబ్బెట్టి నిలబెట్టాల, లేకపోతే ఆళ్ళని కొనాల. అంటే-డబ్బున్న పెద్ద పెద్ద మాయగోళ్ళు అసలు గవుర్నమెంటు! ఆళ్ళు ఈళ్ళందర్నీ కొనుక్కు నిలబెట్టుకున్నారు. అందుకేరా గురూ! డబ్బుండాల, మాయుండాల, డబాయింపు సెక్సనుండాల!"

....రాకెట్టప్పారావు, 'మోసం' కథలో

బలివాడ కాంతారావు కథల ఆవిష్కరణ సభలో 87 లో మాట్లాడుతూ రచనల గురించీ రచయితల గురించీ రావిశాస్త్రి ఏమంటాడంటే: "ప్రజలకు, పేద ప్రజలకు పనికొచ్చే రచనలు నాకు బాగా నచ్చుతాయి. రచయితలు ప్రజల పక్షం వహించాలి. వారిని సమర్థిస్తూ రాయాలి. సంఘంలో జరుగుతున్న మంచి చెడ్డలను తెలుసుకోవాలి. ఒక దృక్పథం అలవరచుకోవాలి. అప్పుడే రాయాలి. అలాంటి రచనలే నిలబడతాయి. సంఘంలో ఏం జరుగుతుందో తెలియకుండా ఎవరూ రచనలు చేయలేరు. లోతుపాతులు బాగా తెలుసుకోవాలి." ఈమాటల్ని బట్టి రావిశాస్త్రి రచనా దృక్పథాన్ని గమనించొచ్చు. మరో సందర్భంలో అన్న మాటలూ చూడండి.

"నేను తెలుగు వాణ్ణి. వర్గాలంటే నాకు తెలీవు. వాటిని జాతులూ, కులాలూ అంటాను. పై జాతులూ, పై కులాలూ కిందివారిని ఎప్పుడూ అణచాలని చూస్తాయి. మనుషులు మూడు రకాలు. ధొంగలు, దొరలూ, మామూలువాళ్ళు. కరివేప మొక్కయినా మర్రి మొక్కయినా నేలలోంచి సారం పీల్చి బతకవలసిందే – అలాగే దొంగలూ దొరలూ మామూలు వాళ్ళని తిని బ్రతుకుతారు. దొంగలు దొరక్కపోతే దొరలవుతారు. చట్టాలను తమకనుకూలంగా మార్చుకుని సమాజంలో ఘరానాగా చలామణీ అవుతారు. కానీ మామూలు జనమే అన్నిటికీ పునాది. చాకిరీ చేసేది వాళ్ళే. వాళ్ళు కష్టపడుతుంటేనే మనం సుఖపడతాం. మనం కూర్చున్న చోటినుంచి కదలకుండా ఉండాలంటే మనకు చాకిరీ చేసే వాళ్ళుండాలి" రావిశాస్త్రి 1973లో రాజమండ్రిలో జరిగిన పౌరహక్కుల సభలో అన్న మాటలివి.

పై రెండు సందర్భాలలో ఆయన చెప్పిన మాటల సారం ఆయన రచనలలో కనిపిస్తుంది. కథలూ నవలలూ ఇంకా నాటకాలూ రాయడం ద్వారా రావిశాస్త్రి రకరకాల బాధితుల వేదనని చిత్రించాడు. దరిదాపు 60 కథల్ని రాశాడు. అవి సారా కథలు, సారో కథలు, బాకీ కథలూ, కలకంఠీ, ఋక్కులు తదితర పుస్తకాలుగా వెలువడ్డాయి. అలాగే అల్పజీవీ, రత్తాలు-రాంబాబు, రాజు-మహిషి, ఇల్లు, మూడు కథల బంగారం, సొమ్ములు పోనాయండీ, గోవులొస్తున్నాయి జాగ్రత్త లాంటి నవలలు వచ్చాయి. నిజం, తిరస్కృతి, విషాదం అనే నాటకాలు గానూ పుస్తకాలు వచ్చాయి. వీటిల్లో సమాజపు అట్టడుగున ఉంటూ అన్ని రకాల తొక్కిడికి గురైన వాళ్ళే తరచూ కనపడుతూ వుంటారు. కూలీలూ, ఒళ్లమ్ముకు బతికేవాళ్ళూ, న్యాయ వ్యవస్థ, పోలీసు వ్యవస్థ చేతుల్లో నిత్యం పీడనకు గురయ్యే పేద జనం, భూస్వాముల దౌష్ట్యానికీ, వ్యాపారుల మాయకూ బలయ్యే బలహీనులూ వేసే ప్రశ్నలూ, చేసే విశ్లేషణలూ మొత్తం వ్యవస్థ యొక్క దుర్మార్గాన్నీ, దౌర్జన్యాన్నీ దివాళాకోరు తనాన్నీ కడిగిపారేయటం రావిశాస్త్రి సాహిత్యంలో కనిపించే ప్రత్యేకత. ఇక్కడే ఇతర సీరియస్ రచయితలు సృష్టించిన సాహిత్యం కంటే రావిశాస్త్రి విభిన్నత మనకు కొట్టొచ్చినట్లు కనిపించేది.

శ్రామికుల గురించీ, బలహీనుల గురించీ, అడుగుజనం గురించీ రావిశాస్త్రి మాత్రమే రాయలేదు. ఆయనకంటే ముందునుంచే ఈ రకమైన ఇతివృత్తాలు రాసినవారూ, అట్టడుగు భాషను వాడిన వారూ మనకు వున్నారు. కరుణకుమార, మా గోఖలే రాసిన కథలు అందుకు మంచి

ఉదాహరణలు. అడుగు జనం భాషను కూడా శాస్త్రి గారికంటే ముందునుంచే కథల్లో వాడటం జరిగింది. మా గోఖలే గుంటూరు జిల్లా పల్లెటూరు పలుకుబడినీ, నుడికారాన్నీ బడుగుల రోజువారీ సంభాషణల్లోని సజీవతనీ కథల్లో వాడి మెప్పించాడు. ఈయనకంటే ముందు 1956లో మరణించిన కరుణ కుమార తన కథల్లో చేసిన పనీ ఇదే. గ్రామీణ పేదల బాసకూ, యాసకూ సాహిత్య గౌరవం తేగలిగాడు. సన్నజీవాలనీ, కయ్య-కాలువల్నీ, రిక్షావాలాలనీ కథలోకి పట్టుకు వచ్చాడు.

సామాజిక స్పృహతోనే సాహిత్యాన్ని సృజించిన రావిశాస్త్రి లంపెన్ వర్గాలను కథలోకి తేవడం కొత్త విషయమే. రౌడీలూ, గజదొంగలూ, తాగుబోతులూ, కేడీలూ, అమ్మాయిల కంపెనీలు నడిపేవాళ్ళూ, వ్యభిచారులూ లాంటి ప్రత్యేక జీవుల్నీ, వారి జీవిత ఘర్షణల్నీ, వత్తిడుల్నీ సాహిత్య సృజనలోకి పట్టుకు రావడం అరుదైన విషయమే అయినప్పటికీ అంతకన్నా ముఖ్యమైనది ఆయన రచనా సంవిధానం. కథలో గానీ, నవలలో గానీ ఇతర సాహిత్య ప్రక్రియల్లో కానీ రావిశాస్త్రి ప్రత్యేకత మనకు కొట్టొచ్చినట్లు కనిపించేది ఆయన నిర్మించిన శైలీ శిల్పాలలోనే. సృజనాత్మక రచనలో పెను కదలిక తేవడానికీ, తన తరువాతి తరాల కథకుల్ని తప్పించుకోలేని ప్రభావానికి గురిచేయడానికీ కారణం ఆయన వ్యక్తీకరణ విధానమే. బీనాదేవి, పతంజలి, భూషణం లాంటి క్వాలిటీ రచయితలు రావిశాస్త్రి వస్తువు కంటే శిల్పాన్ని అనుసరించిన విషయం అందరికీ తెలుసు. ఇలా తెలుగు సృజనావరణంలో తిరుగులేని కొత్త రచనా సంవిధానాన్ని తెచ్చిన ఘనత రావిశాస్త్రిదే. కొడవటిగంటి కుటుంబరావు ప్రకారం, "ముఖ్యంగా కథా రచనలో ఒక కొత్తమార్గం నిర్మించిన కీర్తి రాచకొండ విశ్వనాథ శాస్త్రీకి దక్కుతుంది. ఆయన చేతిలో కథానిక కావ్యమయింది. కథనం కావ్యం స్థాయినందుకుంది. సంసారపక్షంగా జీవితం ఈడ్చుకొస్తున్న తెలుగు కథాకన్య కళ్ళు జిగేలుమనే సౌందర్యకర్షణలను సంతరించుకుంది" చార్లీ చాప్లిన్ సినిమాలలోలాగా, పికసో సృష్టించిన 'గుయేర్నికా'లోలాగా డికెన్స్ ఫిక్షన్లో లాగా ఏక కాలంలో నవ్వూ ఏడుపూ, ఆశ్చర్యమూ, భయమూ కలిగించే సృజన విధానం రావిశాస్త్రిలో ఉందని శ్రీశ్రీ కూడా అంటాడు. రావిశాస్త్రిని 'సాహిత్య జలపాతం'గా చలసాని ప్రసాద్, కృష్ణబాయిలు అభివర్ణించడంలో కూడా ఆయన రచనా సంవిధాన ప్రత్యేకతను దృష్టిలో ఉంచుకోవడం ఉంది.

అయితే వస్తు గంభీరత విషయంల్లో దృక్పథ స్పష్టత విషయంలో విశ్లేషణా విస్తృతీ లోతుల విషయంలో కా.రా., చా.సో.లను మించి రావిశాస్త్రి సాధించింది తక్కువే. రచనా సంవిధాన విషయంలో మాత్రం అతనిదొక కొత్త మార్గమే. వచనాన్ని పరుగులు పెట్టించడంలో, చమత్కారాన్నీ, మెరుపుల్నీ పండించడంలో, హాస్యాన్నీ, వ్యంగ్యాన్నీ, కవిత్వాన్నీ గుప్పించి వాక్యాన్ని మంత్రించడంలో, వర్ణనల్నీ, అలంకారాల్నీ సమ్మోహనంగా తీర్చిదిద్దడంలో, కంఠ స్వరాన్ని తగిన విధంగా ట్యూన్ చేయడంలో, పాత్రల స్వభావాన్ని సూక్ష్మీకరించడంలో, సంభాషణల్లో విమర్శనూ భయ విహ్వల సౌందర్యాన్నీ చొప్పించడంలో ఈ మార్గాన్ని నిర్మించాడు రావిశాస్త్రి.

సృజన విధానాంలో తన విభిన్నతనూ విశిష్టతనూ తానే ఒక సందర్భంలో ఇలా చెబుతాడు రావిశాస్త్రి: "కాళీపట్నం రామారావు గారూ, బలివాడ కాంతారావు గారూ ఒకరకం రచయితలు. నేను మరో రకం రచయితను. వాళ్ళు వస్తువుకే ప్రాధాన్యత నిస్తారు. నేను చమక్కులు కూడా చొప్పిస్తాను. చమ్కీ నుంచి వచ్చిందే చమక్కు. చమక్కులు చూపించినందుకు కొందరు నన్ను భూషించారు, కొందరు నన్ను దూషించారు. ఈ చమక్కులు నాకు సహజంగా వచ్చాయి." అయితే చక్కగా చెప్పటమొక్కటే ప్రధానం కాదనీ చక్కగా ఏం చెబుతున్నామన్నదే ప్రధానమని కూడా అంటాడు. రచనలో మంచిదనం చక్కదనం - రెండూ కలిసి ఉంటే అందరూ హర్షిస్తారని కూడా పదే పదే ఆయన చెబుతూ ఉంటాడు. "అయితే చమత్కారంగా చెప్పటం తప్ప చెప్పినదాంట్లో పస లేనప్పుడు విన్నవాడు (చమత్కారాల కోసం వింటేనే తప్ప) విసుక్కుంటాడు. ఎంత మంచి చెప్పదల్చుకున్నప్పటికీ అది అందంగా చమత్కారంగా చెప్పకపోతే వినవలసిన వాడు నువ్వు చెప్పేది వినను వినడు." ఇలా అందంగా చమత్కారంగా చెప్పటాన్ని వత్తిపలకటమే కాకుండా తన రచనల్లో ఆ సూత్రాన్ని సంపూర్ణంగా పాటించడం రావిశాస్త్రి విశిష్టత.

1988లో 'ఉదయం' దినపత్రిక కోసం త్రిపురనేని శ్రీనివాస్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో, "పాఠకుణ్ణి ఎలా ఆకర్షించాలి అన్న విషయం గురించి నేను ఆలోచిస్తాను. వంద కథల్లో మన కథని చదివించాలి గదా. అందుకోసం తంటాలు పడేవాడినేమో" అంటాడు రావిశాస్త్రి. అలాగే తనమీద చార్ల్స్ డికెన్స్ ప్రభావం ఉందని చెబుతూ అతని రచనా విధానంలో "గొప్ప splendour (శోభ, వైభవం) ఉంది. అది ఒక విధమైన experience. ఎన్నెన్నో గొప్ప emoticons ని ఆయన అతి సులువుగా చెప్పేయగలడు. నాపై చిన్నప్పటినుండీ డికెన్స్ influence ఉంది" అని చెబుతాడు. తన మీద చెహోవ్, ఓ. హెన్రీ ల ప్రభావమూ వున్నట్లు ఆయన చెప్పిన సందర్భాలు ఉన్నాయి. రావిశాస్త్రి సాహిత్యం మీద పరిశోధన చేసిన తాటి శ్రీకృష్ణ వస్తు రూపాలలో దేనికి ప్రాధాన్యత నివ్వాలంటారు అని ఆయన్ని అడిగినప్పుడు తన సమాధానం చూడండి: "చెప్పే విధానంలో ఒక ఆకర్షణ ఉండాలి. అయస్కాంత ఆకర్షణలా హృదయానికి హత్తుకుపోయే ప్రత్యేకత ఉండాలి. అయితే రచయిత ఎలా చెబుతున్నాడు అనే దానికంటే ఏమి చెబుతున్నాడు అనే దానికి ప్రాముఖ్యత నివ్వాలి." ఇంతటితో ఆగకుండా "నాది ఒక ప్రత్యేక రచనా విధానంగా రూపుదిద్దుకోవటానికి న్యాయవాదిగా నా ప్రాక్టీసు, కోర్టు వాతావరణం, వివిధ ప్రాంతాల నా క్లైంట్లు, లోక పరిశీలన, నా జీవితానుభవం - వీటన్నింటినీ నాకు తెలిసిన భాషలో వ్యక్తం చేశాను. అది విశాఖ మాండలీకం అనుకోండీ, ఉత్తరాంధ్ర భాష అనుకోండీ, మరోటనుకోండీ" అని వివరించాడు.

తన రచనా విధానం మీద సంకు పాపారావు అనే తన మిత్రుడి చమత్కార పూరిత వాక్చాతుర్య ప్రభావం ఉందని రావిశాస్త్రి 'ఉదయం' ఇంటర్వ్యూలో తెలిపాడు. అందుకు కొన్ని ఉదాహరణలు కూడా ఇచ్చాడు." క్యూబాలో racial discrimination లేదనీ తెల్లవాళ్ళకీ నల్ల వాళ్ళకీ, రెడ్ ఇండియన్లకీ మధ్య యథేచ్ఛగా పెళ్లిళ్లు జరిగిపోతూ వుంటాయని ఒకసారి ఎవరో చెప్పారు. దాని మీద 'అహా అలా సెప్పండి. అందుకే అక్కడ రేస్ కాక్ టెయిల్ దిగింది' అన్నాడు పాపారావు. విషాదం అనే నాటికలో నేను దాన్ని వాడుకున్నాను కూడా. అయితే acknowledge చెయ్యలేదు. పాపారావు జోకుల్లో acknowledge చెయ్యకుండా వాడుకున్నది అదొక్కటే" అని గుర్తుచేసుకున్నాడు రచయిత. అలాగే చలసాని ప్రసాద్ దగ్గర ఒక రాజకీయ నాయకుణ్ణి గురించి ఒక జోక్ వేస్తూ, 'ఏంటి మనోడు, సముద్రం తప్ప అంతా కొనేశాట్ట?' అనికూడా సంకు పాపరావు అన్నాడని రావిశాస్త్రి చెప్పాడు. చివరి రోజుల్లో పాపారావు కాలు తీసేయవలసి వచ్చింది. అప్పుడు "చైనాలో చూటే ఒంటి కన్నుతో ఫైటింగ్ సెయ్యనేదా? అలాగే ఒంటి

కాలుతో ఫైటింగ్ సేస్తాను" అంటాడు పాపారావు. బాగా మందుకొట్టే వాడి గురించి, "అదు పడవా? కాదు, లాంచీయా? కాదు, ఆయిల్ టాంకరే" అంటాడట పాపారావు. "పులి ఉంది కాబట్టే అది అడవి అయింది. లేకపోతే ఉద్యానవనమే. సగ్గా విహరించొచ్చు" అని మరో చమక్కు. ఇలా తన రచనా విధానంలోని చమక్కుల్ని పాపారావు ప్రభావితం చేసిన తీరు రావిశాస్త్రి స్పష్టంగా బయట పెట్టాడు. ఇదికాక మామూలు జనం మాటల్లో దొర్లే చమక్కుల్ని కూడా రావిశాస్త్రి పట్టుకున్నాడు. ఒక సందర్భంలో మాటూరి తాత అనే పాలి కాపు ఒకాయన వెన్నెల్ని చూసి, 'అహా ఎన్నెలా, కన్న తల్లీ, పేదోడి దీపమా' అన్నాడు. దాన్ని ఒక కథలో వాడుకున్నాడు రావిశాస్త్రి. ఒకసారి శాస్త్రి గారి మేనమామ ఇంట్లో ఒక పేదరాలు తన కష్టాల్ని చెప్పుకుంటూ తనకున్న దిక్కును గురించి, "నాకు దిక్కెవరున్నారు బాబూ. దరణి బూదేవి, ఆపైన దేముడు, ఆ ఎనక తమరిలాంటి మారాజులు" అని కవితాత్మకంగా ఆమె అన్న మాటల్ని కూడా ఒక కథలో వాడుకున్నాడు. కోర్టులో ఒకసారి తన క్లయింట్ ఒకతను తప్పుడు సాక్ష్యం చెప్పిన ఎస్సైని లాయరైన రావిశాస్త్రి ఒదిలేసినందుకు అసంతృప్తిని తెలుపుతూ అన్నాడు కదా,

"ఆ ఎస్సైని అలా వొగ్గేసేవేటి బాబూ, ఏమడగలేదే? నువ్వడగనందుకు సంద్రంలో కెరటాలు లెగుస్తాయే అలా నా కడుపులో కోపం కుతకుతలాడుతూ లేసింది" అన్నాడు. దీన్ని కూడా ఒక కథలో వాడుకున్నాడు రావిశాస్త్రి.

పైన చూసిన అంశాలన్నీ రావిశాస్త్రి రచనావిధానపు విశిష్టతను బయటపెట్టేవే. వీటిని మించి కొడవటిగంటి కుటుంబరావు అన్నట్లు రావిశాస్త్రి తన శిల్పం, శైలి ద్వారా వచన రచనని కావ్య రచన స్థాయికి తీసుకెళ్లాడు. కథనంలో ఆయన చేసిన వర్ణనలూ, సంభాషణల్లో ఆయన వాడిన చమత్కార చాతుర్యం, పాత్ర చిత్రణ, సన్నివేశాలలోని డ్రామా, కవితా శైలీ, కిక్కిరిసిన అలంకార ప్రయోగం, వడివడిగా పరుగులు తీసే వాక్యాల వాడితనం, వ్యంగ్యం, హాస్యం – ఇవన్నీ కలిసి శోభాయమానంగా వెలిగే ఆకర్షణీయమైన శక్తివంతమైన వ్యక్తీకరణనూ, రచనా విధానాన్నీ ఉత్పన్నం చేయగలిగాయి. ఈ విధానమే రావిశాస్త్రిని ఇతర సృజనకారుల నుంచి వేరుగా విభిన్నంగా ఉన్నతంగా నిలబెట్టింది. రావిశాస్త్రి రచనల్ని వేటిని తీసుకున్నా ఈ ఉత్కృష్ట రచనా సంవిధానం కనిపిస్తుంది. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

రావిశాస్త్రి కథనంలో వర్ణనా, వ్యంగ్యం, కవిత్వం కలగలిసిపోయి వాక్యం వాగులా ప్రవహించే దానికి ఉదాహరణగా 'పాపి'అనే కథలో ఒక ఉదాహరణ చూడండి:

"మొత్తం మీద అందరి చలవవల్లా, ఒడుదుడుకులేమీ లేకుండా త్రివేణీ సంగమం వద్ద సరస్వతీ నదిలా ఊరంతా సారా ప్రవహిస్తోంది. ప్రాతఃకాలంలో, సాయం సంధ్యలో, నిశిలో, మోటారు ట్యూబులో, మోటారు కార్లలో, బళ్లలో, సైకిళ్లలో, పడవల్లో, కూలీ భుజాలమీదులలో, ఆడవారి కోకల కిందులో, ఊరంతా అన్ని స్థలాల్లో సారా చకచకా సరఫరా అవుతోంది. కొట్ల దగ్గర గళాసులు జోరుజోరుగా ఖాళీ అవుతున్నాయి. బుడ్లకి బుడ్లు కావలసిన వాళ్ళ ఇళ్లకు జాగ్రత్తగా అందజేయబడుతున్నాయి.

తాగే ప్రజకి సారాతో గుండెలు మండి కళ్ళు పేలుతున్నాయి. తాగని వారి సంఖ్య రోజురోజుకూ తరిగి తగ్గిపోతుంది. నిగూఢ గుప్తమైన సారా సొమ్ములో ఎవరి షేర్లు వారికి వెళుతున్నాయి. 'శాంతియుత సహజీవమే సారాలోక శాంతికి ఏకైక మార్గము' అని తెలుసుకుని, అన్ని పార్టీల వారూ కలివిడిగా మెలుగుతున్నారు. మూడు బుడ్లూ ఆరు గ్లాసులుగా సారా ప్రపంచం అంతా శాంతి –సామర్థ్యాలతో వర్ధిల్లుతోంది. కానీ – ఒకరోజు రాత్రి గ్లాసు పగిలింది"

ఇదీ ఈయన టిపికల్ రచనా విధానం. ఎటు చూసినా ఇదే వరస. ఒకోసారి ఇంత వివరంగా కాకుండా కాస్త నర్మగర్భంగా వ్యక్తీకరణ ఉంటుంది. పై పేరాలోని చివరి వాక్యం సారా ప్రత్యర్థులకు గొడవ మొదలయ్యిందని సూచిస్తుంది. 'ఒక రోజు రాత్రి గ్లాసు పగిలింది' అంటే గ్లాసు నిజంగా పగలడం కాదు. గొడవ మొదలుకావటానికి చెందిన ఘటనేదో జరిగిందని చెప్పటం. తన ప్రత్యర్థి నీలయ్యను చంపటం తప్పనిసరి అని చెప్పటానికి, 'ఇంజను మరింక ఆగదు' 'ఐస్ అంతే ఇంజను మరింక ఆగదు' అంటాడు రామదాసు. రావిశాస్త్రి అసలైన చమక్కుకు రామదాసు చేసిన ప్రతిజ్ఞ గొప్ప ఉదాహరణ: "ఇదుగో, ఇదేమాట సెప్తున్నాను. అదు మరింక బతకదు. అన్నీ నానేం సేస్తానని కాదు. నానేం సెయ్యను. నా నాణీ పల్లెత్తు మాటనను. కానీ ఆడికింకా తెలకుండా ఉంది. నాలో ఈస్వెరుడున్నాడు. ఆ ఈస్వెరుడే అన్నీ సేయిస్తాడు. సేయించే పన్లన్నీ నాలో ఈస్వెరుడే సేస్తాడు." నీలయ్యను చంపేశామనే వార్త రామదాసూ తదితరులకు చెప్పటానికి వచ్చిన సెక్రటరీని రచయిత ఎలా వర్ణించాడో చూడండి: "అతని లాల్చీ సిల్కుది. పంచె మల్లుది. సిగరెట్టు నోట్లోది. ఫారిన్ సిగిరెట్టిన్ను చేతిలోది. అతని వయస్సు చిన్నది. కన్ను పెద్దది. తొక్క తెల్లనిది. చూపు మాయని దాచినది." ఇదే రావిశాస్త్రి మార్కు శిల్పం.

'మాయ' కథలో పేద ముత్తేలమ్మ గురించి వర్ణిస్తూ రావిశాస్త్రి వచనానికీ కవిత్వానికీ మధ్య సరిహద్దుల్ని చెరపగలిగాడు. "ఆమెకు ముప్పయ్యేండ్లుండొచ్చు. ఒకప్పుడామె అందంగా ఉండుంటుంది. పెద్ద కొప్పుని ఒకప్పుడు ముడుచుకొని ఉండుంటుంది. ఆమె కట్టుకున్న నల్ల కోక ఒకప్పుడు, అప్పుడెప్పుడో కొత్తదయుంటుంది. చాలా రోజుల కిందట చాలా సార్లు భోంచేసి ఆమె ఆరోగ్యంగా ఉండి ఉంటుంది" టెర్రిఫిక్ డిస్క్రిప్షన్ ఇది. ప్రస్తుతం ఆమె ఎంత దీన స్థితిలో ఉందో చెప్పటానికి గతాన్ని ఆశ్రయించే ఈ టెక్నిక్ పోయెటిక్ టెక్నిక్. ఇక ముత్తేలమ్మ చేత పలికించిన లోక రీతీ, నీతీ మీది మాటలు – సాహితీ ప్రపంచంలో అత్యంత గొప్ప ప్రసంగాలలో ఒకటిగా నిలిచిపోతుంది. ఈయన రాసిన సారా కథలూ, సారో కథలూ, బాకీ కథలూ మొత్తం తెలుగు కథలో ఎన్నదగిన స్థాయిలో నిలిచిపోటానికి రచనా పద్ధతిలోని కళాత్మకత, అయస్కాంతతత్వం కారణమని వేరే చెప్పనక్కరలేదు.

రావిశాస్త్రి భావాలు నచ్చని వాళ్ళు కూడా ఆయన సాహిత్యాన్ని చదివి ఆస్వాదించడంలో ఆయన శిల్ప చమత్కృతి, శైలీ విన్యాసాలే ప్రధాన భూమికను పోషించాయి. చదివే వారి మానసిక నేపథ్యం, దృక్పథాలను బట్టి రకరకాల ఆవేశానుభూతుల్ని పొందే కళా క్రమం రావిశాస్త్రి సాహిత్యంలో ఉంది. రావిశాస్త్రి మార్కు ఆయన వస్తువు కంటే ఆయన రచనా సంవిధానంలోనే ఎక్కువగా కనిపిస్తుంది. అదే ఆయన తెలుగు సాహిత్యానికి సమకూర్చిన అదనపు చేర్పు కూడా.

"మనం జీవితాన్ని పంచేంద్రియాలతో స్పృశిస్తాం. అంచ్చాత, రచయిత ఇంద్రియాలన్నింటినీ స్పృశించేలా రాస్తే బావుంటుంది" అనేది రావిశాస్త్రి రచనా విధానానికి చెందిన సూత్రం. 'ప్రపంచంలో పేరున్న రచయితలందరూ ఇంద్రియాలను స్పృశించేలా రాశారు.' ఈ సూత్రాన్ని పాటించడం వలననే రావిశాస్త్రి ఆకర్షణీయమైన కొత్త శిల్పాన్ని నిర్మించగలిగాడు. అలాగే రావిశాస్త్రి రచనా శైలి మీద డికెన్స్ ప్రభావంతో

(మిగిలినది 31వ పేజీలో...)

# కంచికి చేరకుండా మన హృదయాంతరాల్లో ఉండిపోయిన కథ

నందిగం కృష్ణారావు

కథ సశ్శరీరంగా మన ముందుకు వస్తే ఎలా ఉంటుంది? రాచకొండ విశ్వనాథశాస్త్రి గారిలాగుంటుంది. రక్తమాంసాలే కాక, అన్ని కళలను సంతరించుకొని, అన్ని ఎమోషన్స్‌తో ఎంత సజీవంగా ఉండాలో అంత సజీవంగా ఉండేవారాయన. జీవం, చలనం కళకు అవసరమైన లక్షణాలు. నిరంతరం చలిస్తూ, జ్వలిస్తూ ప్రవహించిన రావిశాస్త్రిగారు ఇవాళ మన ముందు లేకపోయినా, ఆయన కథలు, నవలలు, జ్ఞాపకాలు సజీవంగా ఉన్నాయి. కథనం లేకుండా ఆయన మాట్లాడటం నేను ఎరుగను. ఆయన మాటల్లో కథ, కథనం నిరంతరం సాగిపోయేవి. ఒకసారి పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారు శాస్త్రిగారిని కలవడానికి విశాఖ కోర్టుకు వెళ్లారు. అప్పుడు శాస్త్రిగారు ఏదో కేసు వాదిస్తున్నారు. పురాణంగారు అక్కడే ఉన్న ఒక బల్ల మీద కూర్చొని, కాళ్లూపడం మొదలుపెట్టారు. జడ్జిగారు వాదోపవాదాలు వినడం మానేసి పురాణం గారికేసి తీక్షణంగా చూశారు. జడ్జిగారికి అప్పుడు ఇన్‌సబార్డినేషన్ అనిపించిందో, కోర్టు ధిక్కరణ అనిపించిందో, అందరి నెత్తుల మీద కూర్చున్నట్టుగా బెంచీ ఎక్కి మూడు తలల సింహం ఒళ్లో కూర్చున్న తనని ఖాతరు చేయడం లేదనిపించిందో తెలవదు, పురాణంగారి మీద చిరాకు పడిపోయారు. ఆ తరువాత పురాణం గార్ని నిలబెట్టి కాళ్లూపుకుంటూ కూర్చుని కోర్టు దృష్టి మరలుస్తున్నారని, కాళ్లూపుకుంటూ కూర్చోవడం పబ్లిక్ న్యూసెన్స్‌గా ట్రీట్‌చేసి ఉన్న పళంగా వంద రూపాయలు జరిమానా వేశారు. కాదంటే వారంరోజులు జైలుకు వెళ్లమని ఆదేశించారు. పురాణం గారు ఆశ్చర్యపోయారు. ఆయన ఆశ్చర్యాన్నించి తేరుకోకముందే కోర్టు బంట్రోతు ఆయనను పక్కకు లాగేశారు. అప్పుడు శాస్త్రిగారు ఫైన్ కట్టేసి పురాణంగారిని తిరిగి కోర్టులో కూర్చోబెట్టారు. ఆ మధ్యహ్నం శాస్త్రిగారి కేసు అయిపోయేంతవరకూ పురాణంగారు బుద్ధిమంతుడిలా కూర్చుండిపోవాల్సి వచ్చింది. మధ్యాహ్నం లంచ్ అవర్‌లో శాస్త్రిగారు, పురాణంగారు కోర్టు కాంపౌండ్‌లోని క్యాంటిన్‌లో లంచ్ చేశారు. మధ్యాహ్నం మరో కేసు ఉంది, అది చూసుకుని బయటకు వెళదాం అన్నారు శాస్త్రిగారు

"అప్పటివరకు నన్నేం చేయమంటారు" అని అడిగారు పురాణం గారు.

"కోర్టులో కూర్చుని కాళ్లూపుకోండి" అని చెప్పారు శాస్త్రిగారు.

"నన్ను జైలుకు పంపిద్దామనా" అన్నారు పురాణంగారు.

చిరునవ్వుతో సమాధానం చెప్పారు శాస్త్రిగారు.

ఈ సంఘటన చెప్పి "కమ్యూనిస్టుల్ని, విరసాన్ని విమర్శించానని నన్ను జైలుకు కట్టేద్దామని చూశాడు శాస్త్రి" అని నిష్ఠూరమాడేవారు పురాణంగారు.

చిరునవ్వుతో.. "ఎవరికైనా అధికారంలో ఉన్న నరకం ఏంటో తెలియాలి" అంటూ లేచి వెళ్లిపోయారు శాస్త్రిగారు.

ఈ మొత్తం సంఘటన వాస్తవం అయినప్పటికీ ఇందులో కథాకథనం ఉంది.

... ... ...

కోర్టుల్లో కేసులు పేరుకుపోతున్నాయి. ఏదో కారణం చేత కేసులు వాయిదా పడతాయి. జడ్జిగారు అనుకూలంగా లేకపోతే వాదో, ప్రతివాదో ఏదో ఒక కుంటిసాకు చెప్పి వాయిదాలు అడుగుతుంటారు. లేదంటే వారి వారి ప్లీడర్లకి అకస్మాత్తుగా ఏదో ఒక జబ్బు వచ్చేస్తుంది. పెద్దల కేసుల్లో కనిపించే అర్జెన్సీ కోర్టు వారికి పేదల కేసుల్లో కనిపించదు. ఎప్పుడో ఒకసారి ఏదో ఒకరోజు న్యాయం జరుగుతుందన్న ఆశతో బతుకుతారు, బతకనివ్వండన్న జాలితో కోర్టువారు కేసులు వాయిదా వేస్తుంటారు. అలాంటివారికి న్యాయం జరక్కపోతే తిరుగుబాటుదారులయిపోతారని భయం వేసిందేమో! చెప్పులరిగిపోయేలా, కాళ్లరిగిపోయేలా కోర్టుల చుట్టూ తిరగాల్సిన పనిలేదు, 'పేదల మధ్యకే కోర్టు'అనే నినాదంతో లోక్ అదాలత్‌లను



ఏ దేశంలో ఏ కోర్టు అయినా సరే అది ఎంత చక్కగా ఎంత మంచి పాలరాతితో ఇంద్రభవనంలా స్వర్గహర్మ్యంగా మలచినప్పటికీ అది వెన్వెంటనే గుండెలేని గోరీగా మారి తీరుతుంది. ఆ కోర్టు' ఎంత 'కళ'గా ఉన్నప్పటికీ ఎప్పుడూ తొడతొక్కిడిగా శవాల హడావిడిగా వుండే శ్మశానంలా ఉంటుందే తప్ప ఇంకో విధంగా ఉండదు.

(తలుపు గొళ్ళెం కథలో)

కోర్టువారు ఏర్పాటుచేశారు.

అప్పట్లో హైకోర్టు న్యాయమూర్తి ఒకాయన మరో న్యాయమూర్తితో కలిసి విశాఖ వెళ్లారు. ఆయన సాహిత్యం బాగా చదువుకున్నారు. జస్టిస్ చిన్నపరెడ్డి గారన్నట్టుగా పదాల మీద బతికే న్యాయవాదులు, న్యాయమూర్తులు సాహిత్యం చదవాలని విశ్వసించేవారాయన. రాచకొండ విశ్వనాథశాస్త్రిగారిని బాగా అభిమానించేవారాయన. విశాఖ జిల్లాలోని ఒక మారుమూల పల్లెలో జనానికి లోక్ అదాలత్ అంటే ఏమిటో వివరించడానికి భారీఎత్తున సభ నిర్వహించారు. ఆ సభకు శాస్త్రిగారిని తమ వెంట తీసుకెళ్లారు. ఎలాగూ రాజుగారొస్తున్నారు కదా, ప్రజల్లేకుండా రాజులూ, వారి రాజ్యాలూ ఉండవు అని తెలిసిన పోలీసులు, కోర్టు సిబ్బంది ముందుగానే ఆ ఊరు చేరుకుని జనాన్ని పోగేశారు. సభ అయిపోయిన తర్వాత అందరికీ భోజనాలు ఉంటాయని ఆశపెట్టారు. జడ్జిగారు వెళ్లేసరికి జనం కిటకిటలాడిపోతున్నారు. ఆయన చాలా సంతోషించి, ఎంతో ఉత్సాహంగా లోక్ అదాలత్ అంటే ఏమిటో, పద్దెనిమిదో శతాబ్దం నాటి కోర్టు భాషను తర్జుమా చేసి చెప్పారు. లోక్ అదాలత్ అంటే అదనీ, ఇదనీ, మీరు కోర్టు చుట్టూ తిరగవలసిన పని లేదనీ, కోర్టువారే మీ మధ్యకొచ్చి మీ తగాదాలు ఫైసలా చేస్తారని చెప్పారు.

జనంలో కదలిక లేదు. పై పెచ్చు నెత్తి మీద ఎండ, ఒంటినిండా చెమట. ఎండతో వేడెక్కిపోయిన కాళ్ల కింద నేలతో, మధ్యాహ్నం అయిపోవడంతో కడుపులో ఆకలితో మండిపోతున్నారు వాళ్లు.

ఇంతకీ, "మీకు లోక్ అదాలత్ అంటే ఏమిటో అర్థమయిందా" అని అడిగారు జడ్జిగారు. అంతా ఆకాశం కేసి చూశారు. దాంతో జడ్జిగారు, వీళ్లకేమీ అర్థమైనట్లు లేదు, ఆ మాట చెప్పకుండా శూన్యంకేసి చూస్తున్నారంటే దానర్థం అదే అని గ్రహించారు.

"శాస్త్రీ..! నువ్వు వాళ్ల భాషలో కథలు రాస్తారు కదా. వాళ్ల భాషల్లో వాళ్లకు అర్థమయ్యేట్టు చెప్పు" అని అడిగారు.

"వాళ్ల భాషలో బూతులుంటాయి. ఇక్కడ పెద్దలు, మర్యాదస్తులు ఉన్నారు" అని మాట్లాడ్డానికి మొహమాటపడ్డారు శాస్త్రిగారు.

"వాళ్లకర్థం కావడం ముఖ్య"మన్నారు న్యాయమూర్తి.

శాస్త్రిగారు ఎంతో అణకువగా లేచి నిల్చున్నారు. జనంలోంచి ఒకరిని పిల్చి, "ఒరేయ్ నీ పేరేం"టని అడిగారు. అతడు లేచి నిల్చుని తలకు చుట్టుకున్న కండువా తీసి చంకలో పెట్టుకుని, "బోడిగాడు అంటారయ్యా"అన్నాడు.

శాస్త్రిగారు ఒరేయ్ బోడిగా, ఆ పక్కనే ఉన్న ఇంకొకతణ్ణి చూపించి, "వీడు నీకోడిని దేం.. అనుకో. అప్పుడు నువ్వేం చేస్తావ"ని అడిగారు.

"ఏం చేస్తానండయ్యా!" అని బోడిగాడు తలగోక్కుంటూ న్యాయం చేయమని పోలీసులను అడుగుతాను.

"అప్పుడు పోలీసులేం చేస్తారు?"

"ఏం చేస్తారండయ్యా! అడ్ని పిలిచించి 'ఒరేయ్ నం..కొడకా! ఈడి కోడిని నువ్వు దొబ్బేశావు' అని రెండు తగిలిస్తారు. ఏడ్చి మొత్తుకుని నాకేం తెలవదని కాళ్లట్టుకుంటాడు వాడు"

అప్పుడు పోలీసులేం చేస్తారని తిరిగి అడిగారు శాస్త్రిగారు.

ఆడికి ఇంకో నాలుగు తగిలించి ఆడిదో, నాదో ఏదో కోడ్ని తెచ్చిస్తే ఒదిలేస్తామంటారు. పోలీసులకు జడిసిపోయి వాళ్లు కొట్టే దెబ్బలు తట్టుకోలేక ఏదో ఒక కోడ్ని తెచ్చిస్తాడు వాడు.

"కోడ్ని నీకిచ్చేస్తారా?" అని అడిగారు శాస్త్రిగారు.

"ఎందుకిస్తారండయ్యా? ఇవ్వరు. వాడికి ఇంకో రెండు తగిలించి ఇంటికి తరిమేస్తారు. ఆ వెనక... "వెళ్లు, ఇంక ఈ జన్మలో వాడు నీ జోలికి రాడు" అని నాకు భరోసా ఇచ్చి పంపుతారు.

క్యూరియాసిటీ ఆపుకోలేక "కోడ్నేం చేస్తారు" అని అడిగారు న్యాయమూర్తి.

"ఇంటికి తీసుకెళ్లి వొండుకుని తినేస్తారు" అని చెప్పాడు బోడిగాడు.

"ఇదీ లోక్ అదాలత్ అంటే.." అని కూర్చున్నారు శాస్త్రిగారు.

ఇందులో కథనం ఉంది. కథ ఉంది. గాఢమైన వాస్తవికత ఉంది. శాస్త్రిగారి ఉచ్ఛ్వాస, నిశ్వాసాల్లో నిండైన కథ, కథనం ఉంటుందనేందుకు ఇంతకన్నా గొప్ప ఉదాహరణ ఏం కావాలి!

.... ... ...

శాస్త్రిగారు తరచూ హైదరాబాద్ వచ్చినప్పుడల్లా మేమంతా ఆయనతో కల్సి స్పెండ్ చేసేవాళ్లం. ఒకరోజు నన్ను కలవడానికి ఆయన హైకోర్టుకు వచ్చారు. కాసేపు కబుర్లు చెప్పుకొన్నతర్వాత, నాకెందుకో ఘుగర్ డౌన్ అయినట్టుగా ఉంది అన్నారు. క్యాంటిన్ కెళదామని బయలుదేరాం. శాస్త్రిగార్ని చూసి అంతకుముందు మా అసోసియేషన్ ప్రెసిడెంటుగా చేసిన ఒక అడ్వకేట్, "శాస్త్రీ.. శాస్త్రీ.." అని పిలుస్తూ వచ్చి శాస్త్రిగార్ని కలిశారు. నేను మీ బంధువును, మీ ఫలానా బంధువు తరపున మీకూ, నాకూ చుట్టరికం ఉందని ఆయనతో చుట్టరికం కలిపేసుకున్నారు. అప్పుడు శాస్త్రిగారు, "ఈన కృష్ణారావుగారు. సాక్షి అనే పేరుతో కథలు రాస్తారు" అని నన్ను పరిచయం చేశారు. ఆ అడ్వకేట్ ఒకప్పుడు నేను హైకోర్టుకు వచ్చిన కొత్తలో నాతో చాలా సన్నిహితంగా ఉండేవాడు. అలా ఉన్నన్నాళ్లు నేను ఏ కులం వాడ్నో, ఏ గోత్రం వాడ్నో తెలుసుకోవాలని రకరకాలుగా ప్రయత్నించాడు. చివరికి నేను తన కులపోడ్ని కాదని తెలిసింతర్వాత నాతో దూరంగా ఉండటం మొదలుపెట్టాడు.

శాస్త్రిగారికి ఎందుకో నన్నతను పట్టించుకోవడం లేదనిపించింది. కాసేపు ఆ కబురూ, ఈ కబురూ మాట్లాడుకున్న తర్వాత ఆయన మంచి కథలు రాస్తారు తెలుసా మీకు, అని శాస్త్రిగారు అడిగారు.

తెల్సు, తెల్సన్నాడాయన. ఆ తర్వాత మేమంతా క్యాంటిన్ కెళ్లాం. శాస్త్రిగారు ఆ అడ్వకేట్‌తో మాట్లాడుతూనే, "ఐ అడ్మైర్ కృష్ణారావు స్టోరిస్" అని అన్నారు. దానికి కూడా ఆయన తెల్సు, తెల్సని అనడం చూసి శాస్త్రిగారు, "మీరొక్క విషయం తెలుసుకోవాలి. మీరు ఫలానా వారి వలన నాకు బంధువని క్లెయిమ్ చేసుకున్నారు కదా, ఆయనకు ముగ్గురమ్మాయిలు..." అని ఆయన ఇంకేదో చెప్పబోతుండగా... ఆ అడ్వకేట్ కల్పించుకుని, "ఆ ముగ్గురమ్మాయిలు అమెరికాలో మంచి పొజిషన్‌లో సెటిల్ అయ్యారని విన్నాను" అని సంతోషంగా, గర్వంగా అన్నాడు.

శాస్త్రిగారు చిరునవ్వుతో, "All of the three girls of my relative eloped with three kamma boys. Krishnarao is a kamma boy. Probably he might be our relative" అని అన్నారు. ఆదెబ్బతో ఆ అడ్వకేట్ చెప్పాపెట్టకుండా అక్కడ్నుంచి వెళ్లిపోయాడు.

ఇలా చెప్పుకొంటూపోతే, శాస్త్రిగారి జీవితం ఎంత విస్తృతమైన నవలో, ఆ నవల్లో ఎన్ని కథలున్నాయో, ఆ కథలు ఆయనెరిగిన ఎందరి జీవితాల్లో నిక్షిప్తమై ఉన్నాయో తెలుసుకుంటూ పోతే, కంచికి వెళ్లని కథలెన్నో వినిపిస్తాయి.



# రావిశాస్త్రి విమర్శా కథనం

పాణి



'విమర్శా కథనం' అనే మాట చర్చనీయాంశం కావచ్చు. దేనికంటే 'విమర్శ'లో పద్ధతి ప్రధానం. కథనంలో వర్ణన ప్రధానం. కాబట్టి విమర్శా కథనం అనడంలో ఇబ్బంది ఉంది. అయితే కథనంలో కూడా విమర్శ ఉంటుంది. విమర్శనాత్మకత లేకుండా కథనం సాగదు. ఒకవేళ సాగితే ఆ వర్ణన, లేదా చిత్రణ, లేదా వాటి వెనుక ఉండే అనుభవ గాఢత అబ్బురపరుస్తుందేమోగాని ఆలోచనలు రేకెత్తించదు. కానీ మంచి కథనం భావోద్వేగాలతోపాటు ఆలోచనలనూ కలిగిస్తుంది.

రావిశాస్త్రి కథల గురించి, నవలల గురించి ఎన్నో విలువైన విశ్లేషణలు మన ముందు ఉన్నాయి. వాటిని కాసేపు పక్కనపెట్టి ఆయన రాసిన వ్యాసాలను చదివితే రావిశాస్త్రి సాహిత్య విమర్శకుడు కూడా అనిపిస్తుంది. ఆయన ప్రత్యేకంగా సాహిత్య విమర్శ, సామాజిక విమర్శ పేరుతో ఏదీ రాయలేదు. కానీ రచన మొదలు పెట్టినప్పటి నుంచి పుస్తకాలకు ముందుమాటలు, వెనుకమాటలు, ప్రసంగ వ్యాసాలు(ఆయనే రాసి చదివినవీ, ఆయన ప్రసంగాలను ఇతరులురాసినవీ), సంపాదకీయాలు, వ్యాసాలు, ఉత్తరాలు, ఇంటర్వ్యూలు, ఖండన ప్రకటనలు.. ఇలా అనేక రూపాల్లో సామాజిక, సాహిత్య విమర్శ కనిపిస్తుంది.

రావిశాస్త్రి కథల్లో, నవలల్లో వర్ణనలు బారుగా ఉంటాయి. కానీ పైన చెప్పినట్లు 'వ్యాసాలు' ఏ రూపంలో ఉన్నా సరే నేరుగా సూటిగా ఉంటాయి. కుప్తంగా ఉంటాయి: అన్నిటిలోనూ దాదాపుగా కథన శైలి ఉంటుంది. ఆయనను ఎరిగిన వాళ్లు శాస్త్రిగారి మాటల్లో, సంభాషణల్లో సహితం కథనం ఉంటుందని చెబుతారు. కాబట్టి కథనానికి బైట ఆయన భాషా వినియోగాన్ని చూడలేం. భావ వ్యక్తీకరణను చూడలేం. ఆయన కథల్లో, నవలల్లో ఉండే జీవన వాస్తవికతను, దృక్పథాన్ని, కథన శైలిని, సంవిధానాన్ని, వర్ణనలను వివరించేవారు తప్పక ఆ అన్నిటిలో ఆయన విమర్శనాత్మకతను కూడా ఎత్తి చూపుతారు.

ఆధునిక కవిత్వంలో, ఇతర వచన రచనల్లో దృక్పథాన్ని స్థాపించిన ఘనత గురజాడకు దక్కుతుంది. ఆయన కంటే ఎక్కువగా సాహిత్య, సామాజిక రంగాలకు దోహదం చేసిన వాళ్లు ఎందరో ఉన్నారు. ఆయనకంటే ముందు, తర్వాతా ఉన్నారు. ఆయన కాలంలో కూడా ఉన్నారు. కానీ వాళ్లలో దృక్పథ వైరుధ్యాలు కనిపిస్తాయి. ఉదాహరణకు వ్యవహారిక భాష వచ్చాక కూడా చాలా ప్రగతిశీల విషయాలను గ్రాంథికంలో, సరళ గ్రాంథికంలో చెప్పినవాళ్లు ఉన్నారు. ఇది దృక్పథ సమస్యకు ఒక నిదర్శనం. ఇలాంటివేవీ లేకుండా దృక్పథంలో స్పష్టత ఉన్న సాహిత్యకారుడు గురజాడ. ఒక రకంగా సాహిత్యం అంటే కళాత్మక దృక్పథం అనే స్థాయికి ఆయన తీసికెళ్లారు. ఆధునికతలోని హేతుబద్ధతను, విమర్శనాత్మకతను పుణికి పుచ్చుకోవడమే దీనికి కారణం. తెలుగు సమాజ సాంస్కృతిక ప్రయాణానికి ఆధునికతను ఆయన రహదారిలా నిర్మించారు. ఆయన మార్గమే ఏకైకం కాదు. దళిత బహుజన మార్గంలో, స్త్రీల మార్గంలో ఈ ఆధునికతా పరిణామం సాగింది.

గురజాడ చూపిన దారెంట తెలుగు సాహిత్య, సాంస్కృతిక రంగాల్లోకి అనేక మంది ప్రయాణించారు. ఆయన చూపిన విమర్శనాత్మకతను తెలుగు నేల మీద, లేదా ఉత్తరాంధ్రలో రావిశాస్త్రి చాలా ముందుకు తీసికెళ్లారు.

రావిశాస్త్రి కథనంలోని వర్ణన ఒక్కోసారి అదుపుతప్పిపోవచ్చు. అలాంటప్పుడు ఆయన వర్ణన స్త్రీల విషయంలో అభ్యంతరం అనిపించవచ్చు. ఒక్కోసారి బోర్ కొట్టవచ్చు. సాగదీసినట్టనిపించవచ్చు. వర్ణన తప్ప కథనం నడుస్తున్నదా? అనే సందేహం కలగవచ్చు. కానీ విమర్శనాత్మకతలో రావిశాస్త్రి ఎక్కడా పొరబడరు. సంబంధాలు, మనస్తత్వాలు, వ్యవస్థలు, వాటి నడవడికలు, విలువలు, వాటి నగిషీలు, కట్టుబాట్లు, వాటి డొల్లతనాలు, దుర్మార్గాలు.. ఇలా దేన్నయినా సరే విమర్శనాత్మంగానే చూస్తారు. దేన్నీ యథాతథంగా తీసేసుకోరు. సమాజం నుంచి, వ్యవస్థల నుంచి సంక్రమించిన దేన్నయినా విమర్శనాత్మకంగా పరిశీలిస్తారు. తన పాత్రలపట్ల కూడా ఏ మాత్రం వ్యామోహం లేకుండా, తాను చెప్పాలనుకుంటున్న అనుభవం పట్ల అతిశయం పోకుండా, ఉదాత్తీకరించకుండా తను సృష్టించిన కాల్పనిక ఆవరణలో కూడా విమర్శనాత్మకంగా ఉండడం రావిశాస్త్రి ప్రత్యేకత.

దీనికి కారణం బహుశా ఆయన సాహిత్యంలోని పాత్రలు, ఆయన చేసే కల్పనలు అన్నీ ఈ సమాజానికి ప్రాతినిధ్యం వహించేవే.

ఈ సమాజం పరిధిలో ఉండేవే. కాబట్టి వాటిపట్ల ఆయనకు విమర్శ తప్ప మోజు ఉండదు. అసంఖ్యాక శ్రామిక పాత్రలపట్ల కూడా గౌరవం తప్ప నిర్విమర్శా సమర్థన ఉండదు. సారాంశంలో ఉనికిలో ఉన్న అన్నిటినీ ఆయన విమర్శనాత్మకంగానే చూశారు. ' విప్లవాచరణను, మానవాళి సాధించుకోగల భవిష్యత్తును మాత్రమే ఉద్వేగంగా, ఆశావహంగా, సంపూర్ణ సమర్థనగా చూస్తారు. అదంతా రూపొందుతున్న భవిష్యత్తు అనే చారిత్రక దృష్టి ఉన్నందు వల్లే కావచ్చు.. ఆయన ఆ వైఖరి తీసుకుంటారు. 'తప్పులయితే అందరూ చేస్తారు.. త్యాగాలు కొందరే చేస్తారు..' అని విప్లవకారులను వెనుకేసుకొని రావడానికి ఇదే పని చేసి ఉండవచ్చు. కానీ తన పాత్రలు చేసిన తప్పులను కూడా ఆయన ఎక్కడా వెనుకేసుకొని రారు. పరిస్థితులను వివరించి మనకు ఆ మనుషుల పట్ల గౌరవం కలిగేలా చేస్తారు. అంతేగాని నిర్విమర్శగా వాళ్లను ఉన్నతీకరించారని అనిపించేలా రాయరు. ఇదంతా ఆయన కథల్లో, నవలల్లోని విమర్శనాత్మకత.

ఆధునిక తెలుగు సాహిత్యం ఇంత దూరం ప్రయాణించాక కూడా కల్పనా సాహిత్యంలో అనుభవాలు, భావోద్వేగాలు, మమేకతలు మాత్రమే ఉంటాయని అనుకొనే వాళ్లు ఇంకా ఉన్నారు. కానీ సాహిత్యం అనుభవ తలాన్ని తట్టేదే కాదు. ఆ పని చేస్తూ ఎరుక కలిగిస్తుంది. విమర్శనాత్మక చింతనను పెంచుతుంది. ఎరుక అంటే అదే. ఆ రకంగా చూసినప్పుడు రావిశాస్త్రి కల్పనా సాహిత్యమంతా పాఠకుల విమర్శా స్థాయిని గరిష్టంగా పెంచేదే. ఇది ఆయన వ్యక్తిత్వంలో సంలీనమై ఉంటుంది.

అందువల్ల ఆయన వ్యాసాల్లో విమర్శనాత్మకత నేరుగా, సూటిగా ఉంటుంది. దేన్నయినా ఆయన చూసే, తెలుసుకొనే, వివరించే మాధ్యమం కథనమే. విమర్శనాత్మకత, కథనాత్మకత అనేవి రావిశాస్త్రి కాల్పనిక, మేధో వ్యక్తిత్వంలో ఒకటిగా ఉండే రెండు భాగాలు. ఆయన కథలు, నవలలు రాయడం ఆపేశాక, లేదా మరణించాక ముందుకు వచ్చిన రెండు తరాల పాఠకులను, విమర్శకులను సమ్మోహపరిచేది ఆయనలోని కథనాత్మక విమర్శే. పైగా ఇప్పటికీ ఆ సంబంధాలు, వ్యవస్థలు, దుర్మార్గాలు, కపటాలు పెద్దగా ఏమీ మారలేదు. రూపం మార్చుకున్నాయి. సంక్లిష్టమయ్యాయి. పని తీరు మార్చుకొని కొంచెం అటూ ఇటూగా అవే ఉన్నాయి. అందువల్ల కూడా ఆయన విమర్శనా దృష్టి ఈ కాలంలో జీవిస్తున్న వాళ్లను కూడా కదిలిస్తుంది. రావిశాస్త్రి వర్ణన పాఠకులను అలరిస్తుందనే మాట నిజమే కావచ్చు. అంతకంటే ఎక్కువ ఆకట్టుకొనేది మాత్రం ఆయన విమర్శనాత్మక.

ఇంత పదునైన విమర్శనా దృష్టి ఉన్న రావిశాస్త్రిలో సాహిత్య విమర్శకుడు ఎందుకు ఉండడు?

1

రావిశాస్త్రి గొప్ప వ్యవస్థా విమర్శకుడు. దీన్ని ఆయన పుట్టి పెరిగిన స్థలకాలాల్లో చూడాలి. రావిశాస్త్రి 1922 జులై 22న పుట్టారు. 1938లో తొలి కథ రాసినట్లు ఆధారాలు ఉన్నాయి. 1949 దాకా ఆయన తొలి దశ నడిచింది. 1953 దాకా కథలు, నవలలు రాసినా, 'అల్పజీవి' రచనతో ఇవాళ మనం చెప్పుకొనే రావిశాస్త్రి రూపొందారు.

ఆ రకంగా ఆయన అధికార మార్పిడికి పూర్వరంగంలో పుట్టి వికసించి, ఆ తర్వాత కొద్ది సంవత్సరాలకే సమాజం మీద విమర్శనాత్మక వైఖరి సంతరించుకున్నారు. చాలా మందిలాగే ఆయనా గాంధీ గురించి, కాంగ్రెస్ గురించి సానుకూలంగా ఆలోచించిన దశ నుంచి 'స్వతంత్ర' భారతదేశం మీద తీవ్రమైన విమర్శ పెట్టే దాకా ఎదిగారు. రావిశాస్త్రి సామాజికుడిగా, బుద్ధిజీవిగా విమర్శా దృక్పథాన్ని అలవర్చుకున్న స్థలకాలాల్లోనే దాని లోతు ఉన్నది. పదును ఉన్నది. అదే ఆయనను సాహిత్య విమర్శకుడ్ని చేసింది.

ఆయన సాహిత్యాన్ని ఒక విడి రంగంగా చూడలేదు. సాహిత్య రచనలో శిల్పాన్ని ప్రత్యేకంగా అభివృద్ధి చేసిన రావిశాస్త్రి సాహిత్యరంగాన్ని మాత్రం వేరుగా చూడలేదు. ఆయన దృష్టిలో సామాజిక, సాహిత్య దృక్పథాలంటూ విడిగా ఉండవు. ఆ రకంగా కూడా సాహిత్యమంటే కళాత్మక దృక్పథమనే వాదనను ఆయన విప్లవ సాహిత్యోద్యమ చరిత్రలోకి నేరుగా తీసుకొచ్చారు. అందువల్ల సామాజిక విమర్శే సాహిత్య విమర్శా దృక్పథంగా ఆయనలో సహజంగానే అభివృద్ధి చెందింది.

అందువల్లే రావిశాస్త్రిలో విమర్శనాత్మకత అనేది మొదట సామాజిక దృక్పథంగా మొదలైందా? సాహిత్య దృక్పథంగా మొదలైందా? చెప్పడం కష్టం. మనకు దొరికే ఆధారాలనుబట్టి అల్పజీవి నవలకు ఆయన రాసిన ముందుమాటలో గొప్ప సాహిత్య విమర్శ కనిపిస్తుంది. అంతకముందు కూడా ఆయన విలువైన సాహిత్య అభిప్రాయాలు ఎన్నో చెప్పి ఉంటారు. కానీ సాహిత్య స్వభావం, ప్రభావం, ప్రయోజనం మొదలైనవి చాల క్లుప్తంగా, గాఢంగా అల్పజీవి సందర్భంలో చెప్పారు. ఆయనకు ఈ సమాజం మీద ఉన్న విమర్శే సాహిత్య విమర్శగా వ్యక్తం అయిందని దీన్నిబట్టి చెప్పవచ్చు. సృజనాత్మక రచయితగా ఆ నవలలో తీసుకున్న సామాజిక వైఖరినే ముందుమాటలో సాహిత్య విమర్శగా కూడా మనం చదువుకోవచ్చు.

'ప్రతి రచయిత కూడా తను ఎవరి మంచి కోసం రాయాలో ఎప్పుడో ఒకప్పుడు నిర్ణయించుకుంటాడని నేను అనుకుంటాను..అందుచేత రచయిత ప్రతివాడూ తను రాస్తున్నది ఏ మంచికి హానీ కలిగిస్తుందో ఏ చెడ్డకి ఉపకారం చేస్తుందో ఆలోచించుకోవలసిన అవసరం ఉందని నేను తలుస్తాను. మంచికి హానీ, చెడ్డకు సాయం చెయ్యకూడదని నేను భావిస్తాను. ఇది తెలుసుకుందికీ, తెలియజెప్పడానికీ అనుకుంటూ నేనిదంతా రాసేను' అన్నారు.

సాహిత్యంలోని మంచి చెడ్డలనేగాక సమాజంలోని మంచి చెడ్డల దృష్ట్యా సాహిత్యాన్ని పరిశీలించే ఈ దృక్పథం ఆయనకు అప్పటికే స్పష్టంగా ఉండింది. ఇది మరో పదేళ్లకల్లా పదునుదేలింది. 1963లో రాసిన 'ముద్రారాక్షసం' అనే వ్యాసం చదివితే అద్భుతం అనిపిస్తుంది. ఆయన జాతీయోద్యమ యుగపు మానవుడని, అధికార మార్పిడిని కళ్లారా చూసిన వాడనుకొని దీన్ని చదవాలి. ఆనాటికి దేశం సోషలిజంలోకి వెళుతోందని, ఇక తనకు పనేమీ లేదని కమ్యూనిస్టుపార్టీ కూడా అనుకున్న కాలం అది. ఆ పార్టీని నమ్ముకున్న మేధావుల్లో, రచయితల్లో అనేక మంది అదే దారిపట్టారు. కానీ దృక్పథ స్పష్టత ఉన్న రచయితలు అప్పటి నుంచే ఏటికి ఎదురీది నిలబడ్డారు. దానికి కొంత టైం తీసుకున్న వాళ్లూ ఉన్నారు. కాలంతోపాటు పరిగెత్తి నెహ్రూ 'సోషలిజం'లోని పెట్టుబడిదారీ అభివృద్ధిని పసిగట్టినవాళ్లూ ఉన్నారు. వీళ్లలో రావిశాస్త్రి మొదటి వరుసలో ఉంటారు. నిజానికి ఆయన ప్రగతిశీల, వామపక్ష సాహిత్యంలో రెండో తరం రచయిత. కానీ దేశంలో జరిగింది కేవలం అధికార మార్పిడీ తప్ప మరే మార్పు రాలేదని గుర్తించడంలో మొదటి వరుసలో నిలిచారు.

ఈ మొత్తం వాతావరణంలో ఆయన ఒక విషయానికి తీవ్ర మథన పడ్డాడని అనుకోవచ్చు. దేనికంటే అధికార మార్పిడి జరిగిన

ఐదారేళ్ల నుంచే ఆయన దాని మీద తీవ్రంగా తన రచనను ఎక్కుపెట్టారు. అదేమంటే సమాజంలో వర్గ రాజకీయాలు లుప్తమవుతున్నాయనే ముందు చూపు. దీన్నాయన చాలా స్పష్టంగా గుర్తించారు. సమాజంలోనే వర్గ రాజకీయాలు లేకుండా పోతోంటే సాహిత్యంలో మాత్రం ఉంటాయా? సాహిత్య విమర్శలో మాత్రం ఉంటాయా? కాబట్టి వర్గ రాజకీయాలను ఎత్తిపట్టడం రచయితగా తన బాధ్యత అనుకున్నారు. ఆయన రచనా స్వభావం వల్లనే ఆయన నేను ఈ పనికి దిగుతున్నాను అని ప్రకటించుకోలేదు. కాల్పనిక రచయితగా శ్రామికవర్గం గురించి రాయడం ఆరంభించారు. సాహిత్యం మంచి చెడ్డలను, రచయితల దృక్పథాన్నీ వివరిస్తూ కూడా అదే మాట చెప్పడం మొదలు పెట్టారు. వేర్వేరు సందర్భాల్లో ఆయన వెలుబుచ్చిన సాహిత్య అభిప్రాయాలు క్రోడీకరిస్తే అందులో ప్రమాణిక మార్క్సిస్టు సాహిత్య విమర్శ కనిపిస్తుంది. ఈ పని చేయడానికి ఆయన అనేక సందర్భాలను ఎన్నుకున్నారు. కథలు, నవలలు రాసి సరిపెట్టుకోలేదు. సాహిత్య, సామాజిక రంగాలంతపై తన విమర్శను అందించేందుకు వచ్చిన ప్రతి అవకాశాన్నీ వదిలిపెట్టలేదు. వేర్వేరు పుస్తకాలకు ఆయన రాసిన ముందుమాటలు చూడండి. అవి చాలా చిన్నగా ఉంటాయి. ఆ రచయిత గురించి, రచన గురించి చెబుతూ ప్రామాణిక సాహిత్య అభిప్రాయాలు వెల్లడి చేస్తారు. సాహిత్య స్వభావం, ప్రభావం, ప్రయోజనంలాంటి గంభీరమైన అంశాలను తడమకుండా ఏదో ఆ రచననో, రచయితనో పరిచయం చేస్తూనో, పొగుడుతూనే ఆ ముందు మాటలు ఉండవు.

దీనికి అనేక ఉదాహరణలు ఇవ్వవచ్చు. ఆయనన 'ముద్రారాక్షసం' వ్యాసాన్ని ఇలా ప్రారంభించారు.

'రచయితలకి రాజకీయాలతో సంబంధం ఉండకూడదని చాలా మంది పెద్దలు చెప్పగా విన్నాను. ఏ రచన కూడా ప్రచారాత్మకంగా ఉండకూడదని కూడా పెద్దలు చెప్పగా విని తలూపేను. పెద్దవాళ్లేదైనా చెప్పేరంటే అది మన మంచికే కదా చెప్తారు.

కానీ చైనా తగవుతో రచయితలంతా సంబంధం పెట్టుకోవసిన అత్యవసర పరిస్థితి ఏర్పడిందనీ, రచనలు మంచి ప్రచారాత్మకంగా ఉండాలనీ కూడా తెలుసుకున్నాను..'

పాలకులు సరిహద్దు యుద్ధాలకు దిగినప్పుడు తమ యుద్ధ రాజకీయాలకు తగినట్లు రచయితలు రచనలు చేయాలనే సుభాషితం వినిపిస్తుంది. మామూలప్పటి కంటే పాలకులు యుద్ధానికి తలపడ్డప్పుడు రాజకీయాల్లో వర్గం పూర్తిగా గల్లంతవుతుంది. ఈ సంగతి రావిశాస్త్రిని ఈ వ్యాస రచనకు పురికొల్పింది. నెహ్రూ తాను రాసిన ఒక వ్యాసంలో ముద్రారాక్షసం అనే రచన గురించి ప్రస్తావించడాన్ని సందర్భం చేసుకొని ప్రపంచంలో నడుస్తున్న రాజకీయాలను, సాహిత్యంలో ఉన్న, ఉండవలసిన రాజకీయాలను అన్నీ రావిశాస్త్రి చర్చించారు. ఈ వ్యాసం చదివితే ఆయన మేధావి అయిన రచయిత అనిపిస్తుంది.

దేనికంటే రావిశాస్త్రి చాలా చోట్ల తాను అట్టే చదువుకోలేదని, మేధావిని కానని మొదలు పెడతారు. పాఠకులు నిజమే కాబోలని అనుకొనేలా చాలా మామూలు మాటలు చెప్తూ లోకం గురించి, జీవితం గురించి అసాధారణ లోతుల్లోకి, ఎత్తుల్లోకి తీసికెళతారు. అప్పుడు కూడా కొందరికి ఆయన మేధావి అనిపించకపోవచ్చు. కానీ మనల్ని ఆ ఎత్తుల్లోకి తీసికెళ్లి గొప్ప జ్ఞాన అనుభవాన్ని ఇస్తారు. అదీ ఆయన వ్యాస శిల్పం. ఆలోచనా శిల్పం.

అసలు విషయం ఏమంటే ఈ వ్యాసంలో ఆయన నెహ్రూ మీదనే విమర్శ చేయలేదు. దేనికంటే ఆయన ఉద్దేశం అదొక్కటే కాదు. నెహ్రూను ఐట్టబయలలు ఎలాగూ చేద్దామనుకున్నాడు. ఆయన అసలు వ్యూహానికి నెహ్రూ కేంద్రం మాత్రే. ఆయన దగ్గర ఆరంభించిన విమర్శ అధికార మార్పిడీ తర్వాత నడుస్తున్న బూర్జువా రాజకీయాలన్నిటికీ వర్తిస్తుంది. ఈ మాటలు రాయడానికి అప్పుడే వచ్చిన 'స్వాతంత్ర్యం', నెహ్రూ వ్యక్తిత్వంలోని తళుకుబెళుకులు, ఆయన సాధిస్తున్న అభివృద్ధిలోని నగిషీలు ఏవీ రావిశాస్త్రికి ఆటంకం కాలేదు. ఆయనలోని హేతుబుద్ధిని అడ్డుకోలేదు.

ఆయన అంటారు కదా.. 'పండిత నెహ్రూ గారెక్కడ? నేనెక్కడ? ఆయన మహానుభావుడు. నేను బేడాపరగాణ్ణి'(ఇది నెహ్రూ మీది వ్యంగ్యమేనా? కానే కాదు. నిశితమైన వర్గ దృష్టి, రాజకీయార్థిక దృష్టి) అంటూ ఐదో శతాబ్దంనాటి సంస్కృత నాటకం ముద్రారాక్షసాన్ని నెహ్రూ ఇష్టపడటంలోని రాజకీయం ఏమిటో చాలా వ్యంగ్యంగా వివరిస్తారు. అక్కడితో ఆగకుండా సోవియట్ యూనియన్ దిక్కు మార్చేస్తోందని కూడా ఆయన పసిగట్టారు. 'ఇదేమిట్రా అని నేను నెవ్వెరపోయి చూస్తుండగానే రష్యాలో 'పడమటి వైపు' కిటికీలు తెరిచార'ని అంటారు. అంతర్జాతీయ స్థాయిలో రివిజనిజాన్ని యుగోస్లేవియా అధ్యక్షుడు టిటో 'శాంతియుత సహజీవనం' పేరుతో తేవడాన్ని ఆయన చాలా సీరియస్‌గా తీసుకున్నారు. ఆయనకు సోషలిజం పట్ల ఎంత నిబద్ధత ఉన్నదో రివిజనిజం పట్ల అంత వ్యతిరేకత ఉన్నదనడానికి ఈ తొలి రోజుల రచన సాక్ష్యం. రివిజనిజం మీది వ్యతిరేకతే ఆయన చివరి రోజుల వరకు విప్లవోద్యమంతో దృఢంగా నిలబడి ఉండేందుకు కారణమైంది.

నెహ్రూ పాలననే కాదు. మొత్తంగా వలసానంతర భారతదేశంలో రాజ్యం గురించి, అసమానతలు గురించి, శ్రామిక ప్రజల దుస్థితి గురించి రావిశాస్త్రి 1963లోనే 'పులిపవర్గు' అనే వ్యాసం రాశారు. దేశంలో ప్రభుత్వాలు నిరంకుశంగా తయారయ్యాయని, పాలకులకు ప్రజలు పట్టరని అద్భుతంగా వివరించారు.

'ప్రపంచంలో ఎక్కడికెళ్లి చూసినా పీకల్తీసే అధికారం ప్రభుత్వాలకే ఉంటుంది. ప్రజలకు ఉండదు' అంటారు. 'రాజ్యం చేసే రాజుకి పులిపవర్గుండటం ఏ సమయంలోనూ ప్రజలకంత క్షేమకరం కాదు' అంటారు. 'సింహాసనం మీద పులులు కూచుంటే గోవులకీ, గొర్రెలకీ మరింక బతుకులుండవు' అంటూ 'నాకు మాత్రం గోవులంటేనే ఇష్టం' అని తేల్చేశారు.

హిందుత్వ ఫాసిజం వచ్చాక హింసకు, ఆధిపత్యానికి, పవిత్రతకు గోవు మారుపేరు అయింది గాని రావిశాస్త్రి 1963లోని వర్గ వైరుధ్యాలను చెప్పడానికి గోవులు-పులులు అనే మాటలను వాడారు. అదే శ్రీకాకుళ పోరాటం తర్వాత గోవులొస్తున్నాయి..అనే ప్రతీకాత్మక విప్లవ నవలగా మారింది.

సరిగ్గా ఇలాగే గుర్తు చేసుకోవాల్సిన వ్యాసం ఇంకోటి ఉంది. అది నెహ్రూ చనిపోయాక రాశారు. చచ్చిన వాడి కళ్లు చారెడు అనే లౌల్యానికి లోనుకాని నిశిత వర్గ దృష్టి రావిశాస్త్రి సొంతం. ఆ వ్యాసం పేరు 'అపర చాణుక్యుడు'. ఆయన రాజకీయ వ్యంగ్యానికి, సృజనాత్మకతకు, వర్గ దృక్పథానికి ఈ వ్యాసం నిదర్శనం. నెహ్రూ గురించి వాళ్లూ వీళ్లూ అనుకొనే గొప్పలన్నీ వివరించి 'మనకు ఏవీ లేకపోయినా ఆ దేశాలతోపాటు సమానంగా మనకు వేదిక మీద సోఫా కుర్చీ వేయించేరు పండిత నెహ్రూగారు.

ఉన్నదొకటే అస్త్రం-సమ్మోహనాస్త్రం' అంటారు.

నెహ్రూ వ్యామోహంలో కమ్యూనిస్టుపార్టీ కూడా పడిపోయి,

తన వర్గ చేవను కోల్పోయిన రోజుల్లో నెహ్రూ అంటే బూర్జువా వర్గం చేతిలోని 'సమ్మోహనాస్త్రం' అని వేళాకోళం చేశారు. మనకు ఆ సమ్మోహనం తప్ప ఇంకే ప్రజానుకూల వాస్తవ ప్రపంచం లేదని చెప్పడం ఆయన ఉద్దేశం.

ఇక్కడితో నెహ్రూను వదిలిపెట్టారా? లేదు.

ముగింపులో ఏమంటారంటే..

'శాస్త్రీ రచయితగా నెహ్రూ గురించి రాయడం మర్చిపోయేవు'

'కృష్ణుడికి సంస్కృతం బాగా వచ్చును. అతను ఉపన్యాసాలివ్వగలడు. గీతలు చెప్పగలడు, అని ప్రత్యేకంగా చెప్పాలా మూర్తీ' అంటారు.

నెహ్రూ బూర్జువా వర్గం చేతిలో సమ్మోహనాస్త్రమే కాదు. ఆయన గీతాచార్యుడు కూడా. గొప్ప ప్రసంగీకుడు. ఇదీ ఆయన మీది నెహ్రూ అంచనా.

2

అధికార మార్పిడీ జరిగినప్పటి నుంచి, కమ్యూనిస్టు పార్టీ రివిజనిస్టు ఊబిలో పడిపోయినప్పటి నుంచి తిరిగి నక్సల్బరీ దాకా తెలుగు సాహిత్య, మేధో, సాంస్కృతిక రంగాల్లో వర్గ చైతన్యాన్ని దృఢంగా నిలబెట్టిన వాళ్లలో రావిశాస్త్రి ప్రముఖుడు. ఇది ఆయనలో ఎలా పెరుగుతూ వచ్చిందో అధ్యయనం చేయాలి. ఇది ఆయన కాల్పనిక రచనల్లో కనిపిస్తుంది. మిగతా రచనల్లోనూ కనిపిస్తుంది. సరిగ్గా అక్కడే ఆయన సాహిత్య విమర్శకు గట్టిగా దోహదం చేశారు.

సాహిత్యంలోకేగాక, సాహిత్య విమర్శలోకి కూడా ప్రగతిశీల, మార్క్సిస్టు దృక్పథాన్ని చాలా ఉద్దేశపూర్వంగా తీసుకొచ్చిన రావిశాస్త్రి కొన్ని సందర్భాల్లో స్త్రీల గురించి తనకు పితృస్వామ్య దృక్పథం ఉందని పాఠకులకు అనుమానం కలిగేలా రాశారు. స్త్రీ పట్ల సమాజానికి ఉన్న 'వర్ణన'లను అలాగే వాడేశారు. కానీ వాళ్లపట్ల ఆయనకు అపారమైన కరుణ, బాధ్యత ఉన్నది. వాళ్ల జీవితానుభవాన్ని, వివేకాన్ని గొప్పగా గౌరవించారు. శ్రామిక, మధ్య తరగతి స్త్రీ పాత్రలు కేంద్రంగా ప్రగతిశీల దృక్పథాన్ని ఎత్తిపడుతూ రాశారు.

ఈ దృష్టి ఉన్నది కాబట్టే చాలా సులభంగా శ్రీకాకుళ పోరాటంతో కనెక్ట్ అయ్యాడు. 1967 నుంచి ఆయన మరో దశలోకి ఎదిగారు. చివరి దాకా సాయుధ వర్గ పోరాటాల పక్షాన నిలబడ్డారు. 1953 దాకా తొలి దశ అనుకుంటే చివరి రెండు దశల్లో తెలుగు సాహిత్యాన్ని తేజోవంతం చేశారు.

మామూలుగా రావిశాస్త్రి అనగానే గొప్ప శిల్పం, వర్ణన, వ్యంగ్యం గుర్తుకు వస్తాయి. అవే ఆయనకు విశాల పాఠక ప్రపంచాన్ని ఇచ్చాయి. ఆయనకు కూడా తన శిల్పం పట్ల ఒక రకమైన మోజు ఉన్నట్లు కొన్ని ఇంటర్వ్యూలతో తెలుస్తుంది. పాఠకులను ఆకట్టుకొనేలా రచన ఉండాలని అంటారు. వెంటనే 'ఏం చెబుతున్నావు? ఎందుకు చెబుతున్నావు? ఎవరికి చెబుతున్నావు?' అనే వస్తు, దృక్పథ పరమైన అంశాలను రావిశాస్త్రి వక్కాణిస్తారు. ఇవి ఆయన కాల్పనిక రచనేకాక ఆయనలోని విమర్శకుడికి కూడా దారి చూపాయి.

ఈ క్రమంలో సాహిత్య సృజన గురించి ఆయన చేసిన ఆలోచనలు అబ్బురమనిపిస్తాయి. ఒక చోట ఏమంటారంటే 'రచనాశక్తి, కల్పనాశక్తేగాని మానవుడికి లేకపోయినట్లయితే ఈ సంఘం ఈ నాగరికత ఈ పురోగమనం ఏదీ ఉండదని, మనకు, పశువుకీ మధ్య తేడా ఉండకపోవునని నేననుకుంటా' అని 1965లోనే అంటారు.

మానవుల ఊహాశక్తి, కాల్పనికత కళా సాహిత్యాలకేగాక

**"...ఇంగ్లీషువాడు మనకి స్థాపించిన న్యాయం అది. ఆకులన్నీ ప్రజలవి. ఆపిల్ పళ్ళన్నీ అధికారులవి. వాళ్ళ దేశంలోనూ అంతే, మన దేశంలోనూ అంతే. మనకి వాడు చెప్పిన పాఠమే అది. పని కూలి వెధవల్ది. లాభం బుగతది. ఏమైనా అంటే, ఎదురు తిరిగితే మన సాయానికి కోర్టులున్నాయి, జెయిళ్ళున్నాయి. ఇవి లేకపోతే ఇంగ్లీషువాడి రాజ్యమే లేదు. మాయగాళ్ళల్లోకల్లా మాయగాడు. మన దేశం వచ్చి, మన ఉప్పు మనకే అమ్మి, నా ఉప్పు తిన్నావు నాకు విశ్వాసంగా ఉండవా అని అడగగలిగినవాడు... ఆఖర్నయినా ఏం చేశాడు? అక్కడా- అక్కడా చలాయించినట్టు ఇక్కడ కూలి వెధవలు పెత్తనం చలాయిస్తారేమోనని అనుమానం కలిగింది. వెంటనే సాటి షావుకార్లకి రాజ్యం అప్పచెప్పి చల్లగా తెర వెనక్కి జారుకున్నాడు. గొప్ప మాయగాడు. వ్యాపారం, వ్యాపారంలాగే ఉంది. లాభాలు లాభాల్లాగే ఉన్నాయి. ఏదైనా రొష్టుంటే అదంతా మన వెధవల్దే అయింది."**

**-సీనియర్ లాయర్, మాయ కథలో**

మానవ సమాజ నిర్మాణానికి దోహదం చేశాయని, ప్రకృతిలోని ఇతర జీవరాసులకంటే భిన్నంగా మానవులు సమాజంగా ఏర్పడ్డారని, అది మారుతూ ఉన్నదని, అందుకే దానికి చరిత్ర ఉన్నదని, ఆ చరిత్రలో కళా సాహిత్యాలు భాగమని చాలా మామూలు మాటల్లో చెప్పాలనుకున్నారు. దాన్ని అక్కడి నుంచి ఇంకా ముందుకు తీసికెళతారు. సాహిత్యానికి ఉండే సామాజికతను అద్భుతంగా వివరిస్తారు.

'సామాజిక స్పృహ లేకుండా ఎవ్వరూ ఏ కల్పనా సాహిత్యం కానీ సృష్టించరు. మానవ లోకం అంతా ఒక్కగానొక్క సమాజంగా లేదు. వేర్వేరు సమాజాలు ఉన్నాయి. వేర్వేరు సమాజాల్లో వేర్వేరు రచయితలు ఉండటమే కాకుండా ఏ సమాజపు బాగు కోసం ఆ సమాజపు రచయితలు ఉంటారు..' అనే నిర్ధారణ చేశారు. సాహిత్యం అఖండం కాదని, వర్గ సమాజంలో వర్గ సాహిత్యమే ఉంటుందనే మౌలిక విషయాన్ని తేల్చి చెప్పారు. సాహిత్యం సామాజిక ఉత్పత్తి అయినా, మానవ కాల్పనిక శక్తి నుంచి పుట్టేదే అయినా వర్గ సమాజపు పరిధిలోనే ఇదంతా జరుగుతుందనే మార్క్సిస్టు సాహిత్య కళా సిద్ధాంతం దగ్గరికి వెళతారు.

ఇక్కడే ఇంకో ముఖ్యమైన విషయం చెబుతారు. 'రచనల్లో కొద్ది మంది మానవత్వం కావాలంటారు. మనిషిని మనిషిగా చూస్తే అన్నీ సర్దుకుంటాయంటారు. నా ఉద్దేశంలో ఇది పెద్ద అబద్ధం. పెద్ద మోసం' అంటారు.

ఇటీవల కొత్త తరం రచయితలు ఎవ్వరినీ నొప్పించకుండా, ఏ రాజకీయాలకూ కట్టుబడకుండా ఉండేందుకు తమది మానవతా వాదమని చెప్పుకోవడం ఫ్యాషన్ అయింది. మానవ అస్తిత్వవేదనే తమ కవిత్వమని చెప్పుకుంటున్నారు. అంటే రాజకీయాలు, వర్గాలు, ప్రజలు

అనే సంకుచిత పరిధికి కట్టుబడని, తాము విశాల మానవులమని చెప్పుకోవడం అసలు ఉద్దేశం. ఈ ధోరణి ఆ రోజుల్లో ఇంకా ఎక్కువగా ఉండేది. నిజానికి ఇది రాజకీయ, సాహిత్య సమస్య మాత్రమే కాదు. మానవత అనేది వర్గ సమాజంలో అతి పెద్ద అబద్ధం. సమాజం దాని మీద ఆధారపడి నడవలేదు. దీని గురించి రావిశాస్త్రి చాలా పదునైన సూత్రీకరణ చేశారు.

రావిశాస్త్రి చాలా చోట్ల మనిషి అని, మానవుడు అని ఏకవచన ప్రయోగం చేస్తారు.(అదీ మగవాళ్లను మాత్రమే సూచించేదై ఉండటం ఆయనకు, ఆ కాలానికి ఉన్న పరిమితి) అయితే ఆయనకు దీని మీద కూడా చాలా స్పష్టత ఉంది. అందుకే సాహిత్య సృజనకు సంబంధించిన లోతైన పరిశీలన చేశారు. 'మనిషి బహు వచనంగా ఉంటూ, సంఘజీవిగా ఉన్నాడు కాబట్టే నీతి నియమాల అవసరం ఏర్పడింది. మాటలు పుట్టడం జరిగింది. అలాగే కథలు కూడా లోకంలో ఒకడే మానవుడు ఉంటే పుట్టి ఉండవని నేననుకుంటాను..' అన్నారు.

మనిషి అంటేనే బహు వచనం అనే వర్ణనాత్మక వాక్యం దగ్గర ఆరంభించి భాష, సోషల్ నార్మ్స్ వలె కథలు కూడా సామాజిక సంబంధాల నుంచి పుట్టాయని అంటారు. మామూలుగా వ్యవహారంలో ప్రతి ఒక్కరికీ ఒక కథ ఉంటుందని అంటూ ఉంటాం. లోకంలో ఆ ఒక్కడే విడిగా ఉంటే కథ ఉండదు: కవిత్వం ఉండదు. సమాజిక సంబంధాల్లో భాగంగా ఉన్నందు వల్లనే ప్రతి ఒక్కరికీ కథ ఉంటుంది. ప్రతి ఒక్కరూ కథ రాయగలరు. దేనికంటే ఆ సామాజిక సంబంధాలకు వాటి అంతర్ తర్కం ప్రకారం చలనం ఉంటుంది. చరిత్ర ఉంటుంది. కాబట్టి అందులో భాగమైనందు వల్ల ప్రతి వ్యక్తి ఒక గొప్ప సృజనజీవి అవుతారు. కాబట్టి ఆ మనిషికి కథలుంటాయి.. 1960లలో ఆయన చెప్పిన ఈ మాట మార్క్సిస్టు సాహిత్య సిద్ధాంతానికి సామాజిక శాస్త్రం వైపు నుంచి ఎంతగా దోహదం చేసి ఉంటుందో మనం ఊహించుకోవలసిందే.

అట్లాగే ప్రతి భాషా సమాజంలో, ప్రతి కాలంలో గొప్ప సాహిత్యం తప్పక ఉంటుంది. అదేమిటో తెలియకపోతే పాఠకులు దాన్ని కోల్పోతారు. తద్వారా ఆ సమాజానికి చాలా నష్టం జరుగుతుంది. కాబట్టి దాన్ని తప్పక గుర్తించాల్సిందే. దీని మీద రావిశాస్త్రి కల్పనా రచయితగా తిరుగులేని ప్రమాణాన్ని స్థాపించారు. విమర్శ రంగానికి కూడా అలాంటి విలువను అందించారు: ఆయన ఏమంటారంటే 'రచనల్లో గొప్పదనం ప్రయోజనాన్ని బట్టి ఉంటుంది. దాని ప్రయోజనం సంఘంలోని జన సామాన్యపు ప్రయోజనాలతో కలిసిపోతే దానితో కళా నైపుణ్యం చేరిపోతే అది కలకాలం నిలిచిపోతుంది' అంటారు. తద్వారా గొప్ప సాహిత్యమంటే జన ప్రయోజనమే, దాన్ని తీర్చగల కళా నైపుణ్యమే.. అని తన పద్ధతిలో చాలా సరళంగా, గాఢంగా చెప్పారు.

గొప్ప కథలు ఎప్పుడు వస్తాయో కూడా ఆయన చెప్పారు. దాని కంటే ముందు ఏవి గొప్ప కథలు కాదో తెలుసుకోవాలి. ఆయన ప్రత్యేకంగా రెండు రకాల కథలను ప్రస్తావిస్తారు. ఒకటి అయ్యో అయ్యో కథలు. 'జీవితంలోని దరిద్రాన్నీ, దు:ఖాన్నీ, అన్యాయాన్నీ చూసి జాలిపడే కథలు ఉన్నాయి. అటువంటి కథలు ఆ దారిద్ర్యం, దు:ఖం, అన్యాయం ఉన్నన్నాళ్లూ వస్తూనే ఉంటాయి. వాటికి అయ్యో అయ్యో కథలనే పేరు పెట్టేన్నేను. నేను రాసిన మెరుపు మెరిసింది, కార్నర్ సీట్, జరీ అంచు తెల్లచీరె ఈ కథల జాబితాలోకి వస్తాయి' అంటారు. అలాగే 'ఛీ ఛీ కథలు కూడా ఉన్నాయి. సంఘంలోని దురాచారాలనో, దుష్ట వ్యక్తులనో దుయ్యబడుతూ రాసిన కథలివి' అంటారు.

మరి జన సామాన్య ప్రయోజనాన్ని తీర్చే గొప్ప సాహిత్యం ఎప్పుడు రాసే అవకాశం ఉంటుంది? దీని గురించి రావిశాస్త్రి అనేక సందర్భాల్లో చెప్పారు. అనేక రకాలుగా చెప్పారు. ఆయనకు మార్క్సిస్టు సిద్ధాంతంలో, రాజకీయాల్లో ఎంత నిబద్ధత ఉన్నా సాహిత్య రచన గురించి మాట్లాడేటప్పుడు కేవలం జీవవ వాస్తవికత, వైరుధ్యాలు, శ్రామిక ప్రజలపట్ల గౌరవం, కులీన జీవితం పట్ల అసహ్యం మాత్రమే లెక్కల్లోకి తీసుకొని చెబుతూ ఉంటారు. అందుకే మార్క్సిస్టు సాహిత్య విమర్శకు సంబంధించిన లోతైన పరిశీలనలు, విశ్లేషణలు ఎన్నో చేసినా దానికి ప్రత్యేకంగా విమర్శా రంగ కృషిగా గుర్తింపు రాలేదు. గొప్ప సాహిత్యం అంటే ఏమిటి? అనే విశ్లేషణలోకి వెళ్లి, ఒకచోట ఏమంటారంటే–'రచయితలు జీవితానికి దగ్గరిగా ఉండాలి. జీవితానికి దగ్గరిగా ఉండగలిగిన వారే మంచి రచయితలుగా మిగిలేరు..' అంటారు.

జీవితాన్ని దగ్గరిగా ఉండి ఎలా చూస్తాం? అక్కడే దృక్పథం పాత్ర ఉంటుంది. దీనికి ఆయన తరచూ సంస్కరణ దృష్టి, విప్లవ దృష్టి అనేవి జీవితాన్ని అర్థం చేసుకొని సాహిత్యం రాయడంలో రెండు మార్గాలు అని చెబుతూ వచ్చారు. 'వర్గాలు వాటంతట అవే సమసిపోతాయనడం సంస్కరణవాదం. కాదు కాదు. చిన్న చిన్న వాళ్లందరం కలిసి పెద్ద వాళ్లను కూల్చేసినప్పుడే ఇది సాధ్యం అవుతుందని అనుకోవడం విప్లవవాదం' అని చాలా స్పష్టంగా చెప్పారు. సాహిత్యంలో విప్లవవాదం ఈ భాషలో ఇలా ముందుకు రాక ముందు నుంచి రావిశాస్త్రి ఈ మాటలు చెబుతూ వచ్చారు. రచయితగా, లాయర్‌గా ప్రజల పక్షాన ఉన్నందు వల్ల ఏదో ఒక భాషలో ఈ సాహిత్య విశ్లేషణ అందిస్తూ వచ్చారు. మేధావిగా మార్క్సిజంపట్ల, విప్లవం పట్ల నిబద్ధత ఉన్నట్లే రచయితగా ఆయనకు జీవన వాస్తవికత పట్ల అంతే నిబద్ధత ఉంది. అది వాస్తవికత నుంచి సోషలిస్టు వాస్తవికత దాకా. దీనికి ఆయన పెద్ద సిద్ధాంత కసరత్తు చేసినట్లు లేదు. చాల సింపుల్‌గా ఏమంటారంటే 'ముందు వాస్తవికత తెలిస్తే సోషలిస్టు వాస్తవికత ఏమిటో తెలుస్తుంది' అనేస్తారు. 'సామాజిక స్పృహతో రాసిందే మంచి రచన.. దొంగ రచనలు చేయొద్దు' అని సూచిస్తారు.

'సాహిత్యం పెద్దల ప్రైవేట్ ఆస్తిగా ఎల్లకాలం ఉండిపోదు. అలా ఉండిపోవాలని శతాబ్దాలుగా అనుకున్న తెలుగు పెద్దలు మీద పెద్ద దాడి చేసినవారు స్వర్గీయ గిడుగు రామమూర్తిగారు. ఆ గిడుగు పిడుగు కూడా కోట కూలినప్పుడు శిష్టులే అందులో ప్రవేసిస్తారనుకున్నారు. కానీ అది జరగదు. శిష్టులకంటే ప్రజలే విశిష్టులు. శిష్టులొక్కరే కోట గోడలు కూల్చలేరు. జనం ఆ గోడల్ని కూల్చుతారు. స్వేచ్ఛని అందరూ అనుభవిస్తారు' అంటారు. గొప్ప సాహిత్యం పుట్టే చారిత్రక క్రమాన్ని చెప్పడానికి వంగపండు పాటలకు ముందుమాటలో ఈ మాటలు రాశారు.

1969, 70ల నుంచి భారత రాజకీయ, సాంస్కృతిక ప్రపంచం కొత్త యుగంలోకి ప్రవేశించడంతో రావిశాస్త్రి సాహిత్య విమర్శ కూడా మారిపోయింది. తెలుగులో విప్లవ సాహిత్యోద్యమం మొదలయ్యాక రెండున్నర దశాబ్దాలు ఆయన వివిధ రూపాల్లో కాల్పనికేతర వచనం విరివిగా రాశారు. విప్లవ సాహిత్యోద్యమ అవసరాలు తీర్చడానికి ఆయన ఈ రంగంలోకి దిగారు. విరసం తొలి సంవత్సరాల్లో విప్లవ సాహిత్య విమర్శ నిర్దిష్టత సంతరించుకోడానికి రావిశాస్త్రి వెలుబుచ్చిన సాహిత్య అభిప్రాయాలు దోహదం చేశాయి. సాంకేతికంగా విరసానికి దూరమయ్యాక కూడా ఆయన ఈ పని

ఎంతో కొంత చేస్తూ వచ్చారు. ఆ మధ్యలో ఆయన సాహిత్యం మీద, ముఖ్యంగా స్త్రీవాదుల మీద ఒకటి రెండు అభ్యంతర వ్యాఖ్యలు చేశారు. వాటిని విరసం ఖండించింది.

విప్లవ సాహిత్యానికి, సాహిత్య విమర్శకూ దోహదం చేసే క్రమంలో ఆయనలో కూడా మౌలిక మార్పులు వచ్చాయి. అప్పటి దాకా జీవన వాస్తవితే ప్రమాణంగా ఉండిన రావిశాస్త్రి 1970 తర్వాత దాన్ని మరింత స్పష్టంగా చూడ్డం నేర్చుకున్నారు. 'జీవితాన్ని కేవలం చిత్రించడమే కాకుండా పోలీసులు తుపాకులు పేల్చినప్పుడు నిబ్బరంగా నిలబడే గుండె ధైర్యాన్ని జనానికి తమ రచనల ద్వారా విప్లవ రచయితలు కలిగించాలి' అని విప్లవ సాహిత్యోద్యమానికి దిశా నిర్దేశం చేశారు.

ఏ జాతి కవిత్వం ఆ జాతికి అవసరం అని, మానవుల్లో ఎన్ని వర్గాలున్నాయో అన్ని రకాల కవులు కూడా ఉంటారని అంతక ముందే తెలుసుకున్న రావిశాస్త్రి తాను నిలబడ్డ వర్గం కోసం, తాను భాగమవుదామనుకున్న వర్గపోరాటం కోసం సాహిత్యం ఎలా ఉండాలో నిర్ణయించుకున్నారు. 1970 నుంచి ఆయన రాసిన కథల్లో, నవలల్లో అది కనిపిస్తుంది. సాహిత్యం గురించి వెలుబుచ్చిన అభిప్రాయాల్లోనూ అది కనిపిస్తుంది.

1960ల అరంభం నాటికే భారతదేశ స్థితిగతుల గురించి రావిశాస్త్రి ఏ అభిప్రాయాలకు వచ్చారో అవి మరింత చిక్కబడ్డాయి. సామాజిక వైరుధ్యాలు తీవ్రమయ్యాయి. ఆ రోజుల్లో అధికార మార్పిడి గురించి, నెహ్రూ మేక వన్నె ముఖం గురించి విమర్శనాత్మకంగా ఉన్న రావిశాస్త్రికి శ్రీకాకుళ పోరాటంతో ఆచరణాత్మక దృక్పథం పట్టుపడింది. న్యాయాన్యాయాలను, హింసాహింసలను వర్గ పోరాట ప్రాతిపదిక మీద తేల్చి చెప్పడం మొదలు పెట్టారు. ఇందులో ఆయనకు ఎక్కడా తటపటాయింపు లేదు. కచ్చితత్వం పాటించారు. 'ప్రజలకు న్యాయంగా ఏ న్యాయమైతే జరగాల్సి ఉందో, ఆ న్యాయం జరకుండా అడ్డుకోజూస్తే ఆ ఘర్షణ నుంచి హింస తప్పకుండా ఉద్భవిస్తుంది. అంతేకానీ, ప్రజలకు ఇలాంటి న్యాయం జరగాలని కోరడం హింస కాదు. కోరినంత మాత్రాన హింస రాదు కూడా..' అని 1971లో అన్నారు. 'ప్రజల పక్షాన పిట్ట నిల్చున్నాసరే పెద్దలు దాని రెక్కలు విరిచి రక్తం తాక్కమానరు' అని వ్యవస్థాత, రాజ్యహింసను సూటిగా చెప్పేశారు.

ప్రజల మీద హింస ప్రయోగించి, భయపెట్టాలని చూసే పాలకులు భయపడుతూ ఉంటారని, ఆ సంగతి ప్రజలకు తెలియదని రావిశాస్త్రి అభిప్రాయం. అది చెప్పడం కూడా రచయితల పని అంటారు. విరసం మీద నిర్బంధాన్ని ఖండిస్తూ ఒక సభలో మాట్లాడుతూ 'ఉన్న ఆయుధాలన్నీ ప్రభుత్వం దగ్గర, ధనికుల దగ్గరే ఉన్నాయి. నిజానికి ప్రజలంటే భయం వల్లనే వాడా ఆయుధాలు ఉంచుకున్నాడు. అయితే వాడు తమను చూసి భయపడుతున్నాడన్న విషయం ప్రజలకు తెలియదు..' అంటారు.

విప్లవోద్యమానికి, విప్లవ సాహిత్యోద్యమానికి మధ్య ఉండాల్సిన సంబంధం పట్ల రావిశాస్త్రికి చాలా స్పష్టత ఉంది. 'విప్లవ పార్టీలు పోరాట రూపాలు నిర్ణయించడానికి ప్రజలకి సహాయం చేస్తూ ఆ పోరాటాలకి నాయకత్వం వహించవలసి ఉన్నప్పుడు విప్లవ రచయితలు అందుకు సహాయం చేయ్యడం చాలా తప్పు పనునా?' అని సూటిగా ప్రశ్నించారు.

3

చివరగా మళ్లీ రావిశాస్త్రి విమర్శా కథనం దగ్గరికి వద్దాం. ఆయన ముందుమాటలు, వ్యాసాలు, సంపాదకీయాలు కూడా కథన పద్ధతిలో రాశారు. కథన పద్ధతిలో ఆరంభించి తర్వాత వ్యాసంగా మారినవీ ఉన్నాయి. కల్పనా సాహిత్యంలో చేయి తిరిగిన రచయితగా వ్యాసాన్ని కాల్పనికేతర సాహిత్యంగా అభివృద్ధి చేశారు. సాహిత్యం-వ్యాసాల మధ్య దూరం చెరిపేశారు. కథనం-విమర్శ సరిహద్దులు మార్చేశారు. సామాజిక, సాహిత్య విమర్శను కలిపి కొనసాగించారు. సామాజిక, సాహిత్య విమర్శను కథనీకరించారు. లోతైన సాహిత్య విమర్శ సూత్రీకరణలను, విశ్లేషణలను లోకరీతిలో, కామన్‌సెన్స్‌లో భాగంగా చెప్పడం అయన అలవాటు. ఈ క్రమంలో ఆయన తరచూ పురాణ ప్రతీకలను, అందులోని ఆర్య దృష్టిని వాడుకున్నారు. అందులోని పితృస్వామ్య కోణాన్ని యథాతథంగా ఉటంకించారు. దేన్నయినా కథనంగా చెప్పడం, కథనంగా అర్థం చేసుకోవడం అనే ఆయన ప్రత్యేకతలో ఇది భాగమైంది. ఆయన తరచూ పాపం-పుణ్యం, మంచి-చెడు, ధర్మం-అధర్మం వంటి ప్రమాణాలను తీసుకొచ్చారు. దాన్ని చాలా సాదాగా చెప్పడానికి, మామూలు పాఠకులకు కూడా అందించడానికి పురాణ ప్రతీకలను వాడుకున్నారు. అట్లా ఆయన పురాణాల్లోని పాత్రలను, పోలికలను, కథన విశేషాలను సామాజిక, సాహిత్య విమర్శలోకి తీసుకొచ్చారు. విశ్లేషణ ప్రధానంగా ఉండాల్సిన రంగంలో కూడా ఆయన అలాంటి వర్ణనలోకి, అర్థాలోకి వెళ్లారు. దేముడు అనే భావనను కూడా ఆయన అలాగే వాడుకున్నారు. అక్కడ రావిశాస్త్రి ఉద్దేశం దేవుడి గురించి చెప్పడం కాదు. 'దేముడు గోవులకు కొమ్ములిచ్చేడు..అట్లాగే కవులకు కలాలిచ్చేడు.. ' ఇలా సాగుతుంది ఆయన విశ్లేషణ. అధర్మాన్ని, అన్యాయాన్ని, చెడును ప్రజలు తుంచవలసి ఉన్నదని చెప్పడానికి అక్కడి నుంచి బయల్దేరుతారు. దీనికి ఎన్నో ఉదాహరణలు ఇవ్వవచ్చు.

“.. బొక్కసంలోని బంగారమంతా ఇచ్చేస్తేకాని వీల్లేదన్నాడా? రాముడవేవీ అడగనే లేదు. 'బాబోరే! నా పెళ్లాన్ని నాకిచ్చెయ్యరా బాబూ' అని అంత మాత్రమే అడిగేడాయన. అంతే అడిగేడు. అతను దేముడే. అతనడిగింది న్యాయమే. కానీ బ్రహ్మాండం బద్దలయ్యేటంత రామరావణ యుద్ధం జరిగితేగాని దేముడి భార్య దేముడికి దక్కింది కాదు.

అందుచేత-

విప్లవాలు యుద్ధాలు లేకుండా లోకంలో న్యాయం జరిగిపోతే, దేముడికిగాని, మనకిగాని అంతకంటే కావలసిందేముంది? దేశంలోని రావణబ్రహ్మలంతా పేద సీతల్ని పేదలకు అప్పజెప్పేస్తే అంతా బాగానే ఉంటుంది. నా గుండెల మీద కూచున్న పెద్ద పులి మనసు మార్చుకొని సన్యాసం పుచ్చుకొని, కమండలం పట్టుకొని, తావళం తిప్పుకొని వాయు భక్షణ చేసుకుంటూ హరినామ కీర్తనలో కాలం గడుపుకుంటే దానికీ నాకూ పేచీనే లేదు. దిక్కుపోతేనే పేచీ”

ఇది ఆయన సామాజిక కథన విమర్శ పద్ధతి. ఈ క్రమంలో సాహిత్య ఉత్పత్తి, సాహిత్య స్వభావం, సమాజ సాహిత్యాల్లో ఆధునికత, హేతుదృష్టి, వర్గ పక్షపాతం, వర్గపోరాట సాధనంగా సాహిత్యం.. మొదలైనవి ఉండే మార్క్సిస్టు విమర్శకు రావిశాస్త్రి చేసిన దోహదం చాలా విలువైనది. ఆయన కాల్పనిక సాహిత్యానికి ఎన్నో విలువైన కానుకలు అందించినట్లే సాహిత్య విమర్శకు కూడా అందించారు. దీన్ని గుర్తించడం వల్ల ఇప్పుడు కొత్తగా రావిశాస్త్రి సాహిత్య వ్యక్తిత్వానికి అదనంగా చేరేది ఏమీ ఉండకపోవచ్చు. తెలుగు మార్క్సిస్టు, విప్లవ సాహిత్య విమర్శకు మాత్రం తప్పక బలం చేకూరుతుంది.





# రావిశాస్త్రి 'ఇల్లు'

**రివేరా**

రాచకొండ విశ్వనాథశాస్త్రి (రావిశాస్త్రి) రచనల్లో 'ఇల్లు' చివరిది. తన జీవిత చరమాంకంగా ఆయన ఈ నవల రాశారు. విశాఖలో అప్పుడప్పుడే పుంజుకొంటున్న అపార్టుమెంట్ కల్చర్ ఇల్లు నవలకు ఇతివృత్తం. ఈ నవలకు, మిగతా ఆయన రచనలకు మధ్య సామాన్య పోలికలతో పాటు, కొట్టొచ్చినట్టు కనిపించే కొన్ని ప్రత్యేకతలు కూడా ఉన్నాయి. రావిశాస్త్రి మాటల్లోనే చెప్పాలంటే 'ఒళ్లు దగ్గరపెట్టుకుని' చేసిన రచన 'ఇల్లు'. సిమిలీలు లేకుండా రావిశాస్త్రి రాయరని పేరు. ఈ నవలలో బొత్తిగా ఉపమాలంకాలు లేవు అనలేం. కానీ, సీరియస్ ఇతివృత్తం కావడంతో వాటన్నింటినీ అధిగమించి వాస్తవికతే సిసలైన శిల్పంగా నవలా నిర్మాణంలో ఇమిడిపోయినట్టు కనిపిస్తుంది. నిజానికి, దోపిడీ విశ్వరూపాన్ని ఆయన దర్శించి, తన పాఠకులకు ఆ గుట్టుమట్లు అప్పటికే తన కథలు, నవలలు, నాటకాల్లో విప్పి చెప్పారు. అయితే, ఈ దోపిడీ చలనం 1990ల నాటికి భారతదేశంలో గుణాత్మక దశకు చేరుకుంది. ఈ నవల రాసిన 1993 నాటికి మనదేశంలో ఆర్థిక సంస్కరణల దశ మొదలై, ప్రతిదీ సరుకు అయ్యే క్రమం వేగం అందుకుంది. ఈ పరిణామం 10 ఏళ్ల ముందే మొదలయినా కేంద్రంలో పీవీ నరసింహారావు, ఆంధ్రప్రదేశ్‌లో నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి హయాంలో స్పష్టమైన పాలనావిధానంగా మారింది. భూమి కూడా..అమ్మగల కొనగల సరుకు కావడం ఈ మొత్తం పరిణామంలో కీలకమైన అంశం. ముఖ్యంగా, అనుత్పాదక అవసరాల కోసం భూములను పెద్దఎత్తున వెనుకేసుకోవడం అప్పటికి కొత్తే. అమ్మడాలు, కొనడాలే సమాజ ప్రధాన ఆర్థిక లావాదేవీగా మారిపోవడం ఇటు రియల్ ఎస్టేట్‌ను, అటు స్టాక్ మార్కెట్‌ను పెంచేసింది. మధ్యతరగతిలో తొలిసారి సొంతింటి కలలను తట్టిలేపింది. ఈనేపథ్యంలో విశాఖలో మొదలైన భూములవేటను వస్తువుగా తీసుకుని రావిశాస్త్రి నవల ఇల్లు మొదలవుతుంది. ఆయన ఇంతవరకే చిత్రీకరించి ఊరుకోవచ్చు. కానీ, ఆయన అక్కడే ఆగిపోలేదు. ఏ పరిణామమూ ఏకపక్షంగా ఉండదనీ, దోపిడీ, అణచివేతలను ఏ క్రమం తీవ్రతరం చేస్తుందో, వాటిని ప్రతిఘటించే శక్తులను రంగంపైకి తెచ్చే భూమికను అదే క్రమం ఏర్పాటుచేస్తుంది. ఈ గతితార్కిక ఎరుకతో కొన్నిపాత్రలను రావిశాస్త్రి ప్రవేశపెట్టారు. ఈ నవలను ప్రత్యేకంగా నిలబెట్టే అంశాల్లో ఇదీ ఒకటి.

ఇల్లు కొందరికి గూడు...కొందరికి సంపాదించాల్సిన ఆస్తి అనే మాటలు చదివినప్పుడు, చార్లెస్ డికెన్స్ 'టేల్ ఆఫ్ టు సిటీస్' నవల ప్రారంభంలోని శక్తిమంతమైన వాక్యాలు గుర్తుకువస్తాయి. అలాగే...వర్గ వ్యవస్థలో సంపాదించుకున్న ఆస్తులను సామాన్యులు నిలుపుకోలేరనే కమ్యూనిస్టు మ్యానిఫెస్టో హెచ్చరికను కూడా ఈ మాటలు స్ఫురణకు తెస్తాయి. రమారమీ 180 సంవత్సరాల క్రితం చేసిన ఆ హెచ్చరిక ఇంటి విషయంలో ఒక దృగంశంగా మారడం ఇల్లు నవల పట్టి ఇస్తుంది. ఇంటిని, ఊళ్లో కొంత పొలాన్ని చిట్టెమ్మకు వదిలి ఆమె 20వ యేట భర్త చనిపోయాడు. ఇంట్లో ఒక వాటా

అద్దెకు ఇచ్చి.. మరో వాటాలో తన మరదలు ('భర్త చెల్లెలు), మేనల్లుడు అరుణ ప్రకాశంతో కలిసి ఉంటుంది. మరో మేనల్లుడు ఉదయభాస్కరం నక్సలైట్ ఉద్యమంలో కలిసిపోయాడు. పక్కావాటాలో ఉండే జ్యోష్ణతో అరుణప్రకాశం ప్రేమతో పడతాడు.

పిల్లలు లేని చిట్టెమ్మకు మేనల్లుడే సర్వస్వం. చిట్టెమ్మ ఇంటిపై సోమయాజులు అనే స్థానిక నాయకుడు కన్నేసి తన పథకాలు అమలుచేయడం మొదలుపెడతాడు. కొంత పొలం గ్రామంలో ఉన్నా ఇంటి అద్దే చిట్టెమ్మ జీవనానికి ప్రధానం. ఆమె బలహీనత గ్రహించి సరిగ్గా అక్కడినుంచే దాడి మొదలుపెడతాడు. పక్కవాటాకు అద్దె పెంచాలంటూ ఆమె చెవిదగ్గర ఇల్లు కట్టుకుని పోరుతుంటాడు. 'వాడు లుచ్చా' అని మేనల్లుడు ఎంత హెచ్చరించినా సోమయాజులు ప్రేరేపించిన ధనాశకు చిట్టెమ్మ లొంగిపోతుంది. రూ.70 ఉన్న అద్దెను రూ. 150 చేస్తుంది. అద్దె పెంపు వ్యవహారం ఘర్షణలకు దారితీసి రెండు పార్టీలూ కోర్టుకు వెళతాయి. కోర్టు ఖర్చులకోసం చిట్టెమ్మకు రూ.2000 ఇచ్చిన సోమయాజులు, దానికి మరో సున్నా కలిపేసి రూ. 20,000 ఇచ్చినట్టు ప్రామిసరీ. నోట్లపై సంతకాలు చేయించుకున్నాడు. ఇక చివరి దెబ్బ కొట్టే సమయం కోసం వేచి ఉంటాడు. ఇంతలో.. వేరే ఆసామి చిట్టెమ్మ ఇంటిని రూ. లక్షకు కొనడానికి ముందుకొచ్చినట్టు సోమయాజులుకు తెలుస్తుంది.

ఆ ఆసామి పేరు సౌందరిగారు. ఆయన కొడుకు అమెరికాలో వ్యాపార విద్యలు నేర్చి, విశాఖలో పరిశ్రమ పెట్టడానికి వస్తున్నాడు. దానికోసం సౌందరిగారు భూములను పెద్దఎత్తున సేకరిస్తున్నారు. ఈ క్రమంలో చిట్టెమ్మ ఇంటిని కొనడానికి ముందుకొచ్చారు. ఈ విషయం తెలుసుకుని సోమయాజులు కోర్టు ద్వారా చిట్టెమ్మకు నోటీసులు పంపించాడు. ఇంటిని చిట్టెమ్మ తనకు లక్ష రూపాయలకు అమ్మి...రూ.20 వేలు ముందే తీసుకున్నదని, మిగతా సొమ్ము పుచ్చుకొని ఆ ఇంటిని స్వాధీనం చేయాలని ఆ నోటీసు పంపించాడు. అక్కడితో ఆగకుండా... డీఎస్పీ చిట్టిబాబును కలిసి చిట్టెమ్మ మేనల్లుళ్లలో ఒకరు నక్సలైట్లలో కలిసినట్టు సమాచారం అందిస్తాడు. చిట్టెమ్మ ఇంటి అడ్రస్‌కు అరుణ ప్రకాశాన్ని ఉద్దేశించి ఉదయభాస్కర్ ఉత్తరాలు రాస్తున్నట్టు కూడా ఉప్పందిస్తాడు. పోస్టుమ్యాన్‌ను పట్టుకుని ఇటీవల సంపాదించిన అలాంటి ఒక ఉత్తరం కూడా డీఎస్పీకి అందిస్తాడు. దీనికి బదులుగా చిట్టెమ్మ ఇల్లును ఫోర్స్‌ను ప్రయోగించి తనకు స్వాధీనం చేయాలని కోరతాడు.

ప్రమోషన్‌పై కన్నేసిన డీఎస్పీ చిట్టిబాబును...సోమయాజులు తీసుకొచ్చిన సమాచారం ఉత్సాహపరిచింది. అప్పట్లో నేదురుమల్లి ప్రభుత్వం రాష్ట్రంలో అధికారంలో ఉండటం ఆయనలో మరింత జోష్‌ను పెంచింది. శ్రీకాకుళం ఉద్యమాన్ని అణచివేసిన పోలీసుమంత్రి జలగం వెంగళరావు మొక్కట్లు నేదురుమల్లి జనార్దన్‌రెడ్డికి ఉన్నట్టు అనుమానం. సమాజ ఆర్థిక జీవనంలో నేడు కనిపిస్తున్న సకల అరిష్టాలకూ నేదురుమల్లి పాలనే ఆది. రియల్ ఎస్టేట్, ఐటీ వంటి అనుత్పాదక రంగాలకు ప్రభుత్వ ప్రోత్సాహకాలు, ప్రైవేటురంగంలో మెడికల్ కాలేజీలు మొదలు నక్సలైట్లపై నిషేధం, విప్లవోద్యమంలోకి కోవర్టులను చొప్పించడం వరకు.. ప్రతిదీ ఆయన ఆరంభిస్తే, అనంతరకాలంలో చంద్రబాబు దూకుడుగా ముందుకు తీసుకెళ్లారు. భూములను పెద్దఎత్తున సేకరించడం, పెట్టుబడిదారుల అవసరాలకు వాటిని అందించడం 1990ల నాటి బలమైన ఉద్యమ, సెంటిమెంట్ వాతావరణంలో సాధ్యమయ్యే విషయం కాదు. దీనికోసం పోలీసు ఫోర్సును విపరీతంగా పెంచేశారు. కోర్టులు, జైళ్లు, చట్టసభలు, బ్యూరోక్రసీ తదితర అణచివేత అంగాలతో పోల్చితే పోలీసుల పలుకుబడి బాగా పెరిగింది. మాజీ ప్రధాని రాజీవ్‌గాంధీ హత్యను సాకుగా చూపించి.. ఆయన మొదటి వర్ధంతినాడు ఆంధ్రప్రదేశ్‌లో పీపుల్స్‌వార్, కొన్ని ప్రజాసంఘాలపై నేదురుమల్లి నిషేధం విధించాడు. నక్సలైట్‌ను చంపితే ప్రమోషన్లు, ఆర్థిక ప్రోత్సాహకాలు అందించడం అప్పటికే ఉన్నా, ఈ నవలారచనా కాలానికి అదొక అధికారిక విధానంగా మారింది. నేరుగా పోలీసు రాజ్యమే నడిచిన కాలమది.

ఇలాంటి ఉత్సాహకరమైన, తనవంటి పోలీసులకు స్వర్గతుల్యమైన వాతావరణంలో చిట్టిబాబు వెంటనే రంగంలోకి దిగాడు. సోమయాజులు ఇచ్చిన ఉత్తరంలో సమాచారాన్ని బట్టి...విశాఖలో ముఖ్యమంత్రి హత్యకు నక్సలైట్లు పథకం రచిస్తున్నట్టు, అందుకు అరుణ ప్రకాశం సాయం ఉదయ భాస్కరం తీసుకుంటున్నట్టు తెలుసుకుంటాడు. ఆ సమాచారం డిపార్టుమెంటులో లీక్ కాకుండా జాగ్రత్తపడి....సభలో సీఎంపై దాడికోసం వచ్చిన ఇద్దరు నక్సలైట్లను స్పాట్‌లోనే కాల్చేస్తాడు. నక్సలైట్ల కుట్రను భగ్నంచేసినట్టు డిపార్టుమెంటులో పేరు కొట్టేసి, ఆపై ప్రమోషన్ పట్టేస్తాడు. చివరకు చిట్టెమ్మ ఇంటిని కూడా లాగేసుకుంటాడు. ఈ వ్యవహారాలతో చిట్టెమ్మను వైరాగ్యం ఆవరించింది. డీఎస్పీకి ఇల్లు అమ్మగా వచ్చిన రూ.లక్ష అరుణప్రకాశానికి చెందేలా చేసి..గ్రామంలోని పొలాలను కౌలుదారులకు తక్కువరేటుకే అమ్మేసి తన మరదలుతో కలిసి కాశీయాత్రకు సిద్ధమవడంతో నవల ముగుస్తుంది.

పెరిగిన రియల్ ఎస్టేట్ వ్యాపారాలు అపార్టుమెంటు సంస్కృతిని పెంచడాన్ని నగరీకరణలో జరిగే సహజ పరిణామంగా చూడాలనే వాదన ఉంది. గ్రామాల నుంచి పట్టణాలకు సామాజిక చలనం పెరగడం నాగరిక సమాజ అభివృద్ధికి ముఖ్యమైన ప్రమాణమని చర్చిస్తుంటారు. అయితే, వీరు చెప్పే అభివృద్ధి క్రమాలు చిట్టెమ్మలను మోసాలనుంచి, దోపిడీల నుంచి కాపాడగలుగుతున్నాయా? చిట్టెమ్మల చైతన్యాన్ని, లోకరీతులపై వారి అవగాహనను ఒక మెట్టు పైకి తీసుకెళ్లేవిధంగా ఈ సామాజిక చలనాలు ఉంటున్నాయా? పట్టణాలకు చేరుకుంటే అక్కడ ఉండటానికి, పని చేసుకోవడానికి, తల దాచుకోవడానికి ఏదైనా భరోసా కల్పించే ఏర్పాటు ఉందా? గత ముప్ఫై ఏళ్లుగా రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక క్షేత్రాల్లో కొనసాగుతున్న పరిణామాల నుంచి గరిష్ఠ ప్రయోజనం సమాజం పొందేందుకు ప్రభుత్వాలు ఏమి చేస్తున్నాయి? ప్రభుత్వాల ప్రత్యక్ష ప్రమేయం, జోక్యాన్ని డిమాండ్ చేయకుండా, వట్టినే దీన్ని సహజ పరిణామంగా చెప్పి ఊరుకుంటే సరిపోతుందా? ఇన్ని కోణాల్లో ప్రశ్నలను రావిశాస్త్రి 'ఇల్లు' నవల రాజేస్తుంది. దోపిడీ, దౌర్జన్యాలు, మోసాలు నిండిన సమాజంలో చిట్టెమ్మల వైపే మేధావులు నిలబడాలని చెప్పి... ఆచరించి... అదే రాసిన రావిశాస్త్రి ఆదర్శం నేటి అవసరం!

"డబ్బు ఇచ్చి నన్ను ప్లీడర్‌గా పెట్టుకునే నా పేద క్లయింట్ కంటే నేనేం అధికుడ్ని?"

**- రావిశాస్త్రి**



# రావిశాస్త్రి రచనల్లో రాజకీయార్థిక దృక్పథం

ఎన్ వేణుగోపాల్

రాజకీయార్థిక అంశాలు అంటే ఆర్థిక అంశాలు, గణాంకాలు, లేదా రాజకీయాలు కలిపిన ఆర్థికాంశాలు మాత్రమే అనే సాధారణ అవగాహనతో, సువిశాలమైన సాహిత్య జీవితంలో రావిశాస్త్రి ప్రత్యేకంగా రాజకీయార్థిక అంశాల మీద ఏమైనా రాశారా అని వెతికితే పెద్దగా ఏమీ దొరకక పోవచ్చు. కాని రావిశాస్త్రి రచనలన్నిటిలో, కనీసం 1953 'అల్పజీవి' నుంచి, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే 1961లో రాసిన 'ఆరు సారా కథలు' నుంచి 1992లో రాసిన చివరి రచన 'ఇల్లు' దాకా ఆయన ప్రధాన రచనలన్నిటిలోనూ పూసల మధ్య దారంలా కనబడుతూ ఉండేది రాజకీయార్థిక దృక్పథమే.

విద్యార్థిగా, విద్యలో భాగంగా ఆయన రాజకీయార్థ శాస్త్రం చదువుకోలేదు. ఇంటర్మీడియట్‌లో చరిత్ర, బిఎ ఆనర్స్‌లో తత్వశాస్త్రం ఆయన ప్రధానాంశాలు. ఆ క్రమంలోనే తర్కశాస్త్రం, ఇంగ్లిష్ సాహిత్యం కూడ చదువుకున్నారు. కాని ఆయన జీవితమే ఆయనకు రాజకీయార్థిక శాస్త్ర పరిచయాన్నీ, దృక్పథాన్నీ ఇచ్చిందనాలి. రెండు యుద్ధాల మధ్య కాలపు ప్రపంచంలో, ముఖ్యంగా 1930ల ఆకటి దశాబ్దంలో యవ్వనంలో ప్రవేశించిన వ్యక్తిగా ఆయన ప్రపంచ రాజకీయార్థిక సంచలనాలను అనుభవించారు. అమెరికాలో మొదలై ప్రపంచాన్ని చుట్టుముట్టిన ఆర్థిక సంక్షోభం భారత ఆర్థిక వ్యవస్థనూ, భారత జనజీవనాన్నీ తాకినప్పుడు అది రావిశాస్త్రి కుటుంబాన్ని కూడ స్పృశించింది. అదే సమయంలో అంతటి భారీ సంక్షోభపు ప్రకంపనాల తాకిడి కూడ లేకుండా సోవియట్ యూనియన్ ఉజ్వలంగా ముందుకు సాగిపోతున్నదనేదీ అధ్యయనం ద్వారా ఆయన అనుభవంలోకి వచ్చింది. ఆ దశాబ్దం సరిగ్గా రావిశాస్త్రి కౌమార, తొలి యవ్వనాల కాలం. ఆ దశాబ్దపు చివరి సంవత్సరాల్లో ఆయనకు ఎం ఎన్ రాయ్ పరిచయం అయింది. విస్తారమైన అధ్యయనంతో, అనుభవాలతో ఆయన మార్క్సిస్టుగా మారడం మొదలైనదీ అప్పుడే. ఆ తర్వాతి దశాబ్దంలో ఒకవైపు రెండో ప్రపంచ యుద్ధమూ, ఆయన డిగ్రీ పూర్తి చేసి మిలిటరీ అకౌంట్స్ శాఖలో ఉద్యోగంలో చేరడమూ, అది వదిలేసి న్యాయశాస్త్రం చదివి, విశాఖపట్నంలో న్యాయవాదిగా స్థిరపడడమూ ఆయన ఆలోచనల వికాసంలో అంతర్లీనంగా రాజకీయార్థిక దృక్పథం ప్రవేశించడానికీ, బలపడడానికీ అవకాశం ఇచ్చాయి. అంటే ఒకరకంగా ఆయన చదువు ద్వారా కాక జీవితానుభవం ద్వారానే రాజకీయార్థిక దృక్పథంలోకి ప్రవేశించారు. రాజకీయార్థిక దృక్పథాన్ని జీవించడం ప్రారంభించారు. సరిగ్గా అప్పుడే రచనలోకీ ప్రవేశించారు.

రాజకీయార్థిక దృక్పథమంటే భౌతిక జీవన పరిస్థితులే భావనా ప్రపంచంలో ప్రతిఫలిస్తాయనే స్పృహ ఉండడం. మనుషుల ప్రవర్తనకూ, మనుషుల మధ్య సంబంధాలకూ ఉత్పత్తితో, ఉత్పత్తి సంబంధాలలో పునాది ఉంటుందనీ, అంటే ఉత్పత్తి సంబంధాల మౌలికత మీదనే సమాజం నిర్మాణమవుతున్నదనీ గుర్తించడమే రాజకీయార్థిక దృక్పథం. ప్రతిదీ మారుతుందని, మార్పు సహజమనీ గుర్తించడం, ఆ మార్పులను విడివిడిగా కాక సమగ్రంగా, భిన్న సందర్భాల మధ్య సమన్వయంలో గుర్తించడం రాజకీయార్థిక దృక్పథం. మనిషి భౌతిక జీవనం, అంటే మనుగడ, ఉత్పత్తి మీద, పునరుత్పత్తి మీద ఆధారపడి ఉంటాయని కొత్తగా చెప్పనక్కరలేదు. కాని ఉత్పత్తిలో ఉన్న మనుషుల చైతన్యాలలో కూడ తేడాలు ఎందుకు ఉంటాయి, ఉత్పత్తిలో ఉన్న మనుషుల చైతన్యానికీ, ఉత్పత్తిలో లేని మనుషుల చైతన్యానికీ మధ్య తేడా ఎందుకు

వస్తుంది, తీవ్రమైన అంతరాలు ఉన్న సమాజంలో మొత్తంగా ఆ చైతన్యపు హెచ్చు తగ్గులకు కారణాలు ఏమిటి, పురోగామి చైతన్యానికీ, అపచైతన్యానికీ మధ్య సంబంధం ఎటువంటిది, ఉత్పత్తి, పునరుత్పత్తి మీద ఆధారపడిన సామాజిక సంబంధాల చలనం ఎలా సాగుతుంది వంటి విషయాలన్నీ కూడా రాజకీయార్థిక దృక్పథంలో భాగమే.

నిజానికి ఈ దృక్పథం సాహిత్య సృజనకు అత్యవసరమైనదీ, వ్యక్తీకరణలో కీలకమైనదీ. సాహిత్యంలో, ముఖ్యంగా కాల్పనిక సాహిత్యంలో తప్పనిసరిగా మనుషులు, వారిమధ్య సంబంధాలు ఉంటాయి గనుక, ఆ మనుషులనూ, వారి మధ్య సంబంధాలనూ శాసించే అంతర్గత చలన సూత్రాలేవో తెలుసుకుని ఉండడం రచయితలకు అవసరం. అవి తెలియకుండా కేవలం జీవిత పరిశీలన ద్వారా, జీవితానుభవం ద్వారా కూడ మానవ సంబంధాల సంక్లిష్టతను గుర్తించి, అర్థం చేసుకుని, చిత్రించవచ్చు గాని, ఆ సంక్లిష్ట మూలాలను, చలన సూత్రాలను అర్థం చేసుకోవడం ఆ సాహిత్యానికి వైశాల్యాన్నీ లోతునూ ఇస్తుంది. మానవ స్వభావాల, ప్రవర్తనల, సంబంధాల మూలాలను, వాటి చలన సూత్రాలను అర్థం చేసుకుని, చిత్రించడానికి ప్రయత్నించారు గనుకనే, అంటే రాజకీయార్థిక దృక్పథాన్ని తన పరిశీలనకూ వ్యక్తీకరణకూ పునాది చేసుకున్నారు గనుకనే రావిశాస్త్రి సాహిత్యానికి అంత వైశాల్యమూ లోతూ వచ్చాయి.

రావిశాస్త్రి రాజకీయార్థిక దృక్పథాన్ని ఆయన సాహిత్యమంతటి నుంచీ విశ్లేషించే అవకాశం ఉంది గాని ప్రధానంగా 'ఆరు సారా కథలు' (1961), 'బల్లచెక్క' (1964), 'ది స్మోకింగ్ టైగర్' (1965), 'వేతనశర్మ కథ' (1971) కథల నుంచీ, 'ఇల్లు' (1992) నవల నుంచీ, 'అయితే ఎవరిదీ ప్రభుత్వం?' (1974), 'కమిషన్ అనగా లంచం' (1974) అనే వ్యాసాల నుంచీ వివరించడానికి ప్రయత్నిస్తాను. ఉదాహరణకు చూపుతున్న ఈ ఏడు రచనల్లోనూ అప్పటికప్పుడు తీసుకున్న ఇతివృత్తం ఒకటి ప్రత్యేకంగా, నిర్దిష్టంగా ఉండవచ్చు గాని, ఆయన అనుసరించిన రాజకీయార్థిక దృక్పథం వల్ల ఆ ఇతివృత్తం సాధారణీకరణకు, అమూర్తతకు, సమగ్రతకు చేరింది.

'బల్లచెక్క' కథలో అదనపు విలువ సూత్రాన్ని సులభంగా చెప్పారని గతంలో కొందరు విమర్శకులు గుర్తించి ఉన్నారు. కాని ముందు ప్రస్తావించినట్టుగా గణాంకాలు, లెక్కలు, అర్థికాంశాలు ఉండడం వల్ల మాత్రమే ఆ కథ ఆ గుర్తింపు పొందింది. అంతకన్న లోతుగా ఆ కథలో సమగ్ర మానవ సంబంధాల అధ్యయనం, మానవ సంబంధాల వెనుక ఉన్న ఉత్పత్తి సంబంధాలు, అంటే ఆర్థిక సంబంధాల చిత్రణ, రాజకీయార్థిక దృక్పథం ఉన్నాయనే విశ్లేషణ పెద్దగా జరిగినట్టులేదు.

అయితే 'బల్లచెక్క' కన్న మూడు సంవత్సరాల ముందే రావిశాస్త్రి గారి రాజకీయార్థిక దృక్పథపు కథలు వికసించడం ప్రారంభమయింది. అప్పటికి కనీసం ఒక దశాబ్దంగా కథా రచనలోనూ, మార్క్సిస్టు దృక్పథం ఆధారంగా సమాజాన్ని పరిశీలించి, ఆ పరిశీలనను చిత్రించడంలోనూ ప్రయోగాలు చేస్తున్న రావిశాస్త్రి 1961 ఏప్రిల్, మేలలో రాసిన (ప్రచురించిన) 'ఆరు సారా కథల'లో రాజకీయ దృక్పథం స్పష్టంగా, నిశితంగా కనిపిస్తుంది.

ఇవి చూడడానికి సారా కథలు, మద్య నిషేధ సమయంలో సారా వ్యాపారం వల్ల పుట్టుకొచ్చే నేర వ్యవస్థ గురించి, వాటికి సహకరించే వ్యవస్థాగత యంత్రాంగాల గురించి రాసిన కథలు. కాని ఆ కథలు చెప్పే క్రమంలో ఆయన రాజ్యం గురించీ, న్యాయవ్యవస్థ గురించీ, రాజ్యంలోని విభిన్న అంగాలు ఒక వర్గానికి ఎలా సేవ చేస్తాయనే దాని గురించీ రాశారు. రాజ్యాంగ యంత్రపు అంగాలు సొంత ఆస్తిని, యథాతథ స్థితిని కాపాడడానికి ఎలా ప్రయత్నిస్తాయో, ఆ క్రమంలో అవినీతికీ, అక్రమానికీ, దౌర్జన్యానికీ ఎట్లా సహకరిస్తాయో సమగ్ర చిత్రణ చేశారు. భారత రాజ్య స్వభావం గురించీ, పని తీరు గురించీ రాజకీయార్థశాస్త్ర పాఠ్యపుస్తకాలు చెప్పగలిగినదానికన్న ఎక్కువ పరిజ్ఞానాన్ని ఇవ్వగలిగినవి ఆ ఆరు కథలు. భారత రాజ్యం గురించి స్వయంగా కమ్యూనిస్టు పార్టీయే భ్రమలు పెంచుకుంటున్న, తన శ్రేణులను నిష్క్రియలోకి నెడుతున్న కాలంలో ఈ కథలు వెలువడ్డాయంటే, రావిశాస్త్రి దృక్పథపు నైశిత్యం స్పష్టమవుతుంది.

ఈ కథల్లో రావిశాస్త్రి అనుసరించిన దృక్పథాన్ని విశ్లేషించడానికి మరొక కోణం కూడ ఉంది. మామూలుగా ఎప్పుడైనా ఒక చట్టాన్ని ప్రవేశపెట్టినప్పుడు, అది నేరాలను విచారిస్తుందనీ, శిక్ష వేస్తుందనీ, తద్వారా అరికడుతుందనీ పాలకవర్గాలు సమర్థనలు చెపుతాయి. సాధారణ సమాజమంతా ఆ సమర్థనను నమ్ముతుంది. రాజకీయార్థశాస్త్ర దృక్పథం మాత్రమే ఆ సమర్థనల పొరలు వలిచి, ఆ చట్టం రావడానికి అసలు కారణాలనూ, ఆ చట్టం పర్యవసానాలనూ చెప్పగలుగుతుంది. 'ఆరు సారా కథలు' ఆ పని చేశాయి.

మద్యపానాన్ని నిషేధించడానికీ, మద్యం ఉత్పత్తి, అమ్మకాలలో ప్రభుత్వ గుత్తాధిపత్యం, నియంత్రణ స్థాపించి, దొంగసారా తయారుచేసే, అమ్మే నేరాల్ని అరికట్టడానికీ, నేరస్తులను శిక్షించడానికీ 1952లో మద్రాసు రాష్ట్రంలో వచ్చిన ది మద్రాస్ ప్రొహిబిషన్ ఆక్ట్ అంతిమంగా ఎలా పరిణమించింది? నేరాలను అరికట్టడానికీ, నేరస్తులను శిక్షించడానికీ వచ్చిన చట్టం దానికదే కొత్త నేరాలను ఉత్పత్తి చేసింది, కొత్త నేరస్తులను సృష్టించింది. ఈ వినూత్న పరిణామాల కోణాన్ని 'ఆరు సారా కథలు' అద్భుతంగా వివరించాయి. ఈ కొత్త కోణం సహాయంతో అసలు సామాజిక సమస్య మీద మౌలికమైన కొత్తచూపు ప్రసరించడమే రావిశాస్త్రి రాజకీయార్థిక దృక్పథం. కొత్తగా ఏర్పడుతున్న, లేదా రూపు మార్చుకుంటున్న నేరప్రపంచం రాజ్యాంగ యంత్రం గురించి ఏమనుకుంటున్నది? ఆ నేర ప్రపంచానికీ రాజ్యాంగ-యంత్రానికీ ఎటువంటి సంబంధం ఏర్పడుతున్నది? పోలీసు శాఖ, న్యాయవ్యవస్థ, రాజకీయ, పాలనా యంత్రాంగాలు, చివరికి న్యాయవాద వృత్తి ఈ కొత్త వాతావరణంలో ఎట్లా మారుతున్నాయి? ఈ మార్పుల క్రమంలో అట్టడుగు శ్రామిక ప్రజానీకానికి, పొట్ట పోసుకోవడం కోసం నేరప్రపంచం చెప్పిన పనులు చేయడానికి సిద్ధపడిన మామూలు మనుషులకు, అందునా స్త్రీలకు ఏం జరుగుతున్నది? అరవై సంవత్సరాల కిందటి ఆ సమకాలీన పరిణామాలను వివరిస్తూ, ఇటువంటి కీలక ప్రశ్నలవైపు పాఠకుల దృష్టిని మళ్లించడంలో రావిశాస్త్రి రాజకీయార్థిక దృక్పథం విజయం సాధించింది.

సామాజిక సంబంధాలలో అత్యంత మౌలికమైనది రాజ్యానికీ ప్రజలకూ మధ్య ఉండే ఘర్షణ సంబంధం. 'ఆరు సారా కథలు'లో దాన్ని చిత్రించిన తర్వాత మూడు సంవత్సరాలకు రాసిన 'బల్లచెక్క'లో సామాజిక సంబంధాలలో, ఉత్పత్తి సంబంధాలలో అతి సూక్ష్మ యూనిట్ అయిన కుటుంబంలో ఆ సామాజిక, ఉత్పత్తి సంబంధాలు ఎట్లా ప్రతిఫలిస్తాయో, ఏ ఘర్షణకు దారి తీస్తాయో చిత్రించడానికి పూనుకున్నారు రావిశాస్త్రి.

కథన శిల్పంలో భాగమైన కుటుంబ సంబంధాల చిత్రణ, పాత్రల నిర్మాణం, సన్నివేశాల కల్పన వంటి వాటిలో రావిశాస్త్రి అప్పటికే ప్రావీణ్యం సంపాదించారు. వాటికన్న మౌలికమైనదీ, వాటిని

మించిపోయినదీ ఈ కథా ఇతివృత్తం. అది శ్రమ విలువ సిద్ధాంతాన్ని చెపుతుంది. శ్రమజీవులకు శ్రమ ఫలితం దక్కని పరిస్థితులను చిత్రిస్తుంది. ఉత్పత్తి క్రమంలో ఎట్లా అదనపు విలువ పుట్టుకొస్తుందో వివరిస్తుంది. శ్రమ ఫలితం ఎట్లా దోపిడీ అవుతుందో చెపుతుంది. కథలో 'లాభం' అనే మాట చాలసార్లు వస్తుంది. అది వర్గ సమాజపు రాజకీయార్థ శాస్త్రంలో కీలకమైన మాట. ఆర్థిక, గణిత ప్రమేయంగా ఉండవలసిన ఆ మాట, మామూలు భాషలోకి కూడ చొరబడి, అతి మామూలు సందర్భాలలో కూడ వినియోగంలోకి వచ్చింది. (ఇంటరెస్ట్ – ఆసక్తి అనే మామూలు మాట వడ్డీ అనే అర్థంలోకి మారి, ఆధునిక సమాజంలో ఆసక్తి, వడ్డీ ఎట్లా పర్యాయపదాలుగా మారిపోయాయో మనకు తెలుసు.) ఆ లాభాకాంక్ష మనిషిని ఎట్లా మానవ సంబంధాల నుంచి దూరం చేస్తుందో చెప్పడం ఈ కథలో ఒక అంశమైతే, కథ చెప్పినవి అంతకన్న లోతైన అంశాలు. మామూలు ముడి సరుకుకు కూడ కాదు, చెడపట్టి చెడిపోయే దశలో ఉన్న వస్తువుకు మానవ శ్రమ ఎట్లా విలువ కల్పిస్తుందనేది (లేబర్ థియరీ ఆఫ్ వాల్యూ) ఈ కథ చెప్పిన ఒక అంశం. అది చూసి పిల్లలూ, మామూలు మనుషులూ ఎట్లా అచ్చెరువొందుతారో, లాభాకాంక్షాపరులు మాత్రం అందులో లాభాన్ని ఎట్లా చూస్తారో (పరాయీకరణ – ఎలియనేషన్) ఈ కథ చూపుతుంది. ఆ శ్రమకు కొన్ని కూలి డబ్బులో, లేదా అల్లుడనే ఆదరంతో మరిన్ని డబ్బులో ఇచ్చినప్పటికీ అసలు ఆ లాభం ఎట్లా తయారయిందనేది (సర్ ప్లస్ వాల్యూ) ఈ కథ చూపుతుంది.

"అవి చెడపట్టి చెడిపోయినా సరే కాని లాభానికి తప్ప అమ్మను" అనే మాట ఉపయోగ విలువ కన్న మారకపు విలువలకే ప్రాధాన్యత ఇచ్చే స్వభావానికి సూచన. "నా కష్టమే నీ లాభం కాదా" అన్న మాట శ్రామిక వర్గపు ప్రశ్న. "ఒహడు నష్టపోతేనే ఇంకొకడికి లాభం" అనే మాట దోపిడీదారుల సిద్ధాంతాన్నో, యథాతథవాదుల సమర్థననో వ్యక్తం చేస్తుంది. దానికి జవాబుగా "కష్టపడ్డవాడు నష్టపోతేనే మిగతా వాళ్లకి లాభాలు" అని సమాజం గురించి రాజకీయార్థిక విశ్లేషణను చెపుతుంది ఈ కథ.

అలాగే, 1965 లో రాసిన కథ 'ది స్మోకింగ్ టైగర్'. రెండు సిగరెట్ కంపెనీల మధ్య పోటీనీ, అందులో భాగమైన వ్యాపార ప్రకటనల పోటీనీ చిత్రిస్తూ పెట్టుబడిదారుల మధ్య ఘర్షణనూ, ఒకే వర్గంలోని వ్యక్తుల, సంస్థల మధ్య ఎంత భీకరమైన పోరాటం జరుగుతుందో చూపిన ఈ కథ, "తరతరాల నించి, యుగయుగాల నించి జరుగుతున్న అన్యాయం అది. 'ఈ అన్యాయం ఇంకెంత కాలం, ఇంకా ఎంత కాలం నిలబడుతుందో, ఎప్పుడు ఎవరొచ్చి ఈ అన్యాయం మానవుల మధ్య మరింక జరక్కుండా దాన్ని తుదముట్టిస్తారో కదా' అనిపిస్తూంటుంది నాకు. ఈ అన్యాయం ఎప్పుడో ఒకప్పుడు తప్పక అంతమవుతుందని నాకు ఒకసారి ఆశ కలుగుతుంది. అంతమవదేమోనని ఇంకొకసారి నిండా నిరాశ నిండుకుంటుంది" అని ఆ కథ ముగుస్తుంది.

రాజకీయార్థిక దృక్పథంలో సమాజ పరిణామం గురించిన అంచనా ఉంటుంది, సమాజ పురోగతి గురించిన ఆశావహధోరణుల సూచన ఉంటుంది. వర్తమానం విధించిన ప్రతికూలధోరణుల స్పృహ ఉంటుంది. ప్రత్యేకంగా ఈ కథ 1965లో రాసినదని గుర్తుంచుకుంటే, ఈ దేశంలో కమ్యూనిస్టు పార్టీగా పేరు పెట్టుకున్న పార్టీ వర్గ సామరస్య పార్టీగా మారిపోయిన తర్వాత, దాని నుంచి చీలి విప్లవకార పార్టీగా ఆవిర్భవిస్తుందనుకున్న పార్టీ కూడ ఆ మార్గమే పట్టిన తర్వాత కాలపు కథ ఇది. ప్రతీప ధోరణులదే పైచేయిగా కనబడుతున్న కాలపు కథ ఇది. నక్సల్బరీ ప్రజ్వలనకు ముందరి కథ ఇది. కాళీపట్నం రామారావు 'యజ్ఞం' కు సమకాలీన కథ ఇది.

అతి త్వరలోనే కాలం మారిపోయింది. నక్సల్బరీ శ్రీకాకుళాలు సమాజ రంగస్థలం మీదికి వర్గపోరాటాన్ని మున్నెన్నడూ లేని విధంగా తీసుకువచ్చాయి. ఇప్పుడిక రచయిత రాజకీయార్థిక దృక్పథం స్పష్టంగా ఆశావాహ ధోరణిని చిత్రించవలసిన పరిస్థితి ప్రారంభమయింది. రావిశాస్త్రి రచనల్లో ఆ మార్పుకు 1967 తర్వాతి రచనలన్నీ అద్దం పడతాయి. 1971లో రాసిన 'వేతనశర్మ కథ' మరొక సూచిక.

దోపిడీ వర్గం తన దోపిడీ కొనసాగడానికి మధ్యతరగతిని ఎట్లా సాధనంగా వాడుకుంటుందనేది సామాజిక, ఉత్పత్తి సంబంధాలలో ఒక ముఖ్యమైన కోణం. పాలక, పాలిత వర్గాల మధ్య నిరంతరం సాగే వర్గపోరాట చలనం రాజకీయార్థ శాస్త్ర వస్తువు. అంతిమ పరిశీలనలో ఈ వర్గ విభజన వాస్తవమే కాని, అనేక చారిత్రక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, ప్రాదేశిక కారణాల వల్ల ఈ వర్గ విభజన చాలసార్లు అస్పష్టంగా మారిపోతుంది. ఏ వర్గానికీ చెందనివారుగా తమను తాము గుర్తించుకునే వారు, ఒక వర్గ అస్తిత్వంలో ఉండి అన్యవర్గ భావజాలంలో ఉండేవారు, అస్పష్టతతో అటూ ఇటూ ఊగిసలాడేవారు ఉంటారు. వర్గపోరాటం, వర్గ విభజన తీవ్రతరం కాని సమయంలో మధ్యతరగతి స్థలం విశాలంగానే ఉంటుంది. పాలకవర్గాలు యథాస్థితిని కొనసాగించడానికి ఈ వర్గ గందరగోళాన్ని వాడుకుంటాయి. ప్రజల్లో అపచైతన్యాన్ని వ్యాపింపజేస్తాయి. ఊగిసలాడే మధ్యతరగతిలో గణనీయమైన భాగాన్ని తమ సమర్థకులుగా మార్చుకోవడానికి ప్రయత్నిస్తాయి.

ఈ స్థితిని రావిశాస్త్రి గొప్ప రాజకీయార్థిక దృక్పథ నైశిత్యంతో చిత్రించారు. మధ్యతరగతి పాలకవర్గం వైపు నిలబడడానికి దారితీసే కారణాలేమిటి, ఉత్పత్తి సంబంధాల ఘర్షణలో ఏ ప్రయోజనాల రాపిడిలో మధ్య తరగతి దోపిడీ వైపు వెళుతుంది అని చూపడానికే ఆయన 'వేతనశర్మ కథ' రాశారు. నిజానికి ఆయన రాసిన కాలానికి మధ్యతరగతి నక్సల్బరీ శ్రీకాకుళాల వైపే ఎక్కువగా నిలబడింది. కాని ఆయన రాజకీయార్థిక దృక్పథం గడిచిన దినాల్లో జరిగిన, రానున్న దినాల్లో జరిగే అవకాశం ఉన్న మధ్యతరగతి పరిణామాన్ని చిత్రించదలచింది.

ఈ కథలో రాచరికం నేపథ్యంలో మార్కండేయుడనే మహర్షి చెప్పిన బోధనల వల్ల తిరుగుబాటు జరిగి, అందులో "అందరితో పాటు, చిన్న జీతాల మీద బతకలేకపోతున్న కరణాలు కూడ" చేరుతారు. కాని రాజు మార్కండేయ మహర్షిని చంపేసి, విపరీతమైన హింసతో ఆ తిరుగుబాటును అణచివేస్తాడు. అప్పుడు కరణాలలోంచి వేతనశర్మ వచ్చి, "ఈ దోపిడీ అనేది ఉండడం వల్ల మనకి ఏం నష్టం ఉంది" అని ప్రశ్నించి, "సమాజం పూర్తిగా మారితేనే గాని జీవితాలు బాగుపడనివాళ్లు చాలామంది ఉన్నారు. వాళ్లు విప్లవాలు తెస్తారు. చావుకి తెగిస్తారు. మనం ఆ కోవకి చెందుతామా? చెందం! సమాజం ఇలానే ఉన్నప్పటికీ మనకి బాగుపడే అవకాశాలున్నాయి.... మనకి వేతనాలు పెరిగితే రాజులూ మారనవసరం లేదు, రాజ్యాంగమూ మారనవసరం లేదు... మాకు వేతనాలతోనే సంబంధం ఉంది, కాని విప్లవాలతో

**"తప్పులయితే అందరం చేస్తాం. త్యాగాలు కొందరే చేస్తారు." - రావిశాస్త్రి**

సంబంధం లేదు..." అని తన వర్గాన్ని రాజ సమర్థకులుగా మార్చేస్తాడు. "ప్రభుత్వోద్యోగులకు వేతనశర్మే మొట్టమొదటి పీఠాధిపతి. ఆ తరువాత వేతనశర్మలే కార్మిక నాయకులుగా కూడా రూపొందడంతో ప్రభువులంతా సకల ధన కనక వస్తు వాహనాలతో తులతూగుతూ ప్రశాంతంగా జీవించుకు వస్తున్నారు. ఎక్కువ జీతాల కోసం సమ్మెలే తప్ప, సమసమాజం కోసం విప్లవాలు వద్దంటారు ప్రభువులు. అవునంటారు ప్రభుత్వోద్యోగులు" అంటారు రావిశాస్త్రి. వర్గ సమాజ సంబంధాల సంక్లిష్టతను కళాత్మకంగా, విశ్వసనీయంగా, ఆకర్షణీయంగా చిత్రించిన ఈ కథ రావిశాస్త్రి రాజకీయార్థిక దృక్పథపు నైశిత్యానికి మరొక ప్రతీక.

అయితే ప్రజల తిరుగుబాట్లు ఇటువంటి వెన్నుపోట్లకు గురికావడం మాత్రమే చిత్రిస్తే ఈ కథ ఒక చరిత్ర వివరణగా మాత్రమే మిగిలిపోయేది., కాని రావిశాస్త్రి రాజకీయార్థిక దృక్పథంలో మరొక ప్రధానాంశం ఆశావహ దృష్టి. అందుకే, "మరైతే, మార్కండేయుడు లేవదీసిన విప్లవం ఏమయింది? అది రాజవర్గపు కత్తులకి ఎంత మటుకు ఎరయింది? వేతనశర్మలు పొడిచిన వెన్నుపోటుకి చాలా మట్టుకు గాయపడింది. మిగతాది అలసట తీర్చుకొని మర్నాడెప్పుడో చిచ్చుగా మారడానికి వీలుగా అడవుల్లో తలదాచుకుంది" అని తాను రాసిన 1971 వర్తమానాన్ని మాత్రమే కాదు, ఎల్లకాలపు వాస్తవాన్ని కూడ చిత్రించారు.

ఇక 'ఇల్లు' నవల మొత్తానికి మొత్తంగా ఒక కళారూపపు రాజకీయార్థిక దస్తావేజు. ఇల్లు, సొంత ఆస్తి అనే భౌతిక రూపం, దాని కోసం ఆకాంక్ష, దాని మీద మమకారం అనే భావజాల రూపం, ఆ భౌతిక, భావజాల రూపాలకు ఈ వ్యవస్థలో పెరుగుతున్న ప్రాధాన్యం, సొంత ఆస్తినీ, భావననూ పెంచి పోషించే, పరిరక్షించే న్యాయవ్యవస్థ, రాజ్యాంగ యంత్రపు అక్రమాలు, ఈ వ్యవస్థనే మార్చదలచిన వర్గపోరాటం వంటి అనేక రాజకీయార్థిక అంశాలు కుటుంబ సంబంధాల, మానవ సంబంధాల, స్త్రీపురుష అనురాగాల నేపథ్యంలో అద్భుతంగా చిత్రించిన నవల ఇల్లు.

ఇక, ఆయన కాల్పనికేతర రచనల్లో, వ్యాసాల్లో, ప్రకటనల్లో రాజకీయార్థిక దృక్పథపు ఛాయలు అనేక చోట్ల కనిపిస్తాయి. 1974లో రైల్వే సమ్మె సందర్భంగా రాసిన 'అయితే - ఎవరిదీ ప్రభుత్వం?' వ్యాసంలో రాజ్యాధికారం ఏ వర్గం చేతుల్లో ఉన్నదో, వారిని ఎట్లా తొలగించవలసి ఉన్నదో చాల స్పష్టంగా చెప్పారు. ప్రభుత్వం ఎవరిదో ఒక్కొక్కరినీ అడిగి జవాబు స్పష్టంగా తెలియనప్పుడు, ప్రభుత్వం ఎవరిదో అల్లూరి సీతారామ రాజును అడగమంటారు. ఆయన లేదుగదా అంటే, వెంపటాపు సత్యంను అడగమంటారు. ఆయన కూడ లేదు గదా అంటే, చారు మజుందార్ని అడగమంటారు. ఆయన కూడ లేదు గదా అంటే, "విడివిడి సమ్మెల్లో పడి పడి లేచినవారందర్నీ ఒక్కసారిగా లేచి ఉవ్వెత్తుగా లేచి పెనుప్రళయంగా ఓ సవాల్ సమ్మెకు పిలుపునిమ్మందాం! అప్పుడు ఎవడైతే వారి మీదకు కత్తెత్తుతాడో వాడిది మాత్రం ఈ ప్రభుత్వం అని మనకు తెలిసిపోతుంది" అని ఒక గహనమైన రాజకీయార్థిక విశ్లేషణను అతి సులభంగా చెప్పారు. అలాగే అప్పుడే రాసిన 'కమిషన్ అనగా లంచము' వ్యాసంలో ప్రభుత్వ రంగ ప్రయివేటీకరణ గురించి, భారత సమాజంలో ఆ తర్వాత ఇరవై సంవత్సరాలకు ముమ్మరంగా జరిగిన పరిణామం గురించి గొప్ప రాజకీయార్థిక దార్శనికతతో రాశారు.

సమాజాన్నీ, చరిత్రనూ రాజకీయార్థిక దృక్పథంతో నిశితంగా పరిశీలించి, సాహిత్య ప్రక్రియల్లో ఆసక్తిదాయకంగా చెప్పిన ప్రపంచస్థాయి ప్రజానుకూల రచయితల్లో రావిశాస్త్రి అగ్రభాగాన నిలుస్తారు.



(17వ పేజీ తరువాయి..)

పాటు టాల్స్టాయ్ ప్రభావం కూడా ఉంది. టాల్స్టాయ్ లాగే తన్నూ కూడా అపరిచయీకరణ (de familiarization) విధానాన్ని పలురకాలుగా వాడాడు. రోజూ చూసే పాత విషయాలనే కొత్త విషయాల్లా వింత విషయాల్లా ఏకరువు పెట్టే ఈ పద్ధతి మీద రావిశాస్త్రి అసాధారణ పట్టు కనబరిచాడు. 'రాజు- మహిషి' నవల నిండా ఇదే టెక్నిక్ చూస్తాం. ఒక ఉదాహరణ చూడండి:

"అన్నవరం దేవుడికి మందుల భీముడు జుట్టంతా ఇచ్చేసి, పచ్చగా గుండు చేయించుకోవడంతో అతను వింతగా - చంపిన మేకలన్నింటి కోసం చింతించి ప్రాయశ్చిత్తం కోసం గుండు చేయించుకున్న సింహమో, పులో మరేదో పెద్ద జంతువులాగా - అతను గమ్మత్తుగా కనిపించాడు"

ఇక్కడ గుండు జేయించుకుంటే మనిషి భిన్నంగా కనిపించడం మామూలు విషయం. ఆ మామూలు విషయాన్ని అసాధారణ విషయంగా ప్రవేశపెట్టడంలోనే అపరిచయీకరణ ఉంది. తద్వారా విషయాన్ని తాజాగా, ఇంద్రియాత్మకంగా, హాస్యంగా ప్రెజెంట్ చేయగలగడమే కాదు మందుల భీముడు పాత్ర స్వభావాన్ని కూడా తెలియజేస్తున్నాడు. కొన్నిసార్లు ఈ పద్ధతి వికటించి రచయిత ఉద్దేశించిన స్ఫూర్తికి ఎదురు తిరిగిన సందర్భాలు కూడా ఈయన రచనల్లో కనిపిస్తాయి.

'రాజు-మహిషి' లోనే ఒక పేద ఇంట్లో పేదవాడి మరణాన్ని, దాని తాలూకు దైన్యాన్నీ వర్ణించిన పద్ధతి చూడండి :

"కప్పు కుంగిపోయి ఇటికలు ఎక్కొచ్చిన కొంపొకటుంది. ఆ కొంపకి వీధివైపున అరుగొకటుంది. అది విరిగి ఉంది. ఆ విరిగిన అరుగు మీద ఓ చిరిగిన చాప మీద ఓ ముప్పయ్యేళ్ళ మనిషి పీనుగుంది. ఆ పీనుక్కి దవడలు ఎక్కొచ్చాయి. ఆ పీనుగ కళ్ళు విప్పుకు మరీ చచ్చాయి. ఆ పీనుగ తల మీద వెంట్రుకలు దానికంటే ముందే ఏనాడో చచ్చినట్టున్నాయి. నూరేళ్లు నిండిన మనిషిలా కాకుండా వెయ్యేళ్లు నిండిన పీనుగలా ఉందా పీనుగ. ఏనాడో ఏ యుగంలోనో ఏ ఏడారిలోనో ఎండి చచ్చి ఉండిపోయిన పీనుగలా అది చాలా వికృతంగా ఉంది. ఆ పీనుగ కాళ్ళ దగ్గర మరొకటి - ఆడ పీనుగ కూర్చొనుంది. ఆవిడ కంటికీ మంటికీ ఏక ధారగా ఏడుస్తుంది. ఆ ఏడ్చే ఆవిణ్ణి ఓ నీడ లాంటి ముసలావిడ ఓదార్చుతుంది. అరుగు పక్క మెట్టు మీద కూర్చుని ఓ పన్నెండేళ్ల ఆడపిల్ల వెక్కి వెక్కి ఏడుస్తుంది. ఎంతో అందంగా ఉన్నప్పటికీ ఆ పిల్ల చాలా నిర్భాగ్యంగా దెయ్యాలు పెంచే దేవుడు పిల్లలా, చాలా దీనంగా అసహయంగా కనిపిస్తోంది"

పై వర్ణన మరణం తాలూకు విషాదాన్ని ఆటంకపరిచినట్లుగానే కాదు నవ్వు తెప్పించేదిగానూ ఉంది. అనవసరమైన డీటెయిల్స్ వల్లా అసాధారణ పోలికల వల్లా బాధ బదులు మార్మికతను వడుకొల్పినట్లుంది. ఒకోసారి ఈయన వర్ణనలు స్త్రీలను కించపరిచేటట్లుగానూ ఉంటాయి.

ఇలా కొన్ని పరిమితులు ఉన్నప్పటికీ రావిశాస్త్రి అనగానే మనకు ఆయన రచనా శిల్పమే ప్రభావవంతంగా కనిపిస్తుంది. తన సీరియస్ సాహిత్యాన్ని ఉద్యమ శ్రేణులలోని పాఠక పరిధిని దాటించి ఉద్యమేతర శ్రేణులు కూడా చదివే స్థితిని కల్పించడంలో తన రచనా విధానమే ఎక్కువ పాత్ర నిర్వహించింది.



# రావిశాస్త్రి సాహిత్యంలో స్థానికత విశ్వజనీనత

అట్టాడ అప్పల్నాయుడు



ఒక ప్రాంతంలో అందుబాటులో వుండే వనరులు- నీర్లు, నేల, చెట్లు చేమా, జంతుజాలం, పశుసంపద వగయిరా వనరులు లభించే ప్రాంతంలో మానవసమూహాలు నివాసమేర్పరచుకోవడం జరిగిందనేది చరిత్ర పరిశోధకుల విశ్లేషణ. ఆ ప్రాంతంలో నివాసులైన మానవసమూహాల భాష, ఆచారవ్యవహారాలు, అలవాట్లు, జీవనవిధానాలు, వగయిరాల వ్యక్తీకరణే ఆ ప్రాంతసంస్కృతి. ప్రాంతీయతకూ, స్థానికతకూ తేడా వుంటుంది. వర్తమాన సామాజిక, రాజకీయార్థిక కోణంలో స్థానికత అంటే స్థానికవనరులపై స్థానికులకే అధికారం వుండాలనే భావం, విలువ! (ప్రపంచీకరణ పేరుతో విశ్వవ్యాప్త వనరుల్ని మార్కెట్ శక్తుల ఆధీనంలోకి తీసుకెళ్లే రాజకీయార్థిక విధానాలకు యీ స్థానికత భావన, యీ విలువ వర్తమాన ప్రత్యామ్నాయం).

అయితే యింతటి అర్థంలో రావిశాస్త్రి రచనల్లో స్థానికత వుంటుందా అంటే వుండదనే చెప్పొచ్చు. కానీ ఒక ప్రాంత ప్రజల భాష, సంస్కృతి, రాజకీయం, ఆర్థికం, అలవాట్లు ...అందునా వర్గసమాజంగా గుర్తించి ఆధిపత్యవర్గాన్నీ, పాలితవర్గాన్నీ నిర్దిష్టతలతో రూపుకట్టడం రావిశాస్త్రి రచనా విశిష్టత! అదే సమయంలో యెంతటి స్థానికత వుంటుందో కొన్ని రచనల్లో అంతటి విశ్వజనీనత వుంటుంది. బహుశా నిర్దిష్ట స్థానికతను విశ్వజనీనత చేయడంలో (పిపీలికం, వేతనశర్మ, సృష్టిలో వంటి కథల్లో కథ, కథాస్థలాలూ విశాఖ స్థానికతలో వుంటాయి గానీ కథాంశం విశ్వజనీనమయినది. ఏ దేశంలో శ్రమజీవులకయినా 'పిపీలికం' కథ తామెవరమో, యేమి చేయాలో యెరుకపరుస్తుంది. అలాగే 'వేతనశర్మ'లు యే దేశంలోనయినా ఏ వర్గానికి చెందుతారో యెరుకచేస్తుంది. 'సృష్టిలో' కథ ఒక తాత్త్వికతను ప్రపంచానికి అందిస్తుంది.) తెలుగురచయితల్లో రావిశాస్త్రిని మించినవారు లేరు.

కళింగాంధ్రకు ఆంగ్లేయులు యిచ్చిన వరమూ, శాపమూ...విశాఖపట్టణం అనేవారు ప్రముఖ విమర్శకులు సి.వి.సుబ్బారావు. ఆంగ్లేయులు తొలుత తాము కొనాల్సిన సరుకుల కోసం అప్పటి ఓడరేవుల్లో (మచిలీపట్నం, గోవా, సూరత్) దిగి, తర్వాత తాము అమ్మాల్సిన వస్తువులకోసం కొత్త ఓడరేవుల్ని నిర్మించేరు. అలా నిర్మించినదే విశాఖ ఓడరేవు. దాంతో అనేక గ్రామాలను గర్భంలో కలుపుకొని విశాఖ విస్తరించింది. నగరంగా మారింది.

అలాగే 1880లో విశాఖపట్నం బార్ అసోసియేషన్ యేర్పడింది. 1893లో మద్రాస్-వాల్తేర్ రైల్వేలైన్ 1910లో కలకత్తా వరకు పొడిగించారు. 1932లో వాల్తేర్-రాయపూర్ రైల్వేలైన్ యేర్పడింది. 1930 సెప్టెంబర్ 5న ఆంధ్ర విశ్వవిద్యాలయం యేర్పడింది. 1923లో జిల్లాకోర్టు భవనం నిర్మాణమైంది. అంతకుముందరే ఆశీలమెట్ట దగ్గర సెంట్రల్ జైలు నిర్మాణం జరిగింది. 1923లో కింగ్‌జార్జ్ ఆసుపత్రి నిర్మాణం. మెంటల్ హాస్పిటల్ భవనాలు కూడా యీ యేడాదే!

1939 డిసెంబర్‌లో నేవల్‌బేస్ యేర్పడగా తర్వాత అదే 1952లో హిందుస్తాన్ షిప్‌యార్డ్‌గా రూపుదిద్దుకుంది. సింధియా స్టీమ్ నేవిగేషన్ కంపెనీ పేరు మారి). దీనితో స్థానికులతోపాటు గుజరాత్, రాజస్తాన్, బెంగాల్ రాష్ట్రాలనుంచి వచ్చిన వారికి ఉద్యోగాలు దొరికేయి. 1942 ఏప్రిల్‌లో జపాన్ విమానాలు విశాఖపట్నం మీద బాంబుదాడి చేశాయి. 1944-45 నాటికి విశాఖజిల్లాలో అగ్రికల్చరల్, వీవర్స్ సొసైటీలు 155 దాకా యేర్పడ్డాయి. ఈ సమయంలోనే విశాఖ ఏరోడ్రోమ్ నిర్మాణం జరిగింది.

1948లో జమీందారీ రద్దు చట్టం వచ్చింది. దీంతో సంస్థానాధీశుల పాలనలోనున్న గ్రామాలు, పట్నాలు, పొలాలు, యితర భూములు విశాఖజిల్లాలో కలిసాయి. ఆ తర్వాత అధికార వికేంద్రీకరణలో భాగంగా 1950లో విశాఖ జిల్లాను విభజించి కొంతభాగంతో శ్రీకాకుళం జిల్లా యేర్పడింది.

ఈ చారిత్రక నేపథ్యంలో విశాఖనగరం అంచెలంచెలుగా విస్తరించింది. కొత్తకొత్త పరిశ్రమలు, వ్యాపారాలు, ఉపాధులు

వచ్చేయి. పాత గ్రామీణ వృత్తులూ, ఉపాధులూ పోయేయి. రాజకీయాల్లో స్థానిక నేతలు, పరప్రాంత నేతల ప్రవేశం జరిగింది. నగరంలో కొత్తధనికులు, కొత్త వ్యాపారాలూ రావటంతో వారిని అంటిపెట్టుకు బతికే పేదలు కొత్తగా తయారయ్యేరు. కోర్టులు, జైల్లు, కార్యాలయాలు జనజీవితంలో వేలు పెట్టడం కాదు కాళ్లు పెట్టేయి. ఇలా సమస్త విశాఖ జీవితాన్నీ, పరిసరప్రాంతాల జనజీవనాన్నీ, వారి రాజకీయార్థిక చలనం, సాంస్కృతికచలనం, సమస్త సామాజిక చలనాన్నీ స్థానిక వ్యక్తీకరణలతో సాహిత్యీకరించేరు రావిశాస్త్రిగారు.

ఇంకోవేపు పాలకవర్గాల పంచవర్ష ప్రణాళికల పుణ్యాన నగర విస్తరణా, గ్రామీణవిధ్వంసం జమిలిగా సాగింది. (గ్రామీణవిధ్వంసాన్ని కా.రా. యజ్ఞం కథలో చూడొచ్చు) గ్రామీణప్రాంతం నుంచి వలసలూ, పట్టణాలలో, నగరాలలో లంపెన్‌శ్రేణుల పుట్టుకా అప్పుడే జరిగింది. వీటికి సంబంధించిన ఆనుపానులూ, వీటి అనేక రూపాలూ, వీటి స్వభావాలూ మనకు రావిశాస్త్రి రచనల్లో కన్పిస్తాయి.

బహుశా, చెప్పుకోదగ్గ మహానగరాలు తెలుగునేలకూ, కళింగనేలకూ లేకపోయినా...గ్రామాల సారాల్ని జీర్ణం చేసుకుని యెదిగే పట్నాలూ, ఆ పట్నాలే పెట్టుబడులతో, దొంగవ్యాపారాలతో నగరాలుగా యెదిగే దశలో తయారైన బూర్జువాలూ, వారిని ఆశ్రయించుకు యెదిగే వకీల్లూ, పోలీసధికార్లూ, న్యాయమూర్తులూ, రాజకీయనాయకులూ...వారి వెనకాల పులెనకాల వరదల్లా లంపెన్ వ్యక్తులూ... దాదాపు పందొమ్మిదివందల ఎనభయిలదాకా విశాఖ స్థానికతను రావిశాస్త్రి రచనల్లో చూస్తాం. రావిశాస్త్రి రచనల్లో పాత్రలు, సంభాషణలు, కథాకథనం విశాఖ స్థానికతను ప్రదర్శిస్తుంటాయి గానీ, వీటి ద్వారా రావిశాస్త్రి యెరుక కలిగించిన కథాంశం విశ్వజనీనం.

ఆరు సారాకథల్లోని పోలీసులు, వకీల్లు, న్యాయమూర్తులు, చోటామోటా రాజకీయనాయకులు, సారావ్యాపారులు... బహుశా ఆ కాలంలో (1955-65) యే దేశంలోనయినా యిలాగే వుంటారు. ఏ దేశంలో న్యాయస్థానమయినా- గుప్పున సారాకంపు! (ఆయా దేశాల్లో ఆయా మద్యం కంపు). గొల్లున సంత గోల! కోర్టు - అబద్ధాలకి పాముల పుట్ట! బందిలదొడ్డికి రాచబాట కోర్టు! (న్యాయం కథలో) విశాఖలో కోర్టుని విశ్వజనీనం చేసారు. ఏ దేశంలో గవర్నమెంటయినా ఓట్లను కొనగలిగే నోట్లతో అధికారంలోకి వస్తుందని 'మోసం' కథలో ఓ దొంగసారా వ్యాపారి పాత్ర రాకెట్టప్పారావు...తనకు లంపెన్‌వృత్తిలో గురువయిన వానికి బోధిస్తాడు. "... లోకంలో యెవరు యీ రోజుల్లో బాగుపడాలన్నా డబ్బుండాల. మాయుండాల, దబాయింపు సెక్సనుండాల...". ధనికదేశమయిన అమెరికాచేసే మాయ, దబాయింపు సెక్షన్ గురించి కూడా యీ డైలాగ్ వర్తిస్తుంది. రెండు ప్రపంచయుద్ధాలతో చిదిగిన జీవితాలు, ఎదిగిన బూర్జువాలూ విశాఖ స్థానికతలో 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' నవలలోనూ, కొంతగా 'రాజు-మహిషి'లోనూ చిత్రిస్తూనే అంతర్జాతీయంగా ఎదిగిన బూర్జువాలను జ్ఞప్తికి తెస్తారు. చివరలో వారు రాసిన 'ఇల్లు' నవల కూడా డబ్బయిల, ఎనభయిల విశాఖ స్థానికతే, కాకపోతే శ్రీకాకుళానికి పొడిగించేరు.

డబ్బయిల నాటి శ్రీకాకుళోద్యమం రావిశాస్త్రిగారికి ఇష్టమయిన ఉద్యమం. వారి 'రాజు-మహిషి' నవలను నక్సలైట్ నాయకులకు అంకితమివ్వడం గానీ, 'వియత్నాం విమల' నవలలో దేశంలోని ఎమ్మెల్యేలు, ఎంపీలు, ఉద్యోగులు, అధికార్లు, వాళ్లూ. వీళ్లూ యెవరినయితే ఎన్నుకోవడమో, ఎంపికచేయడమో చేస్తామో, వారందరూ విధిగా ఒక యేడాది పాటు రాళ్లుకొట్టి, పొలాలు దున్ని, బస్తాలుమోసి రకరకాల శారీరకశ్రమలు చేసి కూలిడబ్బులు సంపాదించి బతకాలని శాసనం చేస్తే ఉన్న చట్టాల పరిధిలో కొంత మంచి జరుగుద్దనుకుంటానని అనడంగానీ, (చైనా సాంస్కృతిక విప్లవ ప్రభావం), మరికొన్ని కథల్లోని వారి సిమిలీలుగానీ, వ్యాఖ్యానాలుగానీ అందుకు ఉదహరణలుగా చూపొచ్చు. 'వియత్నాం విమల' కథనంలో స్థానికత కన్పించినా, ఆ విమల పాత్ర మనకు అగ్రరాజ్యం అమెరికాతో ఢీకొని నిల్చిన వియత్నాంని గుర్తుకు తెస్తుంది.

'రాజు-మహిషి' నవలలో 1955-1970 మధ్య కాలపు విశాఖనగర దృశ్యం కనబడుతుంది. 1955 నాటి జీతభత్యాలు తెలుస్తాయి, సరుకుల ధరలు తెలుస్తాయి. రాజకీయాల్లో మార్పులు తెలుస్తాయి. అప్పుడప్పుడే తొలగిన ఆంగ్లేయ దొరతనమూ, ఫ్యూడల్ భూస్వామ్య ఘరానా, కొత్తపాలనలో యెదుగుదలలోకొస్తోన్న రాజకీయులు, నగరం యెదిగేకొద్దీ చిదిగి, చిల్లరబతుకులు బతికే జీవులూ, చిల్లర నేరాలు, నేరాలమీద బతికే రక్షకభటులు, న్యాయం అన్యాయమయిపోయే న్యాయస్థానాలు వంటివెన్నిటినో నవలలో తెలుసుకుంటాము. వలసల నుంచి విముక్తి అయిన యే వలస దేశంలోని నగరంలోనయినా యివన్నీ జరిగేవే. పాత్రల రూపురేఖలు, భాష వేరుగా వుండొచ్చు.

జాతీయ, అంతర్జాతీయ రాజకీయాలమీద కామెంట్స్, ముఖ్యంగా 70ల నాటికి కమ్యూనిస్టు పార్టీల రంగుమార్చకుండా దిక్కు మార్చాయనే విమర్శ యీ నవలలో చూస్తాం.

'రత్తాలు-రాంబాబు' నవల విశాఖలో కొన్నిచోట్ల నడిచే వేశ్యావృత్తి కంపెనీలు, కంపెనీలు నడిపే స్త్రీలు, సహకరించే పురుషుల్లో పోలీసులు, పొలిటీషియన్లు ...యిలాంటి చోట్ల బేరాలు నమ్ముకునే రిక్షావాళ్లు, రౌడీలు, బేవార్సుగాళ్లు, చిక్కుకుపోయిన అమ్మాయిలు, వారి గాథలు, వారికోసం వచ్చే సరసులు, వారి మోటు, రాటు సరసాలు... రావిశాస్త్రిగారి అన్ని రచనల్లోనున్నట్టే యిందులోనూ పోలీసులూ, ప్లీడర్లూ, ప్లీడరు గుమస్తాలు... వీరుగాక, యిందులో స్టూడెంటు కుర్రాళ్లు, అమ్మాయిలూ వుంటారు. ఒకానొక నగరంలోని వెలుగులో జీవితాలతోపాటూ చీకటిలో జీవితాలను జెనరేటర్ లైటింగులో రావిశాస్త్రిగారు చూపేరు. అంతర్జాతీయ డ్రగ్ మాఫియా, సెక్స్ రాకెట్‌లు నడచే దేశదేశాల అండర్‌వరల్డ్ వ్యవహారాలను యీ నవల గుర్తుకుతెస్తుంది.

'గోవులొస్తున్నాయి జాగ్రత్త' నవలలో రెండవప్రపంచ యుద్ధం తర్వాత వలస దేశాల్లోని రాజకీయాల మార్పుల్నీ, రాజకీయాధికార వర్గాల మార్పుల్నీ, వలసదేశాల్లో ఎదిగే బూర్జువావర్గాన్నీ విశాఖ స్థానికతతో విశ్వజనీనం చేసి చూపేరు.

"పేదలెవ్వరూ ఇది చదవరాదు. చదివినచో వారు శిక్షలకు పాత్రులగుదురు" -ఇట్లు కిరీటిరావు అన్న వాక్యాలతో నవల ఆరంభమవుతుంది. కిరీటిరావు బురాక్రటిక్ అధికారి, ఆంగ్లేయుల సేవకుడు... తన జీవనప్రయాణాన్నీ, తనను అమితంగా ప్రభావితం చేసిన రాజయోగి పెదనాన్న చేసిన కార్యక్రమాలు, అక్రమాలు, సక్రమాల గురించీ నవల వివరిస్తుంది. రెండవప్రపంచ యుద్ధం తర్వాత వలసదేశాలు స్వతంత్రదేశాలు కావడం, పాలకులుగా స్వదేశీ బూర్జువా, భూస్వామ్య వర్గాలు రూపొందడం, ప్రజల ఇక్కట్లూ, తిరుగుబాట్లూ... దందహ్యమాన దశకం (70లు) దాకా మనకీ నవల చూపిస్తుంది. స్థానికత, విశ్వజనీనతా జమిలిగా పాత్రల మనస్తత్వ చిత్రణలో, సిమిలీల్లో, సంఘటనల పరంపరల్లో అడుగడుగునా కన్పిస్తాయి.

రావిశాస్త్రిగారి సిమిలీలు కూడా స్థానికతను ప్రతిబింబిస్తూ విశ్వజనీనంగా వుంటాయి. 'అధికారి' అనే కథలో - 'రాత్రి పదకొండుగంటల సమయంలో ఊరవతల ఇసకమైదానం, వెన్నెల వెలుగులో పరచిన బంగారుతివాచీలా వుంది. మైదానం మధ్య దంపతుల్లా నిల్చున్న తాటిచెట్ల కమ్మలు చల్లగాలి పెట్టే కితకితలకి కిలకిల్లాడుతున్నాయి.."అని రాసేరు. ఆ సమయంలో, అలాంటి ఇసకమైదానం, తాటిచెట్లు యే దేశంలోనయినా యిలాగే వుంటాయన్పిస్తుంది.

'మాయ'కథ రావిశాస్త్రి రచనల్లో విశ్వజనీనతా, స్థానికత జమిలిగా కన్పిస్తుంది. అసలా కథ ఆరంభమే - కొత్తగా విశాఖ బార్ అసోసియేషన్ మెంబరయి, కోర్టుకు వచ్చే మూర్తి అనే వకీలుకి, పెద్దప్లీడరు గారు బతికి బాగుపడేందుకు ఒక ముఖ్యమైన విషయాన్ని గుర్తుంచుకోవాలన్నారు, అదేమంటే - "ది ఎర్లీ బర్డ్ కాచెస్ ది వర్మ్ అన్నాడు ఇంగ్లీషు వాడు, ఇంగ్లీషు వాడేం తక్కువవాడు కాదు, ఏది చెప్పినా ఆలోచించికానీ చెప్పడు. ఏది చేసినా లాభం కోసం తప్పా చెయ్యడు... అంచేత రోజూ వేగిరం లేచి, వేగిరం కోర్టుకి వెళ్లి కోర్టు గేట్లు తీయించు. సాయంకాలం చక్కా దగ్గరుండి గేట్లు వేయించు. నువ్వు బాగుపడాలంటే ఎల్లప్పుడూ కోర్టునే కనిపెట్టుకొని వుండాలి. నక్కలు శ్మశానాన్ని కనిపెట్టుకున్నట్టు." అని చెప్తూ - "ఈ కోర్టూ, యీ 'లా' పుస్తకాలూ, సాక్షి పద్ధతులు ఇంగ్లీషువాడి భిక్ష..." అలా యేకకాలంలో యిటు స్థానికత అటు విశ్వజనీనతా చూపిస్తారు. బహుశా యే దేశంలో జూనియర్ ప్లీడర్లకయినా యీ బోధన సరిపోతుందేమో!

ఇదే కథలో ముత్తేలమ్మ- "నువ్వే కాదు, యీ బాబే కాదు, ఏ మనిసి మంచోడని ఎవురు సెప్పినా నాను నమ్మను. ఈ నోకం డబ్బూ, యాపారం తప్పా మరేట్నేదు..." అంటూ ఆమె మాటాడిన సుదీర్ఘ పేసేజ్‌లో కేవలం విశాఖ గురించీ, విశాఖలోని మనుషుల గురించి మాత్రమే కాదు విశ్వంలోని యే ప్రాంతంలోని ఏ మనిషి గురించయినా వర్తించే స్టేట్‌మెంట్.

అవకాశం కల్పించుకొని కథకు విశ్వజనీనతను కల్పిస్తారు రావిశాస్త్రిగారు. ఒక్కో కథలో తన వ్యాఖ్యానాలద్వారా, సిమిలీలద్వారా, ఆయా పాత్రల స్వభావచిత్రణ, ప్రవర్తన చిత్రణలతో స్థానికత నుంచి విశ్వజనీనం చేస్తారు.

**"ఈ నోకంల డబ్బూ యాపారం తప్ప మరేట్నేదు.**

**పశువులు-నోర్లేని సొమ్ములు - ఆటికి నీతుంది కానీ మనకి నేదు.**

**సదువులేందాన్ని నాకూ నేదు; సదువుకున్నాడివి నీకూ నేదు.**

**డబ్బు కోసం నోకం నోకమంతా నడుచుకుంటోంది.**

**డబ్బుకు నాను సారా అమ్ముతున్నాను,**

**డబ్బుకి సదువుకున్న సదువంతా నువ్వమ్ముతున్నావు.**

**డబ్బుకి పోలిసోళ్ళు నాయ్యేన్నమ్ముతున్నారు.**

**మందు కోసం పెద్దాసుపత్రికెల్తే అక్కడ మందులమ్ముతున్నారు.**

**గుళ్ళోకెల్లి కొబ్బరికాయ సెక్కా కాన్డబ్బూ ఇస్తే**

**ఆ దేవుడి దయే అమ్ముతున్నారు.**

**హొట్లొస్తే పేదరు బాబూ నువ్వూ, నానూ, ఈ బాబూ, అందరం అమ్ముడయిపోతున్నాం.**

**అమ్మకం! అమ్మకం! అమ్మకం!**

**అమ్మకం తప్ప మరేట్నేదీలోకంలో."**

**-ముత్తేలమ్మ 'మాయ' కథలో**

'వియత్నాం విమల' నవలలో - "...జపాన్‌వాడు యుద్ధం ప్రకటించకుండా పెరల్‌హార్బర్ మీద బాంబులు వేసినపుడు యావత్తు అమెరికా షాకయిపోయింది. నా మాటలకు ఇంత వియత్నాం విమలా షాకయిపోయిందంటాడు" ఓ వ్యాపారి.

'కుక్కపిల్ల' కథలో 'ఫ్రీ ఎన్టర్‌ప్రయిజ్' గురించి చేసిన వ్యాఖ్యానం, (శ్రమంతా ప్రజలది, సిరి అంతా ఎన్టర్‌ప్రయిజ్ గాళ్లదీ), . ఈ సిస్టమ్‌కి బ్రిటన్, అమెరికా, రష్యా - పుట్టినిల్లు, మెట్టినిల్లు, గిట్టినిల్లు - వరుసగా ఎరుగునది అనంటారు.

'తలుపు గొళ్లెం' కథలో ఈ భూమ్మీద మనిషికి రెండే ముఖ్యమయిన పనులు - మొదటిది... దొంగతనం చేయడం, రెండవది... దొంగలను శిక్షించడం. మనిషి జీవితము, మానవ చరిత్రా అ రెండింటిలో వున్నాయంటారు.

ప్రతీ రచయిత రచనకూ స్థలకాలాలుంటాయి. స్థలకాలాతీత రచనలుండొచ్చుగానీ అవి వాస్తవ చిత్రణలో వుండవు. నిర్దిష్ట స్థలంలోని జీవితాన్నే రచించినా ఆ జీవితం, జీవితవర్ణన, జీవనప్రయాణం, ఆశ, నిరాశలు, ఆనంద, విషాదాలు ఆ నిర్దిష్ట స్థలాన్ని దాటి విశ్వంలో యెక్కడయినా పోలినట్టు చిత్రించడమే విశ్వజనీన రచన. రావిశాస్త్రిగారు అలా తన రచనలు సాగించడమే కాక యేక కాలంలో స్థానికత, విశ్వజనీనతా జమిలిగా చూపేరు.





# లక్కీలూసీ అహింసా పిల్లి కాదు

నల్లూరి రుక్మిణి

చాలా రోజుల తరవాత రా.వి.శాస్త్రి కథలు చదువుతుంటే– నవలలకంటే కథలే మంచి వ్యక్తీకరణలుగా వున్నాయనిపించాయి. అన్ని కథలనీ చెప్పలేనుగానీ, చాలా కథల్లో ఒక్కో ప్రత్యేకమైన అంశాన్ని హైలెట్ చేశారనిపిస్తోంది. మనం ఎప్పటినుండో 'వేతనశర్మ', 'పిపీలకం', 'బల్లచెక్క' లాంటి కథలను తరచి తరిచి విన్నాం. నిజానికి, ఈ వ్యాసం కోసం ముందుగా–'ఇల్లు' నవల చదివితే– నాకెందుకో మనసుకెక్కలేదు. అది ఇంతక్రితం చదివిందే. అయినా అలా అనిపించింది. తరవాత వరసగా మరో రెండు నవలలూ చదివానుగానీ– కథల మీదకే మనసు పోయింది.

'షోకుపిల్లి' కథ– అంతగా పాఠకులలో 'నాని'నట్లుగా నా దృష్టికి రాలేదు. అందుకే ఈ కథ చూద్దామనిపించింది.

ఈ చిన్న కథలో కూడా– "మన తిండికి ఎవరైనా అడ్డుపడితే మనం వూరుకుంటామా? చెప్పు"– అంటాడు ఓ తండ్రి, కూతురితో.

ఇదే ఈ కథలోని అంతరార్థం–

అయితే, ఈ మాట చెప్పిన తండ్రికి– కూలిజనం తమ కూటికి అడ్డుపడిన వాడిని కూడా వూరుకోక పోవచ్చుననేది!, అనుభవంలోకి రాలేదు.

ఆ అనుభవం 'రావ్'లాంటి వారికి రావాలనేది రావిశాస్త్రిగారి కోరిక. ఆ మాట ఆయన నేరుగా చెప్పలేదు. కానీ 'రావ్'లు చేసే 'కానరాని' దుర్మార్గాల 'మర్మం'– విప్పిచెప్పాడు.

దాన్ని అందుకోవలసినవాళ్ళు అందుకోవాలి.

'రావు' పెద్ద బిజినెస్‌మాగ్నెట్. ఆయన అప్పుడే విదేశాలు తిరిగి వ్యాపారాలు చక్కపెట్టుకుని ఇంటికి వస్తాడు. అయితే, మూడు నెలలుగా ఇంట్లోలేని భర్త అలిసిపోయి వచ్చాడన్న ధ్యాసలేకుండా– కొడుకు గురించి కంప్లైంట్స్ చెప్పటంలో మునిగిపోయింది ఆయన సతీమణి.

"నందూబేబీ చెడిపోయాడు– వాడేదో చెత్త మాట్లాడుతన్నాడు– సోషలిజం, ఈక్వాలిటీ అంటున్నాడు. పాటగాళ్ళూ, రాతగాళ్ళూ, ఆటగాళ్ళూ వంటి వెధవల్ని తెచ్చి పెద్దమనుషులేనని చెప్పి ఇంటికి తెచ్చి బ్రాందీలూ, విస్కీలూ ఇస్తున్నాడు. డీసెంట్ కంపెనీతో మద్యం సేవించినా ఫరవాలేదుగానీ, ఇలాంటి వెధవలతోనా" అని, తెగ ఫీలైపోతుంది.

అన్నిటికంటే మించి, ఎవర్తో 'సరసిజాక్షట'– ఏ! కాల్‌గర్ల్, ఏ! ప్రాస్, ఏ! బిచ్... వీడిమూలంగా తలెత్తుకు తిరగలేకపోతున్నాను! అందరూ నన్నుచూసి నవ్వుతున్నారంటుంది. ఇదంతా "ఆ డ్రైవర్‌గాడివల్లే, వాడే! ఆ వెధవే" చేశాడంటుంది.

ఓ పక్క భార్య ఇలా కొడుకు గురించి హంగామా చేస్తుంటే– ఆ 'సందట్లో సడేమియా'లాగా, కూతురు– "నందూని డ్రైవర్ పాడుచేస్తే, లూసీని నువ్వు పాడుచేశావ్! నువ్వే పాడుచేసేవు! నువ్వే, నువ్వే!" అని తల్లిని కోపంతోనూ ఉక్రోషంతోనూ నిందిస్తుంది. కూతురు మాలినీ రావ్!.

'లక్కీలూసీ'– మాలినీరావ్ పెంపుడు పిల్లి. ఓ నాలుగు రోజుల క్రితం 'లక్కీలూసీ'ని పార్కుకు తీసుకుపోతుంది మాలినీరావ్ తన స్నేహితురాళ్ళతో కలిసి!.

ఆ పార్కులో కాపలాగా వుండే వాచ్‌మెన్ ఓ నిప్పులకోడి పెంచుతుంటాడు. నిప్పులకోడి లక్కీలూసీని చూసి హఠాత్తుగా ఎటాక్ చేస్తుంది. దానితో 'లూసీ' బెదిరిపోయి యజమాని చెంతకు చేరుతుంది. అది చూసి మాలినీరావ్ స్నేహితురాళ్ళు రకరకాల వ్యంగ్యోక్తులు విసిరి నవ్వుతారు. చివరకు, మీ అన్నలాగే నీ పిల్లికూడా 'సోషలిస్టు పిల్లి' 'అహింసా పిల్లి' అని నవ్వుతారు. 'పీస్ ప్రయిజ్ ఇవ్వొచ్చు'– అంటారు.

ఇది మాలినీరావ్‌కు తలకొట్టేసినట్టుగా వుంది.

ఇదంతా అమ్మవల్లనే జరిగింది, పిల్లిని పిల్లిగా బతకనివ్వకుండా ఆ పాడు 'థియసాఫికల్ మీటింగ్స్'కు తీసుకుపోయి, 'యూస్‌లెస్‌ఫెలోని' చేశారు అని తల్లిమీద నెపం వేస్తుంది. చివరకు అది ఎలుకను చూసి భయపడే స్థితికి వస్తుందని ఉక్రోషంతో కళ్ళల్లో నీళ్ళు తిప్పుకుంటుంది.

కూతురి అభియోగాలు విన్న రావ్‌కి ఎక్కడలేని నవ్వూ వస్తుంది.

"కొన్ని వేల వేదాంత ఉపన్యాసాలు మీ అమ్మను ఏమైనా మార్చేయా? అలాగే నీ పిల్లీ మారదు. 'డోన్ట్ బి సిల్లీ'" అని కూతుర్ని మందలిస్తాడు.

"మరి నందూబేబీ మారిపోలేదేంటీ"– తండ్రిని రెక్కిస్తుంది.

"పిల్లికి మెదడు పెరగదు, అదెప్పుడూ పిల్లిలాగే వుంటుంది. మనిషి అలాకాదు. జ్ఞానం వచ్చాక మనిషి తను పులిలాగా బతకాలో, మేకలాగా బతకాలో తేల్చుకుంటాడు. మీ అమ్మా, నేనూ మేం తేల్చుకున్నాం. నందూ ఇంకా తేల్చుకోలేదంతే!. వాడుకూడా రేపోమాపో తేల్చుకుంటాడు, ఏదైనా క్రైసిస్ వస్తే!" అంటాడు.

ఆ పైన 'రావూ', అతని కొడుకు 'నందూబేబీ'– 'సరసిజాక్షి' అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా ఆమెను వదిలించుకోవడానికి చేసిన కుయుక్తులు– చివరికి ఆమెను, పోలీసు 'అవతారం' ద్వారా 'బ్రోతల్'కింద బుక్ చేయించడంతో ముగిస్తారు.

'రావు'కు, కొడుకు సంగతి అప్పటికింకా తెలియలేదుగానీ, 'నందూబేబీ' సోషలిస్టు కబుర్లనీ– మోసగించటానికే ననేది కథలోనే చెప్తాడు రచయిత. వాడు అప్పటికే బొంబాయి వుడాయించాలనే ఆలోచనల్లో వుంటాడు. తండ్రికి తన గురించి తెలియదనీ, తండ్రికంటే రెండాకులు ఎక్కువే చదివాడనేది, కథలో మనకు తెలుస్తుంది.

ఇదంతా అదే డ్రైవర్ ద్వారా– 'సరసిజాక్షి' వుంటున్న ఆ పేదల పేటలో ఆమె మేనమామను రెచ్చగొట్టి అల్లరి సృష్టించి 'రావు' సఫలీకృతుడవుతాడు.



# సామాన్యులతో మమేకమైపోయిన రచయిత

**చలసాని ప్రసాద్**

ఆయన సామాన్యుడికి అసామాన్యంగా పట్టాభిషేకం చేశాడు. Underdog down trodden తరపు ఇంతకన్నా గట్టిగా వకాల్తా పుచ్చుకున్న రచయితలు ప్రపంచంలో ఉన్నారు - Dickens, Hugo, Mark Twain వగైరా వగైరా. కాని అతిదీనుల గుండెల చప్పుళ్లని ఇంత accurate గా record చేసిన, చేయగలిగిన రచయితలు చాలా అరుదు. ఏ పాత్ర ఏ పరిస్థితుల్లో ఏం మాట్లాడుతుందో ఎలా మాటాడుతుందో ఆనాడు గురజాడకి తెలుసు. ఈనాడు రావిశాస్త్రికి తెలుసు. ఇది సామాన్యం కాదు. జీవితం పట్ల ఎనలేని ఆసక్తి, జీవితం తోటి గాఢమైన పరిచయం లేకపోతే ఇది అసాధ్యం. ఎక్కడో చదివా - రచయిత అనేవాడు సమాజానికి సెక్రెటరీలా ఉండాలి. సెక్రెటరీ ఏం చేస్తాడు. చాలా faithful గా ఆ వ్యక్తి యొక్క సంస్థ యొక్క ఆశలనీ, ఆశయాలని అమలుపరుస్తాడు. Minister కి ఒక secreatary ఉన్నాడనుకో. ఆ minister పనులన్నీ చక్కబెడతాడు. అతనికి వేరే వ్యక్తిత్వం ఉండగూడదు. అంటే సమాజంతో అంతగా మమేకం అయిపోవాలి. ఇది ఎంత కష్టసాధ్యమో ఒక్కసారి ఆలోచించు. ఇది tight rope walking. తాను చెప్పదలచుకున్న విషయం మీద గొప్ప command ఉండాలి. పాత్రల మానసిక స్థితిగతులమీదా, మనస్తత్వం మీద కూడా ఎంతో authority ఉండాలి! ప్రజల్ని ప్రేమించాలి. వారి దృష్టి నుంచీ ప్రజా శత్రువుల్ని ఆకళింపు చేసుకోవాలి. మంచిని ప్రేమించాలి. చెడుని తెలుసుకుని ఏవగించుకోవాలి.

గాంధీగారి కోతుల్లా చెవులు, కళ్ళు, నోరు మూసుకుంటే నువ్వు సమాజానికి చేయగలిగిందేమీ లేదు. ఇక్కడే గాంధీవాదం miserable failure. Realism తన జండా ఎగరేసింది. చుట్టూ చెడు ఉన్నప్పుడు కళ్లుమూసుకోవడం ద్వారానో, నువ్వొక్కడివీ పవిత్రుడిగా ఉన్నంత మాత్రానో ఏమీ జరగదు. నువ్వు వ్యక్తిగా రాణించవచ్చు. కాని దానివల్ల ఎవరికీ ఏమీ ఒరగదు. ప్రపంచం ఒక్క పిసరు కూడా ముందుకి వెళ్లదు.

(తుమ్మల కృష్ణకుమార్ అనే అమెరికా మిత్రుడికి రాసిన ఉత్తరం నుండి)



దీనినంతా 'లక్కీలూసీ'తో కంపేర్ చేస్తూ కథను నడిపించడంలోనే రావిశాస్త్రిగారి నైపుణ్యం మనకు తెలుస్తుంది.

'సోషలిస్టు పిల్లి'- తోటలోవున్న 'మైనా'ను నోటకరిచి తింటుంది. ఆ భీభత్సం చూసి, 'రావు'- 'మైనా' చంపబడటం- ఘోరమైందే అనుకుంటాడు. కాని రావుగారు దానికి చలించలేదు- 'లూసీ'కి ఆ సమయంలో ఎంత ఠీవి వచ్చిందోనని అబ్బురపడి, 'ఎంతటి అపురూపమైన అందం, వ్హాట్ ఎ టెరిబుల్ బ్యూటీ' అని మురిసిపోతాడు.

అప్పుడు 'రావు'- కూతురికి జ్ఞానోదయం చేస్తాడు. "మన తిండికి ఎవరైనా అడ్డుపడితే మనం- వూరుకుంటామా?"అని

'మైనా'ను చంపిన పిల్లిని చూసి- మాలినీరావ్ హృదయం సంతోషంతో కరిగిపోయింది. ఆమె ఆ సమయంలో అపురూపమైన టెరిబుల్ బ్యూటీతో మెరిసిపోయింది-

ఇది చిన్న కథ- కానీ పెద్ద సత్యాన్ని చెప్పింది.

ఏ జాతి మనుషులు ఆ జాతి స్వభావాన్నే కలిగివుంటారని-

ఈ కథను నడపడంలో- రావిశాస్త్రిగారి అద్వితీయమైన శైలి- వ్యంగం గురించి నేను చెప్పడం కంటే, పాఠకులు చదివితే మరింత రసహృదయులయిపోతారు!.

ఆ రసహృదయంతో ఆగిపోకుండా, రచయితలాగే మనమూ ఎటుండాలో తేల్చుకోవాలి. అన్యాయానికి బలైన 'సరిసిజాక్షి' వైపా?- అన్యాయాన్ని అందంగా నిర్వహించిన 'రావ్'ల వైపా?-

ఇది పాఠకుల ముందున్న ప్రశ్న!.





# రావిశాస్త్రి చూపిన దారి

అరసవిల్లి కృష్ణ

రాచకొండ విశ్వనాథశాస్త్రి రచన మేజిక్ ఏమిటి? మానవ తండ్లాటను, సమాజ పరిణామాలను అత్యంత సూక్ష్మంగా చిత్రించిన కథకుడు. పేదలు, మధ్యతరగతి కుటుంబాలలోని జీవన సంఘర్షణను మనుషుల జీవన రాపిడిని, వ్యక్తులలో వుండే వ్యాకులతను, పేదరికాన్ని, సంపన్న సమాజంలో వుండే సాంస్కృతిక సంబంధాలను, చిన్న చిన్న ఆకాంక్షల కోసం పెనుగులాటను అత్యంత లోతుగా గమనించి తాను కథన నిర్మాణంలోకి అన్వయింపజేయగలిగినాడు.

ఆయన సమస్త సాహిత్యం ఎలా రూపొందింది? తన ముందటి తరం రచయితలనుండి ఆయన నేర్చుకున్నది ఏమిటి? తన రచనా సంవిధానం తన సృజనాత్మక అనుభవ ప్రపంచంలోకి ఎలా జొరబడింది?

జీవితకాలంలో రచయితగా రావిశాస్త్రి ఏ వర్గాలకు అండగా నిలబడినాడు. తను కలుస్తున్న, మాట్లాడుతున్న, తన పరిచయాలలోని మనుషుల ప్రపంచం ఏమిటి? అంతరాల ప్రపంచంలో మనుషులు ఏ విభజన దగ్గర జీవిత మూలాన్ని అన్వేషిస్తున్నారు. ఈ అన్వేషణ జీవితానికి సంబంధించినదా? ఈ వెతుకులాట వెనుక ఆర్థికాంశం దాగి వున్నదా? రావిశాస్త్రి సాహిత్యం చుట్టూ ఇన్ని ప్రశ్నలు ఎదురవుతాయి.

మానవ జీవితాన్ని నిర్దేశిస్తున్న ప్రధాన అంశం ఆర్థిక లేమి. కథకునిగా రావిశాస్త్రి తన ప్రాపంచిక దృక్పథంతో ఈ ప్రధాన అంశం చుట్టే తిరిగారు. భారత సమాజపు బీదరికం అనేక పార్శ్వాలు గలది. బీదరికమనే వృత్తం భారత సమాజమంతటా ఒకే రీతిలో లేదు. భారతదేశంలో సాంస్కృతిక, కుల, మత వైవిధ్యమున్నట్లే బీదరికపు ఛాయలలో కూడా అనేక పార్శ్వాలు వున్నాయి. చూడటానికి బీదరికపు అంచులు ఒకేలా వున్నా సారాంశంలో భిన్నమైనవి. ఈ లోతులను ఎవరు గ్రహిస్తారు? అనేక సమస్యలతో ఉన్న జీవితం అదొక జీవితం కాదని, రంగుల రాట్నమని స్పృహ ఎవరికి కలుగుతుంది. ఒక సమాజం పైకి కనబడుతున్నట్లు వసుధైక కుటుంబం కాదు. మనుషుల మధ్య వున్నది పరస్పర ప్రేమానుబంధాల వారధి కాదు. నిజానికి మనుషులు వర్గ సంబంధాల మధ్య పుట్టి జీవన్మరణ పోరాటం చేస్తుంటారు. మనిషిలో స్వార్థం ఉంటే ఆ మనుషులంతా స్వార్థపరులు కావాలికదా! ఈ స్వార్థత్వానికి హెచ్చుతగ్గులుంటాయా? బీదరికంలో మనుషులకుండే స్వార్థం కనీస జీవితేచ్ఛ. అది ఎలా నెరవేరుతుంది? బతుకు కోసం, పూట కింత తిండి కోసం, కూడు, గూడు, గుడ్డ అనే కనీస వసతుల కోసం, దాని వెనుక బలీయమైన స్వార్థకాంక్ష వుంటుంది. దీనిని ఎట్లా అర్థం చేసుకోవాలి. ఒక వర్గం రాజ్యవ్యవస్థను శాసించేదిగా వుంటుంది. రాజ్యం కన్నుసన్నలలో నడిచే, చట్టం, న్యాయం, అంతిమంగా రాజకీయ పదవులు వీరి కనుసన్నలలో వుంటాయి. రెండు రకాల స్వార్థపరత్వాలు రెండు వర్గాల పునాదిపై ఆధారపడి వుంటాయి. ఈ సారాంశం అర్థం కాకుంటే రావిశాస్త్రి కథలు అర్థం కావు.

రావిశాస్త్రి వృత్తిరీత్యా న్యాయవాది. తనకున్న సృజనానుభవంతో రచయితగా నమాజానికి తనదయిన ప్రపంచానికి ఏదో చెప్పాలనుకున్నాడు. తెలుగు సాహిత్యం ఊహా సుందరులను కలగంటున్నప్పుడు, నేలపై మనిషి ఉన్నాడు. అతని అవస్థ వుంది. ఆకాశంలో మనుషులు లేరు. అందుకే కవిత్వానికి గొంతెత్తి భూమార్గం చూపిన వాడు శ్రీరంగం శ్రీనివాసరావు. శ్రీశ్రీ వేసిన ప్రగతిశీల భావజాలపు వెలుగు తెలుగు సాహిత్యకారులపై ప్రసరించింది. ఈ

భావజాల వ్యాప్తిని అత్యంత జాగరూకతతో అందుకున్న రావిశాస్త్రి తను నమ్మిన సైద్ధాంతిక భావజాలంతో భూమిపై వున్న సకల రుగ్మతలకు కారణమైన మనుషుల భావదారిద్ర్యాన్ని అన్వేషించాడు. నూత్న లేదా సమసమాజ స్థాపనలో మనుషులే కీలకం. మనిషి స్వార్థజీవిగా వుంటాడనే చోట రావిశాస్త్రి అంతిమంగా మనిషిని వెతికాడు. శ్రీశ్రీ వేసిన భావ పునాదిపై తనదయిన మార్గం వేసుకున్నాడు. తన కథల నిండా తన ప్రాంత మనుషులే వుండవచ్చు. వారు తమదయిన మాండలికంలో మాట్లాడవచ్చు. ఒక ప్రాంతం వెనుకబాటుతనంలో అక్కడ మనుషులు కూడా కాసింత మెరుగైన జీవితం కోసం తలపోయవచ్చు. లేదా జీవితం అంటే శ్రమ – అర్థాకలి అనుకోవచ్చు. ఆ ప్రాంతం, ఆ జీవితం అక్కడి మనుషులుది మాత్రమే కాదు. బీదరికపు అంచుల నుండి పెనుగులాడుతున్న అనేక ప్రపంచాలది కూడా. భిన్న ప్రపంచాలను అర్థం చేసుకోవడానికి రచయిత తన కాళ్ళ కింద భూమిని తలపోశాడు. ఆ భూమి తడిని గమనించాడు. కుత్సిత, దుఃఖ ప్రపంచానికి తనదయిన కంఠస్వరంతో నిజాయితీగా మాట్లాడాడు. రోజురోజుకీ మారుతున్న ప్రపంచం దానిలోపల నిర్మితమవుతున్న మనుషుల ఊహాప్రపంచం ఈ రెండింటి మధ్య కథకుడు ఒక ప్రయాణం చేశాడు. తన చుట్టూ వున్న మాయామోహిత ప్రపంచం వెనుక ఏమున్నది? నిజానికి మనుషులంతా దేనికోసం ఎదురుచూస్తున్నారు. జననానికి, మృత్యువుకు మధ్య సాగిన జీవన యాత్రలో మానవుడు కనులారా వీక్షించినదేమిటి? దారిద్ర్యం, సంపద వెనుక కొనసాగిన జీవితంలో ధనం పాత్రేమిటి? రావిశాస్త్రి తనదయిన ఆర్థిక నమూనాను కథలలో ప్రవేశపెట్టినాడు. రావిశాస్త్రి కథలు మానవ సంబంధాలలోని ఆర్థికాంశాల చుట్టూ పరిభ్రమిస్తాయి. మృత్యువుకు దగ్గరగా వున్న ముసలి అవ్వ అయినా, రిక్షా కార్మికుడయినా, భిక్షాటన చేసే వ్యక్తి అయినా వర్గ దృక్పథపు నేపథ్యం నుండి కథలు అల్లిక చేసాడు రావిశాస్త్రి.

రావిశాస్త్రి నివసించిన కాలంలో అట్టడుగు ప్రజల కేంద్రంగా కథలు రాయడం తేలిక అయిన అంశం కాదు. తన చుట్టూ వున్న ప్రపంచం ఒక రంగుల వల. ఆ వల చుట్టూ ప్రపంచం రంగుల రాట్నంలా తిరుగుతుంది. ఆ రంగుల రాట్నాన్ని చిత్రిక పడుతున్న కథా ప్రపంచమున్నది. ఊహాజనిత మానవులు స్వప్నాలు రచనా కొలిమిలో తయారవుతున్న కాలం. ఇలాంటి కాలంపై నిలబడి తనదయిన మార్గాన్ని ఎంచుకున్నాడు. రచయితకు వర్గస్పృహ వుంటుంది.. తను ఎవరి పక్షం వుండాలి? ఈ ప్రశ్న నిమగ్న రచనలు చేసే రచయితకు ఉండే సవాలు.

శ్రీశ్రీ ప్రభావంతో శ్రీశ్రీ కవితల నుండి ఏరుకున్న శీర్షికలతో రావిశాస్త్రి కథలు రాయడం ఒక ప్రయోగం. నిజానికి రావిశాస్త్రి ప్రయోగశిల్పి. అతని రచన చుట్టూ వుండే వాతావరణం ఒక ప్రయోగమే. తెలుగు సాహిత్యంలో నూత్న ఒరవడులు, నూత్న ప్రయోగాలు రావిశాస్త్రి సొంతం. శ్రీశ్రీ పద్యాల నుండి కొన్ని శీర్షికలు తీసుకొని కథలు రాశాడు. ఉదాహరణకు సబ్బుబిళ్ళ, కుక్కపిల్ల, హారతి పళ్లెం. ఈ శీర్షికలతో కథలు రావిశాస్త్రి రాశారు. శీర్షికకు కథావస్తువును ఎంచుకున్నారు. రావిశాస్త్రి కథలలో స్థానీయత ప్రధాన అంశంగా వుంటుంది. రావిశాస్త్రి కథలు నేలవిడిచి సాము చేయవు. తన రోజువారి జీవితంలో తను చూస్తున్న వస్తుగత ప్రపంచపు తీరుతెన్నులు ఉంటాయి. ముఖ్యంగా తన మనుషులు ఉంటారు.

మరి ఈ మనుషులు ఎవరు? జీవితంలో ఓడిపోతున్నవారు. లేదా పెనుగులాడుతున్నవారు. ఒక సమాజపు మట్టిమనుషులు. వారి యాస, వారి అలంకారం, వారి అవమానాలు రచయితగా రావిశాస్త్రి లోచూపు పట్టుకున్నది. అట్టడుగున వున్న మనుషులు రావిశాస్త్రి తనకు తెలిసిన జీవితం గురించే కథలుగా మలచాడు. తనకి తెలియని కథావరణ గురించి రావిశాస్త్రి రేఖామాత్రంగా కూడా ఆలోచించలేదు. స్థానిక మాండలికాన్ని, స్థానిక సంస్కృతిని, ఒక ప్రాంతపు అమాయకత్వాన్ని రావిశాస్త్రి తన కథల్లో పలికించారు. నైసర్గికంగా ఒక ప్రాంతపు జీవితానికి సంబంధించినది కావచ్చు. అంతర్లీనంగా ఈ కథలు మానవాళికి సంబంధించినవి. ప్రాంతం, యాస, ఇతరత్రా విషయాలను పక్కన పెడితే ఈ కథాంశం సార్వజనీనమైంది. భారత సమాజంలో రావిశాస్త్రి పాత్రలు కంట పడతాయి. వేషభాషలు, ప్రాంతం వేరుకావచ్చు. కార్మికులు, స్త్రీలు, పురుష ఆధిపత్యం ఇవన్నీ ఒకే పోలికను కలిగివుంటాయి. కథకునిగా రావిశాస్త్రికి ఒక ప్రాంతపు పరిమితి లేదు.

రావిశాస్త్రి కథాశిల్పం, శైలి నూత్న ఒరవడితో వుంటాయి. తాను ఎన్నుకున్న వస్తువు ఈ ధనవంత సౌకర్య సమాజానికి మింగుడు పడని అంశం. ఈ కథలను భద్రజీవితంలో లొంగిపోయిన ఒక వర్గం ఎలా స్వీకరించింది? జీవితంలోని బీభత్సాన్ని అత్యంత వాస్తవంగా చిత్రించిన రచయితను ఎలా స్వీకరించగలం. ఆ సున్నితత్వపు పొర వెలుగు సమాజంపై వున్నదా? రావిశాస్త్రి పాత్రలు మన సుఖమయ, ఆనందకర జీవితాలను డిస్టర్బ్ చేయకుండా వుంటాయా? విషాదాన్ని కూడా ఎంజాయ్ చేసే పాఠక సమూహం రూపుదిద్దుకున్నదా? రచయిత అత్యంత నిజాయితీగా చెబుతున్న అంశాలు ధనస్వామ్య సమాజపు పొరలు విప్పుతున్న రచయిత చిత్రించిన జీవితం వైరుధ్యంతో కూడిన కథాంశం కాదు. రెండు వర్గాల మధ్య వున్న అనేక అసమానతలను పరిష్కరించడం.

చాత్రిబాబుగా రచయిత రూపాంతరం చెందడమంటే బీదరికపు జీవితం పట్ల ఆర్తి వుంటే చాలదు. సమాజంలో మనుషులు ఎలా వున్నారో చెప్పడం మాత్రమే కాదు. వీటన్నిటి పట్ల ఆర్తి వున్న వాళ్ళకు చాత్రిబాబు ఒక దారి ఏర్పాటు చేసాడు. ఆ దారి గుండా తెలుగు కథ నడిచింది. రావిశాస్త్రి చూపిన దారి ఇవాళ మరింత విశాలమైంది. భారత సమాజంలో అంతరాల పొరలు తొలగిపోలేదు. మరింతగా పెరిగాయి. నూరేళ్ళ సందర్భంలో రావిశాస్త్రి కథలలోని మేలిమిని గ్రహించి, మేథోసాహితీరంగంలో ముందుకు దారిచేసుకోవాలి.



---

"చట్టం అందరికీ సమానమని అంటుంది ప్రభుత్వం. ధనికుడైనా, పేదవాడైనా ఎవరైనా సరే ఫుట్‌పాత్‌ల మీద అడుక్కుతినడం, నివసించడం నేరమని అంటుంది చట్టం"

**- రావిశాస్త్రి**



నిద్ర నటించే సమాజానికి హెచ్చరిక

# గోవులొస్తున్నాయి జాగ్రత్త

పలమనేరు బాలాజీ

"ప్రతి రచయితా తాను రాసేదానికి ఏదో ప్రయోజనం ఉంటుందనే రాస్తాడు. ఒక ప్రయోజనం to amuse, మరొకటి to instruct other man or to reform other man. రచనల్లో గొప్పదనం ప్రయోజనం బట్టి ఉంటుంది. దాని ప్రయోజనం సంఘంలోని జనసామాన్యపు ప్రయోజనాలతో కలిసిపోతే దానితో కళానైపుణ్యం చేరిపోతే, అది కలకాలం నిలిచిపోతుంది వేమన కవిత్వంలాగా శ్రీశ్రీ కవిత్వంలాగా" అంటారు ఒక ఇంటర్వ్యూలో రాచకొండ విశ్వనాథశాస్త్రి.

రావిశాస్త్రి రచనలన్నీ తెలుగు పాఠకులను కలవరపెట్టి, అలజడికి గురిచేసేవే. విడివిడిగా వెలువడిన ఆయన కథలు నవలలు ఇతర రచనలు చదవలేని వారి కోసం మనసు ఫౌండేషన్ వారు ఎంతో శ్రమతో వారి సమగ్ర రచనల సంపుటాన్ని వెలువరించారు. అశేష తెలుగు పాఠకులకు అనేక అద్భుతమైన కానుకలను అందించిన మనసు ఫౌండేషన్ వారు "రాచకొండ విశ్వనాథశాస్త్రి రచనా సాగరం" పేరిట వారి సమస్త లభ్య రచనల సంపుటాన్ని వివిన మూర్తి, యం.వి. రాయుడు సంపాదకులుగా 2007 జూలై 30న వెయ్యి ప్రతులను వెలువరించారు.

మొదట ఈ నవల యువ పత్రికలో డిసెంబర్ 66 నుండి ప్రచురించబడి నాలుగు నెలలకు అర్ధాంతరంగా ఆగిపోయింది. ఆంధ్రజ్యోతి వార పత్రికలో 19.01.1973 నుండి 18.05.1973 వరకు మళ్లీ మొదటి నుండి సంపూర్ణంగా అచ్చయింది. అనంతరం పుస్తక రూపంలో పాఠకులకు అందుబాటులోకి వచ్చింది. 'గుర్రపు కళ్ళెం' అను 'మరిడి మహాలక్ష్మి కథ' లేదా 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' అనే ఈ నవలా రచన విరసం ఆవిర్భావానికి ముందు మొదలై విరసం ఆవిర్భావం తర్వాత ముగిసింది.

భూస్వామ్య జమీందారీ వ్యవస్థ నుండి కొత్తగా ఉద్భవించిన పారిశ్రామిక వ్యాపార వర్గం అధికార రాజకీయ వర్గాలతో కలసి సమాజంలో బలహీనుల పట్ల మైనార్టీ వర్గాల పట్ల, పేదల పట్ల నిరక్షరాస్యుల పట్ల, అమాయకుల పట్ల ఎంత పాశవికంగా దుర్మార్గంగా అన్యాయంగా వ్యవహరిస్తుందో కళ్ళకు కట్టినట్లు చూపించిన నవల గోవులొస్తున్నాయి జాగ్రత్త.

1966 లో నవల ప్రచురించబడే నాటికి దేశంలో నెలకొని ఉన్న రాజకీయ ఆర్థిక సామాజిక చారిత్రక పరిస్థితులను, అధికారం రాజకీయం, ధనిక వర్గంతో కలిసి నిరుపేదల పట్ల కొనసాగించే అణచివేత చర్యలను, అమానవీయతను, అసమానతను, అదే సమయంలో అక్కడక్కడా యువతరంలో వెల్లివిరిసే చైతన్యాన్ని, ఆ విప్లవాత్మక భావజాలాన్ని, యువతరాన్ని అణచివేసేందుకు రాజ్యం అధికారం చేసే కుట్రని, ప్రయోగించే హింసాత్మక చర్యలను, బలమైన కులమత వివక్షతను, ఆనాటి సమాజంలో దేశభక్తి అనే ముసుగుని ధరించి, సమాజ సేవ అనే పేరుతో పేరు ప్రతిష్టల్ని సంపాదించు కోవడానికి ప్రయత్నించే లౌక్యుల నటనా చాతుర్యాన్ని రచయిత దృశ్య దృశ్యాలుగా ఈ నవలలో చిత్రీకరించాడు.

రాజకీయంలోని మనుషులను కాక, మనుషుల్లోని రాజకీయాన్ని నగ్నంగా చూపించిన నవల ఇది.

పదునైన వ్యంగ్యంతో కూడిన లోతైన రాజకీయ ఆర్థిక తాత్విక విశ్లేషణ కలిగిన కంఠస్వరం పాఠకులను అడుగడుగునా అప్రమత్తంగా ఉంచుతుంది. వర్గ స్వభావాన్ని, మనుషుల వైచిత్రిని ఇంత పచ్చిగా చెబుతున్న రచయిత కంఠస్వరం ఆద్యంతం పాఠకులను ఉలికిపాటుకు గురి చేస్తూనే ఉంటుంది. రచయిత ఏం చెబుతున్నాడో, ఎందుకు చెబుతున్నాడో, ఏ పాత్ర స్వభావం ఏమిటో, ఆ సామాజిక పరిస్థితులు, సంఘటనలకు సందర్భాలకు అసలైన లోతైన కారణం ఏమిటో, ఎవరి బలం ఏమిటో ఎవరి బలహీనత ఏమిటో, ఏది ఎవరికి ఎందుకు బలం అయిందో, ఏది ఎవరికి బలహీనత ఎందుకు అయిందో, సాధారణంగా మనుషుల్ని పరిస్థితుల్ని అర్థం చేసుకోవడానికి మనుషులు ఏ రకంగా ఆలోచించే స్వభావాన్ని కలిగి ఉంటారో, అదే మనుషులు తమకు నష్టం ప్రమాదం వాటిల్లే సందర్భాలలో అదే మనుషుల్ని అదే పరిస్థితిని అర్థం చేసుకునే క్రమం ఏరకంగా మారుతుందో, చదువుకుంటున్న యువతరం ఆలోచన సరళి ఎంత విప్లవాత్మకంగా ఉంటుందో, కులం

ఎంత తీవ్రమైన ప్రభావాన్ని కలుగచేయగలుగుతుందో, అందరినీ ప్రత్యేకమైన పరిస్థితుల్లో ఎట్లా కలిపి ఉంచగలుగుతుందో, ఒక మాటలో చెప్పాలంటే మనిషిలో పరిస్థితులు బట్టి మారిపోయే వైవిధ్యపూర్వకయిన స్వభావాన్ని, తెలియజేస్తూ ప్రతి నిమిషం పాఠకులను అప్రమత్తం చేస్తూ రచన కొనసాగిన తీరు అపూర్వం.

ఏ సందర్భంలోనూ ఎవరి పట్లా రచయితకు ఎలాంటి భ్రమలు లేవని, మంచి లోని చెడు పట్ల, చెడులోని మంచి పట్ల, మనిషి స్వభావం పట్ల రచయితకు సంపూర్ణమైన అవగాహన ఉన్నదని ఈ నవలలోని సిమిలీలు, వర్ణనలు, కథనం, సంభాషణలు ప్రధానంగా రచయిత కంఠస్వరం తెలియచేస్తాయి.

దౌర్జన్యానికి, అమానవీయతకు అసమానతకు దోపిడీకి గురి అయ్యే వర్గం –ఉపాధి పేరిట అధికారం పేరిట ఆ వర్గాన్ని ప్రలోభాలకు గురిచేసే భూస్వామ్య పెట్టుబడి వర్గం, కేవలం అధికారాన్ని అనుభవించాలనే స్వార్థపూరిత కుట్రతో, న్యాయ వ్యవస్థలో, రాజకీయ వ్యవస్థలో, అధికార వ్యవస్థలో ఏ రకంగా అయినా సరే భాగస్వామ్యాన్ని కలిగించుకొని, తమ శక్తిని పెంచుకుని, తమ దుర్మార్గాన్ని ఎలాంటి ఆటంకాలు లేకుండా కొనసాగించాలనుకుని ప్రయత్నించే ఫ్యూడల్, నయా పెట్టుబడిదారీ వ్యవస్థ గురించి ఆ కాలంలోనే ఇలాంటి నవల రావడం గమనార్హం. దేశభక్తి ముసుగులో స్వార్థపరులు ప్రజలను ఎంతగా వంచిస్తారో, రాజ్యం దృష్టిని సైతం ఎట్లా మరల్చగలరో నిర్మోహమాటంగా రచయిత కథనంలోనూ, పాత్రల సంభాషణలోనూ తేటతెల్లం చేస్తాడు. పెట్టుబడిదారి వర్గం, భూస్వామ్య వ్యవస్థ, రాచరికం, అధికార వర్గాలు ఒకదానిపై ఒకటి పరస్పరం ఎంతగా ఆధారపడి ఉన్నాయో ఈ నవలలోని చాలా సంఘటనలు తెలియజేస్తాయి

... ... ...

నవలలోని ఒక ఘట్టం.

తనలా పులిలా బతకాలనుకుంటే ఏం చేయాలో కిరీటికి వాళ్ళ పెదనాన్న చెబుతాడు:

"మొదటిది గుండు దెబ్బకి దొరకకు. రెండోది ఎవరి బోనుకీ చిక్కకు. మూడోది మేక కాలికి మొక్కకు. ఇవి గుర్తుంచుకొని దివ్యంగా బతుకు!"

"జీవితంలో ఈత చాపలూ గడ్డితిళ్లూ తప్ప మరేది దొరకని గొడ్లలాంటి మనుష్యులు భూతదయా సోదర ప్రేమా జాలిగుండె సమతారాజ్యం ఇటువంటి వాటి గురించి మాయమాటలూ బీద అరుపులూ అరిచి అవే లోకంలో మంచివనే భ్రమలో మనల్ని ముంచేసి కనిపించని దారాలతో మనల్ని కట్టిపడేయడానికి నిత్యం ప్రయత్నం చేస్తుంటారు. అంచేత ఆ నిత్య ప్రచారానికి మన నెత్తుటినోళ్లు అప్పుడప్పుడు కట్టడిపోయే ప్రమాదం ఉంటుంది. మన మార్గం మన గమ్యం. భూతదయల మబ్బుల్లోనూ సోదర ప్రేమల సోగల్లోనూ మనకి కనిపించకుండా పోయిన మనం మర్చే మర్చిపోయే ప్రమాదం ఉంది. ఆ ప్రమాదంలోంచి మా రాజయోగి పెదనాయనగారు ఆ దినం పూర్తిగా బైటపడ్డారన్నమాట. వారు మెత్తని పులిలా కనిపిస్తూనే కోరల పులిగా వ్యవహరించి తీరాలనే నిశ్చయానికి జీవితంలో ఆ రోజున మరొకసారి వచ్చేరన్నమాట. అందుచేత, ఆ లచ్చియ్యమ్మని మాయచేసో మభ్యపెట్టో ఏదో విధంగా పరమ కిరాతకంగా చంపి తీరాలనే కృతనిశ్చయానికి వారు ఆ దినమే వచ్చేరని నేను తప్పక నమ్ముతున్నాను."

... ... ...

"చెట్లు కూడా ఏం జరుగుతుందోనని ఆకులన్నీ కళ్ళు చేసుకుని చూస్తున్న సందర్భం అది." ముగింపు దృశ్యంలో.. సంవత్సరాల తరబడి అణచివేతకు, దౌర్జన్యానికి గురైన లచ్చియ్యమ్మ రాజయోగిని కత్తి మొనలాంటి చూపుతో చూస్తుంది.

ఆమె అరుపుతో ఆమె చూపుతో ఆమె ఆదేశంతో ఆమె బిడ్డలాంటి ఒంటి కొమ్ము పశువు మిగతా వాటితో కలిసి అతన్ని చుట్టుముడుతుంది. అతడు చనిపోయిన తర్వాత ఒంటి కొమ్ము నుంచి నెత్తురు తీసి ఆమె బొట్టు పెట్టుకుంటుంది.

... ... ...

ఈ నవలకు సంబంధించి ప్రధానమైన విమర్శ చేసిన వారు వల్లంపాటి వెంకటసుబ్బయ్య. మరొక సందర్భంలో ఒక ఇంటర్వ్యూలో రావిశాస్త్రి గారు వెలిబుచ్చిన అభిప్రాయాలను ఈ సందర్భంగా ప్రస్తావిస్తున్నాను.

1982లో రాసిన 'రావిశాస్త్రి నవలలు ఒక పరిశీలన' వ్యాసంలో వల్లంపాటి వెంకటసుబ్బయ్య 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' నవలలోని లోటుపాట్ల గురించి తన అభిప్రాయాలను నిష్కర్షగా వ్యక్తం చేశారు.

'గోవులొస్తున్నాయి జాగ్రత్త'కు మరో పేరు 'గుర్రపు కళ్లెం': శ్రీశ్రీ 'ఋక్కులు'.. గేయంలో పేర్కొన్న కవితా వస్తువులను కథా వస్తువుగా నిరూపించటానికి రా.వి.శాస్త్రి రాసిన చివర నవల ఇది. "కానీ, 'గోవులొస్తున్నాయ్ జాగ్రత్త' అన్న పేరులోని తీవ్రత, వ్యంగ్యం 'గుర్రపు కళ్ళెం' అన్న అతని రెండవ పేరులో లేవు. ఈ కథకు మూడవ పేరు 'మరిడిమహాలక్ష్మి కథ'. ఈ పేరు నవలలోని విప్లవావగాహనను అపహాస్యంపాలు చేస్తోంది.

గోవులు సాధుత్వానికీ, అమాయకత్వానికీ, పీడిత వర్గానికి సంకేతాలు. అలాంటి గోవులు తిరుగుబాటు చేయటం ఈ నవలలోని కథావస్తువు. కానీ గోవులూ, అవి చేసిన తిరుగుబాటూ చివరి అధ్యాయాలలో మాత్రమే కనిపిస్తాయి. ముప్పాతికకు మించిన నవల రాజయోగి పెదనాయనగారు లచ్చియ్యమ్మను బలవంతంగా ఎత్తుకు రావటం, ఆమె కుటుంబాన్ని నాశనం చేయటం, అందుకు సంబంధించిన కేసు, దాన్ని తప్పించుకోవటానికి రాజయోగి ప్రయోగించిన ఎత్తులు, జిత్తులు వీటితో నిండిపోయింది. సాంకేతికంగా గోవుల తిరుగుబాటుకున్న ప్రాముఖ్యత దీనివల్ల తగ్గిపోయి నవలలో అల్లిక, నిర్మాణం (Structure) దెబ్బతిన్నాయి.

ఈ నవలలో గోవులను పీడిత వర్గానికీ, రాజయోగిని భూస్వామ్య వర్గానికీ సంకేతాలుగా భావించవచ్చు. గోవుల తిరుగుబాటు నాటికి మనదేశం బ్రిటిష్ సామ్రాజ్యంలో ఒక భాగం. అంటే మనదేశం సామ్రాజ్యవాదం ఉక్కుపాదాల కింద నలిగిపోతున్న కాలంలో ఒక చిన్న భూస్వామి మీద జరిగిన విప్లవం గోవుల తిరుగుబాటు. ఈ తిరుగుబాటుకు ఇంత ప్రాముఖ్యతనివ్వటం సిద్ధాంతపరంగా ఎంత మాత్రం ఆమోదయోగ్యం అన్నది వివాదాస్పదమైన విషయం. దీన్ని బ్రిటిష్ ప్రభుత్వ యంత్రాంగానికీ, రాజయోగికీ ఉన్న లాలూచీల దృష్టితో సమర్థించినా, గోవుల తిరుగుబాటుకు రా.వి.శాస్త్రి చూపించిన కారణం మాత్రం సరైనది కాదు. సాంకేతికంగా ఫ్యూడల్ భూస్వామ్య వర్గం మీద పీడితవర్గం తిరుగుబాటుగా కనిపిస్తున్న గోవుల తిరుగుబాటుకు రాజయోగి లచ్చియ్యమ్మను బలవంతంగా ఎత్తుకురావటం ప్రధాన

కారణంగా భావించవలసి వస్తోంది. ఒక ఆడదాన్ని ఒక భూస్వామి బలవంతంగా ఎత్తుకురావటం ఒక విప్లవానికి ప్రధాన కారణం కావటం గూడా సిద్ధాంతపరంగా సమర్థనీయం కాకపోవచ్చు. ఈ కారణాన్ని కాక సామాజికమైన ప్రజాపీడనను గోవుల తిరుగుబాటుకు కారణంగా చూపించి ఉంటే ఈ తిరుగుబాటుకు సార్థకతా, సిద్ధాంత బలమూ అబ్బేవి. ఈ నవలలో రాజయోగి ప్రజా పీడకుడుగా చిత్రించబడలేదని కాదు. కానీ ప్రజా పీడనకు కూడా అతడు లచ్చయ్యమ్మను ఎత్తుకు రావటమే కారణమన్నది గమనార్హమైన విషయం. అలాకాక గోశాల రాజకీయాలు గోవుల తిరుగుబాటుకు కారణమని అంగీకరిస్తే లచ్చయ్యమ్మ వృత్తాంతం నవలలో అంతభాగాన్ని ఆక్రమించటం 'నిర్మాణం' దృష్ట్యా సమర్థనీయం కాలేకపోతుంది.

'గోవులొస్తున్నాయి జాగ్రత్త'లోని ప్రధాన ఆకర్షణ కిరీటిరావు మాటకారితనం. అతని పద చిత్రాలు, వర్ణనాపద్ధతి విచిత్రమైనవి, విశిష్టమైనవి. కానీ తెలుగు వచన సాహిత్యానికే గర్వకారణమైన రా.వి. శాస్త్రి శైలి ఈ నవలలో వెర్రితలలు వేసిన లక్షణాలు బలంగా కనిపిస్తున్నాయని భావిస్తున్నాను. కిరీటిరావు మాటకారితనం, అందులోని వ్యంగ్యం గాడితప్పి వ్యతిరేక ఫలితాలు ఇచ్చే ప్రమాదం మాత్రం ఉన్నది. ఈ అనుమానం రా.వి. శాస్త్రికి కూడా రావడం వల్లనే కాబోలు వ్యంగ్యార్థాన్ని స్ఫురింపచేయటానికి అక్కడక్కడా వ్యాఖ్యానాలు చేశాడు. కథ చిన్నది కావటం చేత, కిరీటిరావు ఒక్క ఉపన్యాసమే మొత్తం నవల కావటం చేత రా.వి. శాస్త్రి, ఇతర రచనల్లోని స్పష్టత ఈ నవలలో తగ్గింది. కానీ ఈ నవలలో స్వాతంత్ర్యానంతరం కాంగ్రెస్ పార్టీ పతనం కావటానికి – స్వాతంత్ర్యానికి పూర్వమే ఎలాంటి కారణాలున్నాయో చూపించిన తీరు మాత్రం చాలా ప్రతిభావంతంగా, ఆలోచనా స్ఫోరకంగా ఉంది. రాజయోగి, కేశవరావుల కలయికను రా.వి.శాస్త్రి చాలా చక్కగా చిత్రించాడు.

కథా ప్రయోజనాలను మించి ఒక్కొక్కసారి రా.వి.శాస్త్రి రచన శైలీ ప్రధానం, శిల్ప ప్రధానం అయిపోవటం సాధారణ సంఘటన. అందుచేత కొన్ని రచనలు పాఠకుని బుద్ధిని తాకి ఆశ్చర్యపరుస్తాయే తప్ప మనసును పట్టుకోవు.

రా.వి.శాస్త్రి శైలికున్న మరొక బలహీనత వాచాలత (loquacity). అందుకు ముఖ్యమైన కారణం మాటల మీద, మాటల గారడీ మీద రా.వి.శాస్త్రి కున్న విపరీతమైన మోజు.

అందుచేత 'రాజు మహిషి' రాశిలో పెరిగింది. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త'లో పఠనీయత (readability) తగ్గింది. విశాఖ జిల్లా మాండలికాన్ని పుణికి పుచ్చుకున్న రా.వి.శాస్త్రి తన కవితాభిలాషనూ, ఉపన్యాస ధోరణినీ దానికి జోడించటం వల్ల అక్కడక్కడా సహజత్వం కూడా లోపించింది.

స్పష్టమైన సామాజికావగాహనతో, లక్ష్యశుద్ధితో రచన చేస్తున్న నవలాకారుడు రా.వి.శాస్త్రి. మానవ ప్రవర్తనను, సమాజంలోని వివిధ వర్గాల సంబంధాలను రా.వి. శాస్త్రిలాగా నిశితంగా పరిశీలించగల మరొక నవలాకారుడు మనకు లేడు. తనమీద బలంగా ఉన్న కాల్పనికోద్యమ ప్రభావాన్ని, వర్ణనా వ్యామోహాన్ని, భాషా చాపల్యాన్ని తగ్గించుకున్ననాడు రా.వి.శాస్త్రి తెలుగుభాష గర్వించ తగ్గ నవలను తప్పకుండా రాయగలడు."

ఇదీ వల్లంపాటి వెంకటసుబ్బయ్య అభిప్రాయం. (రా.వి. శాస్త్రి నవలలు– ఒక పరిశీలన వ్యాసం రచనా కాలం 1982. వల్లంపాటి సాహిత్య వ్యాసాలు వ్యాస సంపుటి అక్టోబర్ 1997)

... ... ...

ఈ నవల "పేదలెవ్వరూ ఇది చదువరాదు. చదివినచో వారు శిక్షలకు పాత్రులగుదురు"– కిరీటి రావు అనే హెచ్చరికతో ప్రారంభమవుతుంది. ఇందులో జనం గురించి ఒక మాట అంటాడు రచయిత.

"జనం ఎటువంటి వాళ్ళు? రాక్షసి బొగ్గులు లాంటివారు. వాటిని ఎంత తడిపినా అవి అంటుకున్నాయంటే అంటుకున్నా యన్నమాటే."

ఈ నవల గురించి 1989లో ఇచ్చిన ఇంటర్వ్యూలో ఇలా అన్నారు రావిశాస్త్రి.

"కిరీటిరావు చేత కథ చెప్పించాల్సి వచ్చింది... వాడిచేత చెప్పిస్తే తప్పుడు థీరీని ఎలా సమర్థించుకుంటున్నది తెలుస్తుంది అని చెప్పి వాడిచేత చెప్పించాను. దొంగ థీరీని ఎలా సపోర్టు చేసుకుంటారు... అని.

కథాకాలం 1917లో ప్రారంభమౌతుంది... అంటే... నాకు ఆ సొసైటీ.... ఫేడ్ అవుట్ అవుతున్నపుడు తెల్సు. 1920–29, 30, 31 అప్పటికీ ఆ సొసైటీ ఇంకా వుంది. అందుచేత ఆ ఫ్యూడల్ సొసైటీలో అన్నింటిని ట్రెస్ చేశా. ఆ కిరీటిరావు కొడుకు ఇప్పుడు ఇండస్ట్రీయలిస్టు. అందుచేత వాళ్ళ కోసం రాస్తున్నాడన్న మాట.

ఖద్దరు రాజకీయాల గురించి చెప్పానంటే... కొంచెంవాళ్ళని క్రిటిసైజ్ చేద్దామని ఉద్దేశం. వీళ్ళ గురించి చెప్పితే చాలు అల్లూరి తిరుగుబాటు గురించి చెప్పాల్సిన పనిలేదు. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త' అంటే ప్రజలే. అది కన్వీనెంటుగా వుండాలని అన్నాననుకోండి. ఆ స్టోరీకి ఆవిధంగా ఎండింగు లేకపోతే మరో ఎండింగు లేదు.

వర్ణించటంలో ఒకప్పుడు ఐడియా వుంటుంది. ఒకప్పుడు ఐడియా వుండదు. అవి కొన్నిచోట్ల... అవసరం కొద్ది వర్ణించానని అనుకుంటాను. అలాగే కొన్ని సిమిలీసు... రాసే విషయాన్నిబట్టి సిమిలి వాడాలి అని నేననుకుంటున్నాను. ఇందులో నేను అట్లా చేసి వుండకపోవచ్చు."

... ... ...

ఈ నవలలోని శైలీశిల్పాలు, పాత్ర చిత్రన, వర్ణనలు, సంభాషణలు, రచయిత కంఠస్వరం నూతన రచయితలకు నిత్య అధ్యయనాంశాలే. వర్తమాన, కొత్త రచయితలు తప్పనిసరిగా అధ్యయనం చేయాల్సిన రచయిత రావిశాస్త్రి. ఎందుకంటే వారికి చాలామంది రచయితలకు ఉన్న చాలా భ్రమలు, భయాలు, మొహమాటాలు, దాపరికాలు అస్సలు లేవు. అందుకే ఇంత నిక్కచ్చిగా ఇంత పచ్చిగా రావిశాస్త్రి ఇలా చెప్పగలిగాడు.

"మన రక్షణకి మర ఫిరంగిలుంచుకుని అవతలవాడికి అహింస బోధిస్తే వాడు మన మాట ఎన్నాళ్ళని నమ్ముతాడు? కొన్నాళ్లకైనా నమ్మడం మానేస్తాడు."

"మా కుటుంబాల్లో అందరూ కూడా ఆ విధంగానే చాలా మంచి రాజభక్తులుగా ఉండేవారు. మా నాయన గారొక్కరికే వెయ్యేనుగుల రాజభక్తి ఉండేదంటే మొత్తం మా భక్తి బరువు ఎంత ఉండేదో ఊహించుకోండి మరి! ఆ రోజుల్లో రాజభక్తి విషయంలో

ఇప్పట్లో దేశభక్తి విషయంలో లాగే మనవాళ్లంతా చాలా దిట్టంగా భీమ శక్తితో ఉండేవారు."

"దీనినిబట్టే నేను, అర్టుకీ ప్రజల జీవితానికీ ఉండవలసిన సంబంధం గురించి చక్కటి పాఠం నేర్చుకున్నాను. ఐక్క దుక్కిటెద్దుల జీవితంలా ప్రజల జీవితం చాలా కష్టాలతో కూడుకొని వుంది. (అది అలా లేదనుకొని మనం వ్యవహరించినట్లయితే మనం పెద్ద పొరపాటు చేసినవాళ్ళం అవుతాం.) అందుచేత నిజమైన ఆర్టు ప్రజల్ని మైమరపించేదిగా ఉండాలే కాని వార్ని రెచ్చగొట్టేదిగా మాత్రం ఉండకూడదు. ఇది నా సిద్ధాంతం."

"వారు మాత్రం నిశ్చలంగా నిర్భయంగా నిల్చున్నారు. తుఫానొస్తే కొండమీద చెట్లు కదుల్తాయి కాని కొండ కదలదు కదా! అలాగన్నమాట. (కాని కొండమీది చెట్లతోపాటు ఒక్కోప్పుడు కొండలు కూడా మాయమవొచ్చునని మనం తెలుసుకొని ఉండడం మంచిది. నా చిన్నతనంలో మా ఇంటి పక్కని గర్వంగా ఓ కొండ ఉండేది, అది ఇప్పుడు లేదు. జనం దాన్ని తవ్వేసేరు)."

"ఆవిడ అందానికి మా రాజభోగి పెదనాయనగారు పరవశించిపోయేరట. మరింక చెప్పేదేముంది? ఆస్తిలాగే అందాన్ని స్వంతం చేసుకొనే సహజ స్వభావంగల జాతి మనజాతి. అందాన్ని ప్రేమించి పూజించి అస్వాదించి, అనుభవించి ఆనందించకుండా ఉండలేం మనం. ఆ విషయంలో మా రాజభోగి పెదనాయనగారు మనకంటే భిన్నులు కారు, మనకంటె ఘనులు."

"పాపం అని తెలిసి కూడా పాపం చెయ్యక తప్పకపోవడమే మానవ జీవితంలో ట్రాజెడీ! (ఇలా మనం థీరీలు చెప్తూండాలి. ఫిలాసఫైజ్ చేస్తుండాలి. పెదిమలు విరుస్తూండాలి. "ప్చ్ ప్చ్" అంటూండాలి!) గోవులంటే నాకు కూడా ఎంతో ప్రేముందని ముందే చెప్పేన్నేను. కాని, గోవులు గోవుల్లా ఉండాలి. అవి పులుల్లాగ ప్రవర్తిస్తే పులులు వాటిని చంపవలసి ఉంటుంది మరి! ఏం చేస్తాం (తిరుగుబాట్లని మనం అణిచేసినప్పుడు మనం ఇటువంటి ప్రచారమే చెయ్యాలి – మనమే పులులం అన్నమాట మాత్రం దాచిపెట్టి!)."

"మనది దొంగల రాజ్యం, నువ్వు స్వయంగా దొంగతనం చెయ్యకపోవచ్చు. కాని నీ తండ్రో తాతో చేసేడు. ఇప్పుడు నువ్వు కళ్లు మూసుక్కూర్చుంటే నీ తాబేదార్లు నీకు దొంగతనాలు చేసి తెచ్చిపెడుతున్నారు. ఏదేమైనా అందరం మాంసం తింటున్నవాళ్లమే. మనం మాంసం తింటూ కోడి మెడ నులిమేవాణ్ణి, మేకతల నరికేవాణ్ణి చూసి అసహ్యించుకు తిట్టడం చాలా పొరపాటు. అయితే అలా పైకి తిడుతూన్నట్టు కనిపించడం జనాన్ని మోసం చెయ్యటానికే గాని నిజంకాదు అని మీరనుకున్నట్లయితే అందుకు నేనొప్పుకుంటాను. మన మంచికి మనం ఇతరుల్ని మోసం చెయ్యవచ్చు. అవునది రైటే! క్రౌర్యం మోసం కవల పిల్లలు కదా మరి!"

"మన వీరుల్ని మనం స్మరించు కున్నట్టే, మన కవుల్ని మనం సన్మానించుకున్నట్లే, మన కుక్కల్నీ నక్కల్నీ మన డేగల్ని గెద్దల్ని మనం పోషించుకొంటూ ఉండాలి. బహూకరించుకొంటూ ఉండాలి. తులసివనాల్లో మన గంజాయి మొక్కల్ని మనం పెంచుకొంటూ ఉండాలి! మనం శ్రీరామ చంద్రుల్లాంటి వాళ్లం అయినా అవకపోయినా సరే మన ఆంజనేయుల్లు మాత్రం మనకి ఉంటూ ఉండాలి."

... ... ...

ఈ నవలలో కిరీటి అనుకునే ఒక మాట గురించి చెప్పుకోక తప్పదు. నిజానికి అది రచయిత మాటే! లచ్చయ్యమ్మ ఏడుపు గురించి చెపుతూ రచయిత అసలు ఆమె ఏడుపు ఎలా ఉందో చెబుతాడు.

"నేను కూడా నా మంచంమీద వాలేను, కాని సముద్రపు హోరులా ఆ ఏడుపు నన్నెంతకీ వదల్లేదు. ఆ ఏడుపు సన్నగా శ్రావ్యంగా, పరీక్ష తప్పిన కాన్వెంట్ గరల్ దుఃఖంలాగా, అయ్యేఎస్ బావని పెళ్లాడ లేకపోయిన ఎమ్మే మరదలి ఏడుపులాగా లేదు. అది చాలా భయంకరంగా ఉంది. తొడలు తెగిన ఆడ ఏనుగు అడవిలో అలమటించినట్టుగా ఉందది. కొండలమీద కుంభవర్షం కురిసినట్టుగానూ, కొత్తనీటి జోరుతో కొండవాగులు కొట్టుకుపోతూన్నట్టుగానూ ఉందది. రాత్రివేళ ఏటిగాలి తాకిడికి తోటలేడ్చినట్టుగా ఉందది. కంపించే ముందు భూమి అరిచినట్టుగా ఉందది. అది మనల్ని ముంచే.. ఏడుపులా ఉంది. అలా ఏడవగలిగిన మనిషిలో మంచుకొండలు ఉండి ఉండాలి. లేదా, మహా సముద్రాలు దాగి ఉండాలి?

ఎంతకీ తరగని ఆగని ఆ ఏడుపు అలా చీకట్లో వింటూంటే నేను భయంతో మునిగిపోయేను. నా వెంట్రుకలన్నీ నిక్కబొడుచు కున్నాయి. నా గుండెలు మెయిలింజనుగా మారిపోయేయి. అలా ఏడవగలిగిన మనిషి, కన్నీళ్లని కంచుబాంబుల్లా కురిపించగలదనీ, కంటి నీటితో కార్చిచ్చు రగిలించి రేపగలదనీ నాకు అస్పష్టంగా అనిపించింది. అరిచేత్తో గుండెల్ని పట్టుకున్నట్టుగా అరిచేతుల్ని గుండెలమీద వేసుకొని.. ఆ భయంతోనే నేను శవంలా నిద్రపోయేను."

... ... ...

ప్రవాహ వేగం, లోతు, విస్తృతి నిండిన శైలి, పదునైన వ్యంగ్యంతో కూడిన కంఠస్వరం రావి శాస్త్రి రచనలలోని ప్రత్యేకతలని అందుకే కాబోలు విమర్శకులు మెచ్చుకుంటారు.



---

**"ఎదిగీ వోళ్ళంతా ఎలాగ్గ ఎదగతన్నారండి?**

**గోస్తంచి తొల్త ఎలాగుంటదండి? నేలంట కాలీగ్గ సతికల బడుంటదండి. మరింక అందల సిట్టో, తవుడో, బియ్యంవోం బంగారవోం ఏస్తే అది లెగిసి నిలబడిద్ది గదండి?! ఏరోళ్ల సొమ్ము ఒడసీసుకుని (పడవేసుకుని) మా పెసిడెంటుగోడు చరిగ్గ ఆలాగ్గె బస్తాలాగ్గ బలిసిపోనాడండి. కొండలాగ్గ లెగిసిపోనాడండి...**

**...సొమ్ములు పోడంవేటీ, బూదేవత పోడంవేటి అన్చెప్పి మీకిదంత కతలాగా అవుపించొచ్చండి. కాని మా దిక్కంట శానామందిరికి ఇలాటియి నిచ్చె కతలండి.**

**-సొమ్ములు పోనాయండి**



# 'రావి' పంచిన సాహితీ విలువలు

డా.కాళ్ళకూరి శైలజ

"శతాబ్దాల కిందట రావి గౌతముని ప్రభావితం చేసి అతణ్ణి బుద్ధుని చేసింది. ఈ శతాబ్దంలో ఇంకొక 'రావి' తెలుగు వాళ్లను ప్రభావితం చేసి ప్రబుద్ధుల్ని చేస్తోంది". ఈ మాటలు మహాకవి శ్రీశ్రీ మహా కథకుడు రావిశాస్త్రి గురించి చెప్పడం వస్తు, ప్రతిబింబ న్యాయాన్ని ఎంతో సహజంగా, సాంకేతికంగా, సశాస్త్రీయంగా నిరూపించడమే.

తెలుగు భాష అందం దాన్ని పలకడంలోనే ఉంది. మానవుని నోటి కుహరంలో అతి సున్నితమైన భాగాలను కదిలిస్తూ పలికేది ఈ భాష అంటారు భాషాశాస్త్రజ్ఞులు. పద్యం, గేయం, గీతం, వచనం ఏ సాహితీ రూపానికైనా అనువుగా ఒదిగిపోతుందంటారు సాహిత్యకారులు.

'పద్యం, అవధానం మాకే సొంతమైన ప్రక్రియలు' అంటూ మురిసిపోతారు భాషాభిమానులు. అలాంటి మన భాషకు 20వ శతాబ్దంలో ఆధునిక సాహితీ పోకడలను అందించి, మనసును, బుద్ధిని ఇచ్చి, ప్రజాప్రయోజన బాట పట్టించిన సాహితీవేత్తలు చలం, శ్రీశ్రీ, రావిశాస్త్రి అని చెప్పుకోవచ్చు.

వీరు సామాన్యులను 'మాన్యులు'గా చేసి పీడన, దోపిడి వంటి సామాజిక రుగ్మతల ప్రభావాన్ని గ్రంధస్తం చేశారు.

పరాయి పాలన, ప్రపంచ యుద్ధాలు, స్వాతంత్ర్య పోరాటం, దేశ విభజనల నేపథ్యంలో ఆర్థిక, రాజకీయ సంక్షోభం నెలకొన్న కాలమది. కుల, మత, వర్గ విభేదాలు సమాజాన్ని అతలాకుతలం చేస్తున్న సమయం. పై ముగ్గురు సాహితీమూర్తులు ఈ వివక్షను నిరసిస్తూ తమ రచనలు సాగించారు. తెలుగు వచన రచనలో గురజాడ అభిలషించిన ప్రజాశ్రేయస్సు, చలం చేసిన మనోవిశ్లేషణ రెండూ కలిసిన సాహిత్యం రావిశాస్త్రి గారిది.

రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారి జీవితంలో చదువు, సైనిక నేపథ్యపు ఉద్యోగం రెండూ రెండు మజిలీలు. 1946 లో 'లా' పట్టా పొందాక వ్యక్తిగా ఆయన ఆలోచనా విధానంలో సామాజిక స్పృహ నిండిపోయింది. శాస్త్రి గారి రచనా సౌధానికి సమాజమే పునాది. పేదల వెతలకు గల కారణాల విశ్లేషణ దానిపై కట్టిన నిర్మాణం.

'అల్పజీవి' నవల రాసేటప్పుడు పిరికివాడైన సుబ్బయ్య పాత్ర ద్వారా రావిశాస్త్రి గారి మానసిక ప్రపంచంలో పెనుమార్పు సంభవించి ఉండవచ్చు. ఆ నవలకు ఆయనే రాసిన 'చివరి మాట'లో, "భయానికి, మంచికి పొందిక లేదు. పిరికివారు ఎవరూ కూడా మంచి వారు కాజాలరు. మంచికి నిలబడలేరు. మంచిగా ఉండాలంటే గుండె నిబ్బరం చాలా ఉండాలి", అన్నారు. ఈ సూత్రానికి రావిశాస్త్రి గారు జీవితాంతం కట్టుబడ్డారు. తన రచనల్లో అత్యంత కీలకమైన పాలక, పోలీసు, న్యాయ వ్యవస్థలు సామాన్య ప్రజలను ఎలా మోసగిస్తున్నారో విస్తృతంగా రాసారు.

రావిశాస్త్రి అట్టడుగు ప్రజల సమస్యలను జవజీవాలున్న పాత్రల ద్వారా చిత్రించారు. వారి నిత్య జీవన సంఘర్షణలోంచే కథలను మలిచారు. పేదరికం పుట్టుకతో జరిగే 'ఏక్సిడెంట్' కాదు. స్వతంత్ర దేశంలోని రాజకీయ, సామాజిక, భూస్వామ్య శక్తులు కావల్సిగా (వాంటెడ్‌గా) తయారుచేసిన బలిపీఠం పేదరికం అని సాక్ష్యాధారాలతో నిరూపించిన క్రాంతివాది రావిశాస్త్రి.

ఆరు చిత్రాలు, ఆరుసారా కథలు, ఆరు సారో కథలు, మరో ఆరు చిత్రాలు, కలకంఠి, ఋక్కులు, గోవులొస్తున్నాయి జాగ్రత్త, బాకీ కథలు, రావిశాస్త్రి కథలుగా వెలువడిన కథా సంపుటాల్లో రావిశాస్త్రి పేదరికం మనిషిని పుట్టుక నుంచి మరణం దాకా ఎలా దొలిచేస్తుందో, ఎంత బోలుగా మారుస్తుందో సవివరంగా తెలియచెప్పారు. 'స్వరాజ్యం సురాజ్యాన్ని స్థాపిస్తుంద'న్న సూక్తి కార్యాచరణ కొచ్చేసరికి లుప్తమైందని, 'ప్రజాస్వామ్యం శ్రేయో రాజ్యాన్ని తీసుకొస్తుంద'న్న ఆశల పంటను మింగే మిడతల దండు రాజకీయ నాయకులేనని తేల్చి చెప్పిన సత్యవాది.

రావిశాస్త్రి గారి వ్యక్తిగత జీవితం ఎంత నిబద్ధత, నిర్భీతితో

సాగిందో ఆయన రచనలు అంతే స్పష్టంగా, ద్వంద్వ ప్రవృత్తికి తావు లేకుండా సాగాయి. విరసంలో పనిచేసినా, మానేసినా, క్రిమినల్ లాయర్‌గా రిక్షాపై తిరిగినా, సాహిత్యకారునిగా కలం పట్టి తెలుగు వాఙ్మయంలో 'అల్పజీవి'కి పట్టాభిషేకం చేసినా అన్నిటా, అంతటా ఆయన దృక్కోణం అనితర సాధ్యమైన లోతుగా, విశిష్టంగా ఉంటుంది. ఆయన సమస్యల్ని మాత్రమే ప్రస్తావించారనుకుంటే పొరబాటే. పరిష్కారాలను కథానాయకుడి పాత్రతోనో, మరో మెలోడ్రామా ముగింపుగానో చూపించక ఐకమత్యంతో పౌరులు తమకు తామే సాధించుకోవాలని, సాధించుకోగలరని తన రచనల ద్వారా ఉద్బోధించిన సామాజిక శాస్త్రవేత్త రావిశాస్త్రి.

రావిశాస్త్రి గారి కథలన్నీ దృశ్య కావ్యాలే. కథనంలో ఏంబియన్స్ (పరిసరాల)ను ప్రత్యక్షంగా చూపించే పదునైన వర్ణనలు ఆయన ప్రత్యేకత. చూడటమే కాదు, ఆ శబ్దాలు, ఆ వాసనలు, రుచులు సైతం పాఠకులు స్వయంగా అనుభూతి చెందేలా చేయడం ఆయన కథా సంవిధానంలో శక్తివంతమైన ఎత్తుగడ. 'వర్షం', 'మోసం', 'మాయ'లాంటి చిన్న కథానికల్లో, రోజులో కొన్ని గంటల పాటు జరిగే సంఘటనలను సైతం మనసుకు హత్తుకునేలా రాసారు. సంభాషణల క్రమంలో కొన్ని ప్రశ్నలు, గమనింపులు, వ్యాఖ్యలు ఆ పాత్రల భావోద్వేగాలకు రూపాన్నిస్తాయి.

ఆదర్శవాదులు దేశ ప్రగతి గురించి చెప్పే గణాంకాల వృక్షానికి గొడ్డలిపెట్టుగా సమాజంలోని కుతంత్రాలను రావిశాస్త్రి బహిర్గతం చేశారు. పోలీసు(రక్షణ) వ్యవస్థ, న్యాయ వ్యవస్థ అనే రెండు కాళ్ళ మీద నిలవాల్సిన సమాజం ఎలా కాళ్ళు లేని అవిటిదయ్యిందో నిరూపించిన సునిశిత విమర్శనాస్త్రం.

మానవ సమాజ పరిణామంలో సంపదను సృష్టించడం, దాన్ని కొలిచేందుకు 'డబ్బు' మారకద్రవ్యంగా వాడుకలోకి రావడం తొలినాటి ఘటనలు. ఆ తర్వాత వచ్చిన మరో మార్పు పాలనాధికారం. ఈ రెండూ ఎంతటి రక్తపాతాన్ని సృష్టించాయో తెలుసుకున్న కొద్దీ ఆశ్చర్యమే. పొగాకు, మద్యం ఒకదాన్నొకటి బలపరచుకొని భయంకరమైన క్యాన్సర్‌కు కారణమైనట్టు డబ్బు, పాలనాధికారం సగటు మనిషిని హాయిగా జీవించలేని విధంగా చేసాయనడంలో సందేహం లేదు. ఆర్థిక అసమానతలు న్యూనతాభావాన్ని పెంచుతాయి. అధికార మదం సాటి మనిషిని పీడించే దౌర్జన్యం, దుర్మార్గంగా పరిణమిస్తుంది. ఈ రెండింటి విష పరిణామాలను రావిశాస్త్రి గారు తన కథ, నవల, నాటక ప్రక్రియల్లో ప్రతిపాదించి చర్చించారు. స్వతంత్రం వచ్చిన ఇరవై ఏళ్లకే స్వదేశీ పాలకులు ఎంత నిర్లజ్జగా బహిరంగంగా దోపిడీకి ఒడిగట్టారో ఆయన కథల్లో తెలుస్తుంది.

రావిశాస్త్రి న్యాయస్థానం బయటా, లోపలా నిరుపేద ప్రజల పక్షాన నిలిచిన నిజమైన అభ్యుదయవాది. ఒక లాయరుగా అహరహం బీదల ఇక్కట్లు చూడటం వలన అధికారుల లంచగొండితనం, పోలీసుల కపటం, దళారీల దురాశలను బయటపెట్టారు.

ఆయన వ్రాసిన 'అగ్గిపుల్ల' కథలో డబ్బుండి, చదువుకుని, ప్రభుత్వాధికారిగా ఉన్న వాళ్లు పెట్టే 'సర్కారు మొహం', 'దొర మొహం', 'గొప్ప మొహం', 'ప్రభువుల మొహం' గురించి చదివి తీరాలి. ఆ ముఖంలో, "రోడ్డు సెన్స్ లేని వెధవలు! ఏమిటీ కంపు? ఏమిటీ కుళ్ళు? ఏమిటి ఈ దేశం? ఇక్కడ నేను ఉండడం అనుకున్నట్టుగా...కోపం, క్రౌర్యం, అసహ్యం, ఆశ్చర్యం, జుగుప్స ఇంపేషన్స్‌తో సెల్ఫ్ పిటీ వగైరా అన్నీ కనిపిస్తాయి" అంటారు. ఈ మొహాలు మనకిప్పటికీ అడుగడుగునా కనబడుతూనే ఉంటాయి. ఆర్థిక అసమానతలు, సామాజిక అంతరాలు మరింత వ్యవస్థీకృతం ఐపోయాయి.

రావిశాస్త్రి గారి కథల ప్లాట్‌ను నేటి కార్పొరేట్ సంస్కృతికి, రాబోయే కృత్రిమ మేధ చేయగల కృతకమైన 'మానిప్యులేషన్స్'కు సైతం అన్వయించుకోవచ్చు. అంతగా ఆయన మానవ సహజ బలహీనతల్ని చిత్రించారు. స్వలాభం కోసం నేరాలను నిస్సంకోచంగా చేసే బడాబాబులకు వంత పాడే పాలక వర్గం ఒకపక్క, వారిని రక్షిస్తూ సగటు పౌరుని ప్రాథమిక హక్కులను కాలరాచే రక్షణ వ్యవస్థ మరో పక్క. ఈ దిగజారుతున్న విలువలకు రావిశాస్త్రి కథాకథనం సరిగ్గా సరిపోతుంది. అందుకే రావిశాస్త్రి గారి రచనలు నేటికీ ప్రాసంగికత కలిగి ఉంటాయి.

'వేతనశర్మ'లో వ్యవస్థలో లోపాలు 'మధ్యతరగతి'ని సృష్టించాయని చెప్పారు. అలనాటి మధ్యతరగతి ఈనాటి వినియోగ దారులే! ఆర్థిక వ్యవస్థకు మూలస్తంభం వీళ్ళే ఐనా most exploited కూడా వీరే!

'మూడు కథల బంగారం'లో బంగారు బాబు మంచిచెడుల ఘర్షణకు గురై, ఎలా మారిపోయాడో చదివితే ఈనాడు తక్కువకాలంలో సంపన్నులౌతున్న వారిలో (neo and instant rich) దేనికీ వెనుకాడని ruthlessness చోటు చేసుకుంటున్న వైనం అర్థమౌతుంది.

కమ్యూనిస్ట్ భావజాల ప్రభావంతో విప్లవవాదిగా, సమస్యా పరిష్కారం వైపు సత్వరం సక్రమంగా ప్రయాణం చేయాల్సిన అవసరం గురించి ఆయన నొక్కి చెప్పారు. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త', 'పిపీలికం' ఇత్యాది కథల్లో ఈ సామూహిక ప్రగతిశీల ప్రయాణపు పూర్తిస్థాయి స్వరూపాన్ని చూస్తాము. 'ధర్మం', 'న్యాయం' అనేవి నైరూప్య సిద్ధాంతాలు కావనీ, పౌరులందరు సమిష్టిగా, సమైక్యంగా మెలకువతో దోపిడీదారులను గుర్తించి ఏరివేస్తేనే తప్ప సాధించలేని లక్ష్యాలనీ రావిశాస్త్రి గారి రచనలు తెలియజేస్తాయి.

ఈనాటి రచనల్లో, కళారూపాల్లో కంఫర్ట్ జోన్ వదిలి బయటకు రాని రాజీ ధోరణి కథలు, నోస్టాల్జియా కథలు, తీవ్రమైన పని ఒత్తిడి నుంచి బయట పడేందుకు హాస్యం, మితిమీరిన శృంగారం, క్రైమ్ జోనర్లో కథలు వస్తున్నాయి. కథానాయకుడు ఎదురులేని నాయకుడై, తన బాహుబలంతో అన్యాయాన్ని ఎదిరించినట్టు చూస్తూ ఉంటాం. ఇవేవీ సమస్యా పరిష్కారానికి, భావి తరాలను ప్రభావితం చేసేందుకు ఉపయోగపడవు.అన్నది సత్యం. రావిశాస్త్రి గారి కథలేవీ నేల విడిచి సాము చేయలేదు.

ఈ తరం రచయితలు మరింత సూక్ష్మ పరిశీలనతో రావిశాస్త్రి గారు వేసిన బంగారు బాటపై నడిచే సత్తా గల రచనలు చేయగలిగితే అదే తెలుగు సాహిత్యం రావిశాస్త్రి గారికి ఇచ్చే ఘనమైన నివాళి.



**"రచయిత ఏ మంచికి హాని చేస్తున్నామో, ఏ చెడుకి ఉపకరిస్తున్నామో చూసుకోవాలి. మంచికి హానీ, చెడుకి సాయమూ చెయ్యకూడదు." - రావిశాస్త్రి**

# లైంగిక వైవిధ్యాలను అర్థం చేసుకుందాం



హిజ్రా సమూహం సంఘటితంగా ఉంటుంది. అయితే ఇతర ట్రాన్స్‌జెండర్ల పోరాట సామర్థ్యం మాటేమిటి? ట్రాన్స్‌జెండర్ సమూహం ఈ సమాజంలోని కులాన్ని, వర్గాన్ని అర్థం చేసుకునే మార్గాలు ఏమిటి?

హిజ్రా సమాజం వెలుపల, ట్రాన్స్‌జెండర్ వ్యక్తుల జీవితాలు ప్రాథమికంగా రెండు విషయాల ద్వారా ప్రభావితమవుతాయి: ఒకటి కుటుంబ అంగీకారం లేదా తిరస్కారం, మరొకటి అందరినీ ప్రభావితం చేసే కులం, వర్గం, వైకల్యం, ప్రాంతం, మతం వంటి నిర్మాణాలు. పెళ్లిళ్లు అయిపోయో, లేదా మరేవైనా కారణాల చేతో తమ కుటుంబాలను విడిచిపెట్టలేని ట్రాన్స్‌జెండర్ మహిళలు తమ జెండర్ మారలేరు, హిజ్రా వ్యవస్థలో చేరలేరు. కుటుంబాలలో పెరిగిన ఇంటర్‌సెక్స్ పిల్లలు ఒకవేళ వారి కుటుంబ సభ్యులు అర్థం చేసుకొని వారిని అంగీకరించినప్పటికీ, సమాజం, వైద్య వ్యవస్థలను ఎదుర్కోవడంలో వారు చాలా ఇబ్బంది పడతారు. ఎందుకంటే ప్రతి ఒక్కరూ అటు మగ శరీరాన్నో లేదా ఆడ శరీరాన్నో కలిగి ఉండాలని లోకం ఆశిస్తుంది.

ట్రాన్స్‌జెండర్ పురుషులు సమాజంలో కలవడానికి మరింత ఇబ్బంది పడతారు. సమాజం దృష్టిలో వాళ్లు స్త్రీలు. తమను తాము పురుషులుగా గుర్తించుకుని, సామాజికంగా స్త్రీ నుండి పురుషునిగా మారడం కష్టంగా ఉంటుంది. తరచుగా వారు కుటుంబంలో మరింతగా పరిమితం చేయబడతారు. ఎందుకంటే మన పితృస్వామ్య వ్యవస్థ ట్రాన్స్‌జెండర్ పురుషులను స్త్రీలుగా, బాలికలుగా చూస్తుంది. అందువల్ల పితృస్వామ్య వ్యవస్థను, కుల స్వచ్ఛతను కొనసాగించడానికి కుటుంబాలు తరచుగా వారిని తమ నియంత్రణలో ఉంచుకుంటాయి. దీనివల్ల ట్రాన్స్‌పురుషులు ట్రాన్స్‌మహిళలు చేసే విధంగా ఇంటిని వదిలి వెళ్లి జీవించడం, వారి లింగ గుర్తింపును వ్యక్తపరచడం దాదాపు అసాధ్యం. చాలా మంది ట్రాన్స్‌పురుషులు ఇంటి నుండి పారిపోయి ఈ ఉక్కపోతను తప్పించుకున్నప్పటికీ, ట్రాన్స్‌వుమెన్ లేదా హిజ్రాల కంటే మేము మా ఇళ్ల వెలుపల తక్కువగా కనిపిస్తాము. అలా విడిచిపెట్టి వచ్చిన వాళు సంబంధాలు ఏర్పరచుకోవడం, సమూహాన్ని నిర్మించుకోవడం మరీ అరుదు.

అయితే, పితృస్వామ్య స్వభావం భిన్నంగా ఉండి, ట్రాన్స్‌పురుషుల కంటే ట్రాన్స్‌స్త్రీలు సామాజికంగా అణచివేయబడిన ప్రదేశాలలో, వాస్తవం దీనికి విరుద్ధంగా కనపడుతుంది: సమాజంలో ట్రాన్స్‌పురుషుల కంటే ఎక్కువ మంది ట్రాన్స్‌మహిళలు ఆంక్షలున్నాయి. కానీ అది పెట్టుబడిదారీ వ్యవస్థ, మనలాంటి భూస్వామ్య వ్యవస్థ కాదు. కాబట్టి అణచివేత రూపం పెట్టుబడిదారీ. మన భూస్వామ్య వ్యవస్థ లాగా స్త్రీలకు ఏమి చేయాలో, ఏమి చేయకూడదో చెప్పరు, నిబంధనలను ఉల్లంఘించినందుకు శారీరకంగా శిక్షించరు. అమెరికాలోని స్త్రీలకు వివిధ రకాల ప్రవర్తనల మధ్య "ఎంపిక" ఇవ్వబడుతుంది. పురుషుల

ఇంటర్వ్యూ

# విప్లవోద్యమాల పరిణామాత్మక గుణాత్మక మార్పుల నేపథ్యంలో తెలుగు నవల

**అల్లం రాజయ్య**

**21. కొలిమంటుకున్నది నుంచి అంటరాని వసంతం దాకా విప్లవ నవలాశిల్పం ప్రయాణాన్ని ఎలా విశ్లేషిస్తారు?**

జ. విప్లవోద్యమ నవల పరిణామ క్రమంలో వస్తువుతోపాటు శిల్పం గురించి లోగడ కొంతమేరకు చర్చించాం. ఇల్యా ఎలెన్ బర్గ్ రచయితా - శిల్పమూ అనే తన పుస్తకంలో నవల రచనకు సంబంధించి వివరంగా చర్చించారు. నవలలోని అన్ని అంగాల సమగ్ర చిత్రనే శిల్పంగా పేర్కొన్నారు. నవలలో ఉండే అంగాలు వస్తువు, స్థలకాలాలు, సంఘటనలు, పాత్రలు, వాతావరణం, పరిసరాలు, నవలకు సంబంధించిన గత వర్తమానాల చరిత్ర, భాష, రచయిత దృక్పథం - తగిన భావోద్వేగాలు నవలలో సమతుల్యంగా నిర్వహించడం శిల్పం అన్నారు. ఇలాంటి సామర్థ్యం నిరంతర అధ్యయనం, అభ్యాసం ద్వారానే సాధ్యమన్నారు. నిజానికి విప్లవ నవల వస్తువు, శిల్పం, భాష తదితర అన్ని విషయాల అధ్యయనం 1967 నక్సల్బరీ విప్లవోద్యమం నుండి మొదలైంది. ఎందుకంటే మొట్టమొదటి సారిగా భారతీయ సమాజాన్ని అర్ధవలస అర్ధభూస్వామిక సమాజంగా, ప్రధాన వైరుధ్యం అశేష పీడితవర్గానికి భూస్వామ్యానికి మధ్య అని గుర్తించడం - శత్రువుకు బలహీన ప్రాంతాలైన గ్రామసీమల నుండి విప్లవోద్యమాలను నిర్మించి - పట్టణాలను ఆక్రమించి కార్మిక కర్షక నాయకత్వంలో నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని జయప్రదం చేయడం లక్ష్యంగా ఉన్న విప్లవోద్యమంలో భాగంగా నవల ఆరంభమైంది.

శ్రీకాకుళ అటవీ ప్రాంతంలో విప్లవోద్యమం బుగతలకు వ్యతిరేకంగా ఆరంభమయ్యింది. ఆదివాసీ కళారూపాలను మెరుగుపరిచి విప్లవోద్యమ పురోగమనానికి జముకుల కథలాంటివి ఆరంభమయ్యాయి... అలాంటి సన్నివేశం, నేపథ్యంలో భూషణం 'కొండగాలి' నవల రాశాడు. వస్తువు ఆదివాసీ జాతాపులది కనుక ఇతర మైదాన ప్రాంత ప్రజలకు ఇలాంటి వీరోచిత పోరాటాన్ని చెప్పాలనే లక్ష్యంతో ఈ నవల రాశారు. కనుక కొండగాలి శిల్పం - ఆదివాసీ వారేచర్ పద్ధతి కొంతా - అప్పటికి వచ్చిన నవల శిల్పంలో కొంత భాగంలో నడిచాయి. రచయిత చెప్పవలసిన విషయాలు సరళమైన భాషలో - సంభాషణలు ఆదివాసీ యాస, భాషలో రాశారు. అప్పటికి వచ్చిన నవలల శిల్పంలో కాకుండా - జానపద వీర గాథలాగా నవల

---

పితృస్వామ్య ప్రయోజనాలకు ఉపయోగపడే విధంగా వారు ప్రవర్తిస్తేనే సామాజిక ఆమోదం పొందుతారు.. అమెరికాలోని పెట్టుబడిదారీ పితృస్వామ్యానికి, భారతదేశంలోని భూస్వామ్య పితృస్వామ్యానికి మధ్య ఉన్న తేడా ఇదే.

ఏదేమైనా, జెండర్ న్యాయం కోసం జరిగే అన్ని ఉద్యమాలు ప్రపంచంలో రెండు సగాలను గుర్తిస్తాయి. ఒక సామాజిక వర్గం పురుషులు, మరొక సామాజిక వర్గం మహిళలు ఉన్న ప్రపంచం "సహజమైనది" అనే ఆలోచనను ఎక్కువగా అంగీకరిస్తాయి. స్త్రీవాద ఉద్యమాలు చాలా మటుకు ఈ వర్గాలను అంగీకరించి, ఈ వర్గాల మధ్య సమానత్వం కోసం అడుగుతున్నాయి. అయితే, కులాల మధ్య "సమానత్వం" కోసం మాత్రమే పోరాడలేమని చెప్పిన డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ నుండి మనం ఒక సందేశాన్ని తీసుకోవాలని నేను భావిస్తున్నాను. అంబేద్కర్ మొత్తం కుల వ్యవస్థను నిర్మూలించవలసి ఉంటుందని, అప్పుడే సామాజిక సమానత్వం ఉంటుందని బలంగా సిద్ధాంతీకరించారు. అంతేకాక కుల నిర్మూలన జరగాలంటే, మొదట ప్రస్తుత వ్యవస్థలో కుల అసమానత లేనట్లు నటించకూడదు. తక్షణ ప్రయత్నంగా ఒకరు కులాలను గుర్తించాలి, మరొకరు కులాల మధ్య సామాజిక ఆర్థిక వ్యత్యాసాలను తగ్గించడానికి కృషి చేయాలి. కానీ దీర్ఘకాలంలో సమాజాన్ని కృత్రిమంగా కులాలుగా విభజించే మొత్తం వ్యవస్థను నాశనం చేయడమే లక్ష్యంగా పెట్టుకోవాలి.

లింగం విషయంలో కూడా అదే పని చేయాలని మనం ఆలోచించగలమా? చాలా మంది ఒప్పుకోరు. ఎందుకంటే కులం అనేది చాలా స్థానీయమైన భారతీయ సమస్య అని భావిస్తారు. కాబట్టి ఇది సామాజిక నిర్మాణమని, జీవసంబంధమైనది కాదని అందరికీ స్పష్టంగా అర్థమవుతుంది. అయితే జాతి, లింగం కూడా సామాజిక నిర్మాణాలే. ఉపరితల జీవలక్షణాలైన జననేంద్రియాలు, చర్మం రంగు, ముఖలక్షణాలు మొదలైన వాటి ఆధారంగా వర్గీకరణలు చేశారు. ఈ ఉపరితల లక్షణాలకు లింగ, జాతి ఆధారిత హేయమైన సామాజిక వర్గీకరణతో సంబంధం లేదు. లింగం, జాతి ఆధారంగా భిన్నమైన మేధో సామర్థ్యాలను, వ్యక్తిత్వాలను, ఆకాంక్షలను, ఆపేక్షలను ఆపాదించడం పూర్తిగా అశాస్త్రీయం.

జననేంద్రియాలు, చర్మం రంగు, ముఖం ఆకారం మొదలైన బాహ్య శరీర లక్షణాలకు సంబంధించి, అలాగే మెదడు నుండి వచ్చిన ప్రాథమిక అంశాలన్నింటికీ సంబంధించి శాస్త్రీయ అధ్యయనాలు లింగాల మధ్య ఎటువంటి తేడాలను కనుగొనలేదు. కాబట్టి మనం ఆలోచించాల్సిన సమయం వచ్చింది: జననాంగాలను చూసి వైద్యులు లింగనిర్ధారణ చేయడం వల్ల వచ్చే అంచనాలకు అతీతంగా వ్యక్తులు తమ సొంత వ్యక్తిత్వాన్ని కలిగి ఉండగలరా? మనం లింగాన్ని నిర్మూలించగలమా? ప్రతి ఒక్కరూ తమ జెండర్ సంకెళ్ళ నుండి, ఆంక్షల నుండి విముక్తి పొంది, వారు కోరుకున్న విధంగా మాట్లాడటం, వారు కోరుకున్నది ధరించడం, ఫలానా పనులు ఆడపిల్లలే చేయాలి, ఫలానా పనులు మగపిల్లలే చేయాలి అని చెప్పించుకోకుండా వారికిష్టమైన పనులు చేయడం ఊహించగలమా? అటువంటి వ్యక్తులతో కూడిన ప్రపంచాన్ని మనం ఊహించగలమా? ఈ ప్రశ్నకు సమాధానం మనందరి దగ్గర ఉంది. భవిష్యత్తులో మనం ఎలాంటి ప్రపంచాన్ని నిర్మించాలనుకుంటున్నాము అనే దానిలో ఉంది.

(అయిపోయింది)



సాగుతుంది. కొండగాలి ఆనాటి విప్లవోద్యమపు తాత్విక రాజకీయ ఆర్థిక అవగాహనకు అనుగుణంగా భూషణం గారు రాశారు.

తీవ్ర నిర్బంధం వలన శ్రీకాకుళంలో విప్లవోద్యమం వెనుకంజవేసింది. వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం, సుబ్బారావు పాణిగ్రాహి లాంటి ముఖ్య నాయకులంతా ఎన్‌కౌంటర్‌లలో చనిపోయారు. అదే సమయంలో విప్లవోద్యమం మిగతా ఆంధ్ర ప్రాంతాలకు విస్తరించింది. ముఖ్యంగా రాయలసీమ, కోస్తాంధ్ర, తెలంగాణలోకి. అప్పటి అవగాహన ప్రకారం వర్గ శత్రువు నిర్మూలన ఏకైక మార్గం. 'గ్రామీణ ప్రాంతాలల్లో భూస్వాములను తొలిగించడం వలన గ్రామంలో భూస్వామ్యం కూలిపోయి ప్రజా రాజ్యం నెలకొంటుంది.' ఇలాంటి అవగాహనతో విద్యార్థులను మేధావులను, యువకులను సమీకరించారు. అక్కడక్కడ క్రూరులైన దొరలను ప్రజా గెరిల్లాలు చంపారు. ఆ తరువాత తీవ్రమైన నిర్బంధం- అరెస్టులు చిత్రహింసలు జరిగాయి. గ్రామాలలో భీతావహం ఏర్పడినది. ఈ నేపథ్యంలో- రంగారెడ్డి జిల్లాలోని గ్రామీణ ప్రాంతాలల్లో ఉత్పత్తి శక్తుల పెనుగులాట- యువకుల కోపోద్రిక చర్యలు- పర్యవసానాలను- పాత కొత్తల సంఘర్షణను చెరబండరాజు నాలుగు నవలల్లో చిత్రించడానికి ప్రయత్నం చేశారు. అప్పటికి చెరబండరాజు పాటలు కవిత్వం రాసేవారు. మొదటి నవల 'దారిపొడుగునా' (1970-71) కాలానికి సంబంధించినది. దాని తరువాత 1972లో జననాట్యమండలి ఏర్పడి, కళాకారుడిగా-కవిగా కొన్ని పాటలు రాశారు. ఈ నేపథ్యంలో 'నిప్పురాళ్లు' 1973లో రాశారు. 'నిప్పురాళ్లు' తర్వాత 'మాపల్లె', 'ప్రస్థానం' నవలలు- గ్రామీణ రైతాంగంతోపాటు పట్టణ కార్మికవర్గం కూడా విప్లవోద్యమంలో పనిచేయాలనే ఆలోచనతో 1976 దాకా ఉన్న పరిస్థితులకు సంబంధించినవి. ఈ నాలుగు నవలలు తొలి తెలంగాణ విప్లవోద్యమ నవలలు కనుక - పైన పేర్కొన్న వస్తువు, దృక్పథం వలన శిల్ప రీత్యా అప్పటికి వస్తున్న ఇతర నవలల కన్నా భిన్నమైనవి. నవలలోని అంశాలన్నింటిని నిర్వహించడంలో, ప్రజల పాత్రను, క్షేత్రస్థాయి పరిస్థితులను అర్థం చేసుకోవడంలో ఇంకా రూపొందని ప్రజాపోరాటాలకు సంబంధించిన పరిమితులున్నాయి. ఆ తరువాత ఆదిలాబాదు జిల్లా గ్రామీణ ప్రాంతంలోని దళిత జీవన నేపథ్యంలో అప్పటి విప్లవోద్యమ ప్రభావం - అతలాకుతలం చిత్రించిన నవలలు గూడ అంజయ్య 'పొలిమేర' (1975), 'పొద్దుపొడుపు' (1976) వస్తువులో ఉండే అవగాహన పరిమితులు ఈ నవలా శిల్పంలో కూడా కనిపిస్తాయి.

ఇలాంటి మరికొన్ని నవలలు వచ్చి ఉంటాయి. ఇవి కొండగాలి కన్నా భిన్నమైనవి. మరికొంత విస్తృతమైనవి. స్పష్టంగా ప్రజాపంథా రూపొందని కాలానికి సంబంధించినవి. ప్రజా జీవితంలోని కళారూపాల అధ్యయనం, శిల్పంలో ప్రజాబాణిని నవలల్లో చిత్రించడం స్పష్టంగా రూపొందని కాలానికి సంబంధించిన నవలలివి.

1977 తరువాత విప్లవానికి బాట- 'వ్యవసాయ విప్లవం' పదేండ్ల విప్లవోద్యమకాలాన్ని సమీక్షించుకొని - కొందరు వీరులు చరిత్ర నిర్మాతలు కాదని, వర్గశత్రు నిర్మూలనే ఏకైక మార్గం కాదని ప్రజలే చరిత్ర నిర్మాతలని- విప్లవోద్యమానికి కొత్త బాట రూపొందింది.

1977, మార్చ్ 21న అత్యవసర పరిస్థితి ఎత్తివేయడంతో అప్పటిదాకా జైల్లల్లో ఉన్న విప్లవకారులు విడుదలయ్యారు. 1974లో రాడికల్ విద్యార్థి సంఘం ఏర్పడింది. ఈ కాలంలో విద్యార్థులు గ్రామాలకు తరలి గ్రామ పరిస్థితులను అధ్యయనం చేస్తూ రైతుకూలీ

---

**విప్లవోద్యమాల పరిణామాత్మక, గుణాత్మక మార్పుల నేపథ్యంలో వస్తువులోను, శిల్పంలోను మార్పులు చోటుచేసుకున్నాయి. విప్లవోద్యమం - రైతాంగ, కార్మిక, ఆదివాసి, దళిత, మహిళా, ప్రాంతీయ ఆవరణల్లోకి విస్తరించడం - ఇలాంటి అన్నిరకాల వైరుధ్యాల అధ్యయనం, మార్క్సిజం-లెనినిజం-మావోయిజం సిద్ధాంత వెలుగులో, క్షేత్రస్థాయి పోరాటాల అధ్యయనం గుణాత్మకంగా పరిణమించే దశలల్లో - ప్రపంచ విప్లవోద్యమాలతో పాటు ప్రపంచ సాహిత్యంలో వచ్చిన నవలా శిల్ప రీతులను అధ్యయనం చేయడం ద్వారా ఇవి రూపొందినవి.**

**క్షేత్రస్థాయి ప్రజా సాహిత్య శిల్పాలను, విప్లవ శిల్పాలను వస్తువుకనుగుణంగా నవలల్లో చిత్రించడం కన్పిస్తుంది. వోరేచర్, సోషలిస్టు వాస్తవికత, ప్రజల వీరగాథల మ్యాజిక్ రియలిజం దాకా శిల్పం నవలల్లో కన్పిస్తుంది.**

---

సంఘాల నిర్మాణం చెపట్టడం జరిగింది. ఈ నేపథ్యంలో కరీంనగర్, ఆదిలాబాదు జిల్లాలల్లో రైతాంగ పోరాటాలు ఉవ్వెత్తున అరంభమయి అనేక గ్రామాలకు విస్తరించాయి. వందలాది గ్రామాలల్లో రైతులు, రైతుకూలీలు ఊళ్లల్లో నుండి దొరలను తరిమేశారు. షికం, బంచరాయి భూములు దున్నేవారికి భూమి నినాదంతో రైతులు ఆక్రమించుకున్నారు. రైతుకూలీలు కూలిరేట్లు పెంచుకున్నారు. ఆశ్రిత కులాల వెట్టి పనులు రద్దయ్యాయి. ప్రజా పంచాయితులు ఉనికిలోకి వచ్చాయి. మొత్తంగా దొర కేంద్రంగా నడుస్తున్న గ్రామాల భూస్వామ్యానికి బీటలువారాయి. ఈ నేపథ్యంలో సృజన సాహితి మిత్రులు ఈ మార్పుల నేపథ్యంలో వచ్చిన సాహిత్యాన్ని ప్రోత్సహించారు. గ్రామాలల్లో పనిచేస్తున్న అనేక మంది కార్యకర్తల అనుభవ సారాంశంగా ప్రజల జానపద కథన పద్ధతిలో- వోరేచర్ పద్ధతిలో 'కొలిమంటుకున్నది' (1979) నవల వచ్చింది. అది రూపొందిన క్రమంలోనే నవల ప్రజల్లోకి వెళ్లింది. ఇది విప్లవ వస్తువులో వచ్చిన ప్రజలే చరిత్ర నిర్మాతలు అన్న అవగాహన నుండి - వర్గపోరాట ఆచరణనుండి తెలంగాణ గ్రామీణ ప్రజలకు చేరడానికి రూపొందిన శిల్పం. అప్పటిదాకా వచ్చిన లిఖిత, పట్టణ చదువుకున్న పాఠకుల కోసం వచ్చిన నవలలన్నిటికన్నా పూర్తిగా భిన్నమైనది. పది సంవత్సరాల నూతన ప్రజాస్వామిక విప్లవ ఆచరణ ఒక గెంతుతో గుణాత్మకంగా విస్తృత ప్రజానీకంలోకి సారంలో, రూపంలో వెళ్లి మమేకమైన విప్లవ శిల్పమిది. గ్రామాలల్లో చదువు వచ్చిన వాళ్ళు రైతులను - కూలీలను సమీకరించి ఈ నవలను చదివేవారు. పాఠకుల స్థానంలో గుంపులుగా శ్రోతలుగా ఈ నవలను ప్రజలు విన్నారు. రైతులు-రైతుకూలీలు ఆయా పాత్రలతో తమ్ము తాము పోల్చుకునేవారు. ఇది విప్లవోద్యమం ఆవిష్కరించిన ప్రజాపోరాటాల శిల్పం. నిజ జీవితంలోని మాతృకలైన పాత్రల నుండి రూపొందిన నవల ఇది. సోషలిస్టు వాస్తవికతను వస్తువులో, శిల్పంలో రూపొందించిన నవలయిది.

తర్వాత కల్లోలిత ప్రాంతాల చట్టం రావడం, దాదాపుగా దొరలంతా సాంఘిక బహిష్కారానికి గురై పట్నాలు పట్టడం- గ్రామాల నిండా పోలీసు క్యాంపులు రావడం, కార్యకర్తలు రహస్యంగా ఒకరికి ఇద్దరు రక్షకులతో తొలి గెరిల్లా రూపం ఏర్పడటం - అదే విధంగా

పోలీసులు గ్రామాలల్లో ఇన్ఫార్మర్లలను తయారు చేసుకోవడం దాకా ఇరుపక్షాల మోహరింపును బలాబలాలను గతితార్కికంగా 'ఊరు' (1982) నవలలో చిత్రించడమైనది. అంతరంగ చిత్రణ, వైరుధ్యాల చిత్రణ అరంభమయ్యింది. ఇది 'కొలిమంటుకున్నది' శిల్పం కన్నా అభివృద్ధికరమైంది. అంతవరదాకా రైతాంగ పోరాటాలు దైనందిన సమస్యల పోరాటంగానో, ఆర్థిక డిమాండ్ల కోసమో జరిగిన పరిమాణాత్మక పోరాటాలు - ఇలాంటి పోరాటాలను దొరల ఫ్యూడల్ పెత్తనాన్ని, అధికారాన్ని, దాని సమస్త రూపాలను కూల్చే రాజకీయ పోరాటంగా అందుకు తగిన నిర్మాణాలు అభివృద్ధి చేయడం గుణాత్మక మార్పు. చాలా మార్క్సిస్టు లెనినిస్టు పార్టీలు దీర్ఘకాలం పాక్షిక పోరాటాలకే పరిమితమయ్యాయి. వీటికి భిన్నంగా కొత్త నాయకత్వం రూపొందింది కనుకనే ప్రభుత్వం నేరుగా రంగంలోకి దిగింది.

1982 నాటికి రైతుకూలి పోరాటాల నుండి వందలాది మంది మహిళలు పూర్తికాలపు కార్యకర్తలుగా వచ్చారు. పట్టణ ప్రాంతాల నుండి బీడీ కార్మికుల నుండి, సింగరేణి కార్మిక ప్రాంతాల నుండి మహిళలు వచ్చారు. అప్పటికి వచ్చిన సాహిత్యంలో మహిళలు దాదాపు ఉన్నత కులాల, వర్గాల వాళ్ళే ఎక్కువ. అదీ తాత్విక, రాజకీయ, ఆర్థిక, చారిత్రక అవగాహన లేకుండా స్వేచ్ఛ గురించి, విముక్తి గురించి ఆరాటపడిన పాత్రలు, వస్తువు, శిల్పంలో నవలలు చాలా వచ్చాయి. క్షేత్రస్థాయి గ్రామీణ కరడుగట్టిన భూసామ్యంలో అర్ధవలస, అర్ధభూస్వామిక సంబంధాలు కొనసాగుతున్న పట్టణ పారిశ్రామిక ప్రాంతాలలోని కింది కులాల మహిళల జీవితం పితృస్వామిక అణచివేతలో మధ్యయుగాల నాటి అమానుషత్వంలో ఉన్నది. జగిత్యాల తాలుకాలో ఒక దొర ఇంట్లో దాడిలో 108 మంది మహిళలను బలవంతంగా అనుభవించిన గుర్తుగా 108 బహిర్భూమికి తీసుకపోయే ముంతలు దొరికాయి. ఈ నేపథ్యంలో 1979లోనే ఆదివాసీ ప్రాంతాల్లోకి విస్తరించిన దళాల్లో కొందరు మహిళలు అప్పటికే పనిచేస్తున్నారు.

మహిళల క్షేత్రస్థాయి వాస్తవ పరిస్థితి, గతితార్కిక చరిత్ర అధ్యయనంలో భాగంగా 'అగ్నికణం' (1983) నవల వచ్చింది. ఇందులో గ్రామీణ ప్రాంతం, పారిశ్రామిక, ఆదివాసీ ప్రాంతాలు మూడు చిత్రించడమైంది. ఈ నవల శిల్పం - ఒక కౌమార వయస్సు బాలుడి అంతరంగ ఆత్మకథనం, ఒక గ్రామీణ ప్రాంతాపు వేటాడబడిన యువతి విప్లవోద్యమంలో పనిచేయడం దాకా అంతరంగ కథనంగా చిత్రించడమైంది. ఇది భిన్నమైన శిల్పం... శ్రామిక మహిళ కథా వస్తువుగా మూడు రకాల సామాజిక జీవితంలో మహిళ దుర్భర జీవితం - వేటాడబడే జీవితం వస్తువు.

గ్రామీణ ప్రాంతాలలో రైతాంగ పోరాటాలు ఉన్నత రూపం తీసుకున్న, రాజకీయంగా నిర్మాణ రూపం సంతరించుకుంటున్న దశలో తెలంగాణ సాయుధ పోరాటం, శ్రీకాకుళ పోరాటం నుండి గుణపాఠాలు తీసుకొని స్థావర ప్రాంతాల నిర్మాణం ఆరంభించింది. ఫలితంగా 1979 నుండి ఆరంభించిన అడవి ప్రాంతాలల్లో సర్వే అధ్యయనం ఆదివాసుల్లో విప్లవోద్యమం అడుగుపెట్టింది. దృగ్గోచరమైన విషయాల నుండి ఆదివాసుల గతితార్కిక చరిత్రను అధ్యయనం చేయడం ఆరంభమయ్యింది. క్షేత్రస్థాయి అనుభవంలో ఒక గుణాత్మక మార్పు దిశగా ఈ అధ్యయనం సాగింది. అభివృద్ధి కాని ఆదివాసీ ఉత్పత్తి శక్తులు - పైనుండి ఆదివాసుల అభివృద్ధిని ఏమాత్రం పట్టించుకోకుండా దోపిడి పీడనలతో ఆదివాసీ సంపద దోచుకోవడానికి రాజ్యం, చట్టాలు, యంత్రాంగం -అనగా సమస్త ఉత్పత్తి సంబంధాలను అధ్యయనం చేయడం వర్గ పోరాటాల ఆచరణలో భాగంగా ఆరంభమయ్యింది... రైతాంగ పోరాటాలకు భిన్నమైన ఆదివాసీ పోరాటాలను గతితార్కిక సంబంధాలను అర్థం చేసుకొని - ఆదివాసీలను దోపిడి చేసే షావుకార్లను, ప్రభుత్వ యంత్రాంగాన్ని ఎదిరించే శక్తిగా ఆదివాసులను పోరాటాలల్లో సమీకరించారు. ఆదివాసీ అటవి ప్రాంతాలల్లో కదలిక ఊపందుకున్నది. ఫలితంగా ఇంద్రవెల్లిలో తమ సమస్యలు చర్చించడానికి పెట్టుకున్న గిరిజన రైతుకూలీ సంఘం సభ మీద రాజ్యం జలియన్‌వాలా బాగ్ తరహాలో ఏకపక్షంగా దాడికి దిగి సుమారు అరువై మందిని కాల్చిచంపి ఎందరినో గాయపరిచింది... అప్పుడు ఆదివాసీ ప్రాంతాలల్లో ఉత్పత్తి శక్తుల వికాసం కోసం తరతరాలుగా పోరాడుతున్న ఆదివాసులను క్రూరంగా అణచివేస్తున్న ఉత్పత్తి సంబంధాల తీవ్రత వాళ్లకు అర్థమయ్యింది. ఈ నేపథ్యంలోంచి క్షేత్రస్థాయి అధ్యయనం - మౌఖికంగా ఆదివాసులు తరతరాలుగా భద్రపరుచుకున్న తమ గతితార్కిక చరిత్ర, ఆదివాసీ ప్రాంతాలల్లో పనిచేసిన రాజ్యపు యంత్రాంగం అంచనాలు, రాజ్యం చేయించిన సర్వేల ఆధారంగా, ఇంతదాక జరిగిన సమిష్టి అధ్యయనం, అవగాహనల సారాంశంగా 1983లో 'కొమురంభీం' నవలను సాహు, నేను కలిసి రాశాం. అందుకే అది ఒక ఆదివాసీ జానపద మౌఖిక గాథ నుండి విప్లవ గాథగా రూపాంతరం చెందింది. ఇది కొమురం భీం నవలా శిల్పంలో - ఇంతవరకు వచ్చిన నవలలకన్నా భిన్నమైన శిల్పంగా రూపొందింది... ఒక రకంగా కొండగాలి నుండి కొమురం భీం దాకా విప్లవోద్యమం చేసిన ప్రయాణానికి తాత్విక రాజకీయ, ఆర్థిక వ్యక్తీకరణ. అందుకే ఈ అవగాహన ఆదివాసీ ప్రాంతాలల్లో పోరాటాలకు దిక్సూచిగా మారింది.

నవల వస్తువులో, శిల్పంలో విప్లవోద్యమం సాధించిన రైతాంగ, మహిళా, ఆదివాసీ జీవన నేపథ్యంలో వచ్చిన పురోగమనం. విప్లవోద్యమం 1985 కల్లా రైతాంగ, ఆదివాసీ, కార్మిక రంగంలో ఒక గుణాత్మక రాజకీయ నిర్మాణ మార్పు తీసుకోవాల్సిన స్థితికి చేరుకున్నది... విప్లవోద్యమంలో పాత నాయకత్వం గుణాత్మక మార్పును గుర్తించి ముందుకు పోయే క్షేత్రస్థాయి అనుభవం గడించలేదు. ఇంత వరదాకా జరిగిన విప్లవోద్యమాల కన్నా భిన్నమైన పోరాటంలో నుండి అభివృద్ధి చెందిన యువ నాయకత్వం క్షేత్రస్థాయి అనుభవాలను మార్క్సిజం-లెనినిజం-మావోయిజం సిద్ధాంతం వెలుగులో అధ్యయనం చేసింది. నాయకత్వం వహించి మొత్తం శ్రేణులను పురోగమింపచేయగల సిద్ధాంత ప్రాతిపదిక - కొత్త రాజకీయ తీర్మానం కోసం తన శ్రేణులందరితో సమిష్టిగా చర్చించి ముందుకుపోవడానికి తమ సమస్త శక్తులు కేంద్రీకరించి పనిచేయాల్సివచ్చింది. ఈ అంతర్గత పోరాటం - ఆగిపోయిన భావజాలానికి, పురోగమించాల్సిన భావజాలానికి మధ్య ఆరు చెడుల పోరాటంగా జరిగింది. ఫలితంగా పాత నాయకత్వాన్ని కొత్త నాయకత్వం వొదిలించుకోవాల్సి వచ్చింది. ఈ మొత్తం వర్గపోరాట ఆచరణ రూపం గెరిల్లా జోన్ల నిర్మాణంగా ఇతర రాష్ట్రాల్లోకి విస్తరించే దిశగా సాగింది. దీని భౌతిక, భావపరమైన వర్గ పోరాటాన్ని చిత్రించినదే 'వసంతగీతం' నవల (1987). ఈ నవలలో ప్రధానంగా భావవాదం, గతితార్కిక భౌతికవాదం స్థల కాలాలల్లో వర్గపోరాటంలో తలపడి పోరాడటం వస్తువు. ఆదివాసులు, ఆదివాసి ప్రాంతంలో షావుకార్లు, అధికార్లు, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు - ఒక దళం సంవత్సర కాలపు

ఆచరణలో ఎట్లా ప్రతిఫలిస్తాయో? అర్ధవలస, అర్ధభూస్వామిక తాత్విక, రాజకీయ, ఆర్థిక వర్గపోరాటాన్ని కలిపి తగిన భావోద్వేగాలతో భిన్న రంగాల వ్యక్తుల అంతరంగాలను చిత్రించిన శిల్ప పరిణామం ఈ నవల వర్గపోరాట నేపథ్యం గుణాత్మక పోరాటం రూపొందించినది. ఇలాంటి వస్తువుతో, శిల్పంతో తెలుగులో వచ్చిన మొదటి సైనిక నవల యిది.

అనేక ప్రాంతాల నుంచి వచ్చి, అనేక సామాజిక నేపథ్యాలున్న వాళ్ళంతా కలిసి, తమ వైయక్తిక, భౌతిక సరిహద్దులు దాటి ఆదివాసీ ప్రాంతాలల్లో విప్లవోద్యమాన్ని నిర్మించే క్రమంలో విప్లవకారులుగా ఎదగడం - వసంతగీతం నవల నుండి మరో గెంతుగా సాధన నవల 'సరిహద్దు' (1993) వచ్చింది... శిల్పంలో వసంతగీతం కన్నా భిన్నమైన, అభివృద్ధికరమైన క్షేత్రస్థాయి ఆచరణ, భావోద్వేగాల - విప్లవోద్యమ నాయకుడు రాసిన పురోగమన నవల.

విప్లవోద్యమంలో రైతాంగ పోరాటాల నుండి ఒక రైతు కూలీ మహిళ గెరిల్లాగా విప్లవోద్యమంలో చేరిన వనజ (నర్సక్క) రాసిన అడవి పుత్రిక (1995) రైతాంగ విప్లవోద్యమాల నుండి గెరిల్లా ఆత్మకథగా వస్తువులోను, శిల్పంలోను విప్లవోద్యమ నవలల్లో భిన్నమైనది. తెలుగులో విప్లవోద్యమ గెరిల్లా మహిళ రాసిన మొదటి నవల.

ఇదే సందర్భంలో ఆదివాసీ ప్రాంతాల నుండి - ఆదివాసీ సాంప్రదాయాలను, పితృస్వామిక బంధనాలల్లో ఒంటరిగా ఎదిరించి పోరాడిన ఒక ఆదివాసీ మహిళ విప్లవోద్యమంలో ఎదిగిన క్రమానికి సంబంధించిన నవల 'రాగో' (1996). వస్తువులో శిల్పంలో 'అగ్నికణం', 'అడవి పుత్రిక'ల పురోగమనాన్ని చిత్రించిన నవల. ఆదివాసీ మహిళ విప్లవోద్యమంలో నాయకురాలుగా ఎదిగిన వస్తువు, శిల్పంలో తెలుగులో మొదటి నవల.

మైదాన ప్రాంతంలో తీవ్ర నిర్బంధంలో దళాల కదలికలను చిత్రించిన కౌముది నవల 'తెలంగాణ పల్లె' (1996). ఇది 'కొలిమంటుకున్నది' నుండి పరిణామం చెందిన వస్తు శిల్ప పరిణామాల నవల... విప్లవోద్యమ నాయకుడు రాసిన తొలి తెలుగు రైతాంగ పోరాట నవల.

ఇదే వరుసలో విప్లవోద్యమం 1977 నుండి గ్రామీణ ప్రాంతాలతో పాటు సింగరేణి కార్మిక ప్రాంతంలో ఉద్యమాన్ని నిర్మించింది... అర్ధవలస అర్ధభూస్వామిక కార్మికవర్గం గతితార్కికంగా, చారిత్రకంగా ఎదిగి వర్గపోరాటంలో పురోగమించడం ఆరంభమైంది. ఇలాంటి క్రమాన్ని చిత్రించే నవలలు తుమ్మేటి రఘోత్తమరెడ్డి 'నల్లవజ్రం' (1989) నవలతో ఆరంభమయ్యింది. ఇది తొలి కార్మికవర్గ విప్లవోద్యమ క్షేత్రస్థాయి కార్మికుడు రాసిన నవల. మిగతా నవలల కన్నా శిల్పంలో భిన్నమైనది. విప్లవోద్యమ క్రమంలో - తెలంగాణ సాయుధ పోరాటం, కార్మికోద్యమం గురించిన గతితార్కిక చరిత్రను అధ్యయనం చేసే క్రమంలో పి. చెంద్ 'శేషగిరి' నవల (1995) వచ్చింది. ఈ రెండు నవలలు కూడా తెలుగు సాంప్రదాయిక నవలలకన్నా వస్తువులో, శిల్పంలో భిన్నమైనవి. ఆ తరువాత పి. చంద్ కార్మికోద్యమం గురించి దాదాపు పదిహేను నవలలు ఇప్పటిదాకా రాశారు. 'నెత్తుటిధార' (1995) - కార్మికోద్యమ నాయకురాలు జిలానీబేగం గురించి, 'విప్లవాగ్ని' (1999) - నాయకులు నల్లా ఆదిరెడ్డి గురించి - వస్తువులోను శిల్పంలోనూ భిన్నమైనవి.

తీవ్రమైన నిర్బంధంలో సింగరేణి విప్లవోద్యమ స్థితి గురించి పద్మకుమారి 'పాల్గుణ' (2015) నవల వచ్చింది. ఈ నవల తీవ్రమైన నిర్బంధ పరిస్థితుల్లో లాటిన్ అమెరికాలో వచ్చిన వన్‌హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్ (నూరు సంవత్సరాల ఏకాంతం) నవల వంటిది. మార్క్వెజు నవలా శిల్పం మాజిక్ రియలిజం లాంటిది... తొలి కార్మికోద్యమ మహిళా నాయకురాలు కార్మికోద్యమం గురించి రాసిన తొలి నవల.

పి. చంద్ రాసిన 'నల్లమల' (2013), 'శృతి' (2016), నేను రాసిన 'టైగర్ జోన్' (2017) మారుతున్న క్షేత్రస్థాయి విప్లవోద్యమ పరిస్థితులు - ఎత్తుగడలు చిత్రించిన నవలలు. శిల్పంలో కూడా ఇంతకుముందటి నవలల కన్నా భిన్నమైనవి.

నాకు తెలిసిన అవగాహన మేరకు స్థూలంగా ఇవి వస్తువుతో పాటు శిల్పంలో పరిణామం సాధించిన తెలంగాణ నవలలు. ఈ నవలలన్నీ కూడా వస్తువులో, శిల్పంలో ఎక్కువగా సోషలిస్టు వాస్తవికత ప్రతిబింబించినవి.

ఉత్తరాంధ్ర నుండి శ్రీకాకుళ పోరాటం తిరిగి పుంజుకున్న నేపథ్యంలో - అట్టాడ అప్పలనాయుడు 'పునరావాసం', 'బహుళ'; పట్టణ ప్రాంతాల గురించి రావిశాస్త్రి 'ఇల్లు' నవలలు వచ్చాయి. ఈ మూడు నవలలు గతంలో వచ్చిన నవలలకన్నా వస్తువులో శిల్పంలో భిన్నమైనవి. క్రమంగా విప్లవోద్యమం వ్యూహంలో భాగంగా ఆంధ్ర ఒరిస్సా బార్డర్ ప్రాంతానికి విస్తరించింది. సుదీర్ఘ పోరాట క్రమంలో అనేక పరిణామక్రమాలను ఎదుర్కొని నిలదొక్కుకున్నది. ఎందుచేతనో ఈ విప్లవోద్యమ నేపథ్యంలో నవలలు రాలేదు. మరింత సమగ్రంగా ఈ ప్రాంతం నవలను అధ్యయనం చేయాలి.

రాయలసీమ ప్రాంతంలో నక్సల్బరీ స్ఫూర్తితో 1968లోనే పోరాటాలు ఆరంభమయ్యాయి. పరిటాల శ్రీరాములు అనంతపురం, చిత్తూరు, తంబళ్లపల్లి లాంటి చోట భూస్వాముల హత్యలు జరిగాయి. రైతాంగ పోరాటాలు, కరువుదాడులు జరిగాయి... గ్రామీణ ప్రాంతాలలోని వర్గ, కుల వైరుధ్యాల నేపథ్యంలో - ఈ పోరాటాల నేపథ్యంలో కేశవరెడ్డి 'శ్మశానం దున్నేరు', 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' 1977 నాటికి రాశారు. ఈ నవలలు క్షేత్రస్థాయి అనుభవం, కొంతవరకు ఎర్నెస్టు హెమింగ్‌వే నవలల శిల్పంతో ప్రభావితమై రాసినవి.

క్రమంగా రైతాంగ పోరాటాలు అన్ని ప్రాంతాలకు వీస్తరించాయి. ఈ నేపథ్యంలో నామిని సుబ్రమణ్యం నాయుడి 'మునికన్నడి సేద్యం' 1983లో వచ్చింది. ఇది వస్తువులో - శిల్పంలో రాయలసీమ రైతాంగాన్ని చిత్రీకరించింది.

రైతాంగ పోరాటాలు విస్తరించడం, వేగవంతం కావడం - రాయలసీమలో ఉత్పత్తి శక్తుల ఏకీకరణ తీవ్రమైన నేపథ్యంలో తెలంగాణలో దొరలలాగా భూసామ్యం ఈ పోరాటాలను అడ్డుకోవడానికి ముఠా తగాదాలు విస్తరించి తీవ్రరూపం దాల్చాయి. విప్లవోద్యమం క్రమంగా ముఠానాయకుల మీద కేంద్రీకరించడంతో ముఠానాయకులు పట్నాలు పట్టారు. క్రమంగా ముఠా తగాదాలు తగ్గిపోయాయి. ఈ విప్లవోద్యమ స్థితిని కసుంపల్లి రాజారాం ఎదురగ్గి నవలలో చూస్తాం. ఇది పూర్తిగా తెలుగు నవలకు భిన్నమైన శిల్పం. రకరకాల వైరుధ్యాల చలనంలో వేంపెంట దళితుల మీద దాడి - దళితుల గుడిసెలు కాలబెట్టడం, తీవ్రమైన కుల వైరుధ్యాలుగా వ్యక్తమయ్యింది... ఇలాంటి తీవ్రమైన సంఘర్షణాత్మక స్థితిని పినాకపాణి 'నిప్పుల వాగు' (2001) నవలలో చూస్తాం. ఆశ్రిత కులాలైన బుడగజంగాల మీద వచ్చిన

నవల 'గుమ్మెటమోత'. ఇది రాయలసీమలోని కళాకారుల కులం మూలాలను, వర్తమానంలో అందులో వస్తున్న మార్పులను చిత్రించింది. రాయలసీమ నుండి వచ్చిన నవలలన్నీ ఒకదానికొకటి పోలని వస్తువు, శిల్పవైవిధ్యంతో వచ్చాయి. విప్లవోద్యమ స్థితిని బట్టి - రైతాంగ పోరాటాలు ప్రాప్తకాల పరిమాణాత్మక దశలనుండి రాజకీయ దశకు ఎదగడంలో రాయలసీమ వెనుకబడ్డ సమాజంలో ఆలశ్యం జరిగింది.

రాయలసీమ నుండి విప్లవోద్యమం నల్లమలకు విస్తరించింది. నల్లమల విప్లవోద్యమం - ఆ అడవి విస్తరించిన కోస్తాంధ్ర (గుంటూరు), రాయలసీమ, తెలంగాణలను ఆవరించింది. పి. చంద్ రాసిన నల్లమల నవలలో రాయలసీమ, కోస్తాంధ్రకు సంబంధించిన విషయాలు ఎక్కువగా రాలేదు. సుదీర్ఘకాలం కొనసాగి అనేక ప్రయోగాలు చేసిన నల్లమల విప్లవోద్యమం నుండి నవలలు రాయలసీమ, కోస్తాంధ్ర నేపథ్యంలో తప్పక రావాల్సింది. క్షేత్రస్థాయి అధ్యయనం, అనుభవం గల్గిన వారు చాలా మంది ఇప్పటికైనా నవలలు రాయవల్సి ఉంది.

ఇక కోస్తాంధ్ర నుండి విప్లవోద్యమం నక్సల్బరీ పోరాటం నుండే మొదలయ్యింది. చాగంటి భాస్కర్‌రావు లాంటి అనేక మంది విప్లవకారులు శ్రీకాకుళం వెళ్లి శ్రీకాకుళ పోరాటంలో పనిచేసి అమరులయ్యారు. వారికి సంబంధించిన తొలి దశ పోరాటాల గురించి నవల రాలేదు. ఆ తరువాత అత్యయిక పరిస్థితి ఎత్తేసిన తరువాత పలనాడు ప్రాంతంలో రైతాంగ పోరాటాలు ఆరంభమయ్యాయి... అనేక ఆటుపోట్ల మధ్య కొనసాగాయి. ఆలశ్యంగానైనా నల్లూరి రుక్మిణి 'నర్రెంకచెట్టు కింద' (2000) నవల, తర్వాత రైతాంగంలోని వైరుధ్యాలు - వలసల నేపథ్యంలో 'ఒంద్రుమట్టి' (2014) నవల వచ్చాయి. కారంచేడులో దళితుల మీద జరిగిన ఊచకోత - ఆ కేసు నడిచిన సుదీర్ఘకాలం కుల, వర్గ రాజకీయాలు, కోర్టులు, చట్టాల నేపథ్యంలో 'నిషిధ' (2017) నవల రాశారు. మహిళా ఉద్యమ నాయకురాలు అనసూయమ్మ జీవితం 'మేరువు' (2020) నవల రాశారు. నల్లూరి రుక్మిణి రాసిన ఈ నాలుగు నవలలు వస్తువులో, శిల్పంలో ఒకదాని కన్నా మరొకటి భిన్నమైనవే కాక విప్లవోద్యమాల పురోగమనాన్ని చిత్రించినవి. ఈ నాలుగు నవలలు కోస్తాంధ్ర విప్లవోద్యమ నేపథ్యంలో వివరంగా విశ్లేషించాల్సినవి.

వలస, అర్ధవలస, అర్ధభూస్వామిక సామాజిక నేపథ్యంలో దళితుల గురించి చరిత్రలోకెక్కని, దళితుల గురించి వక్రీకరించబడిన గతితార్కిక చరిత్రను - వర్గ పోరాటాల నేపథ్యంలో అధ్యయనం చేశారు. ఒక పురాణ గాథలాగా మూడు తరాల దళితుల వర్గపోరాటాన్ని కళ్యాణరావు 'అంటరానివసంతం' (2010) నవలలో రాశారు. ఈ నవల తెలుగు నవలల్లో విలక్షణ శిల్పంతో, వస్తువుతో వర్గ పోరాటాల నేపథ్యంలో వచ్చింది.

మొత్తంగా యాభై సంవత్సరాలుగా మూడు తరాలుగా కొనసాగుతున్న విప్లవోద్యమంలో అన్ని ప్రాంతాల నుండి - అన్ని క్షేత్రస్థాయి పోరాటాల నుండి రావాల్సినన్ని నవలలు రాలేదు. వచ్చిన నవలల్లో -వస్తువులో నవలా అంగాలల్లో మార్పులు జరుతూ వచ్చాయి. వస్తువును బట్టి శిల్పం మారుతూ పరిణామం చెందుతూ వచ్చింది.

విప్లవోద్యమాల పరిణామాత్మక, గుణాత్మక మార్పుల నేపథ్యంలో వస్తువులోను, శిల్పంలోను మార్పులు చోటుచేసుకున్నాయి. అవి విప్లవోద్యమం - రైతాంగ, కార్మిక, ఆదివాసి, దళిత, మహిళా, ప్రాంతీయ ఆవరణల్లోకి విస్తరించడం - ఇలాంటి అన్నిరకాల వైరుధ్యాలు ప్రధాన వైరుధ్యమైన అశేష పీడిత ప్రజానీకం, భూస్వామ్యం నేపథ్యంలో మార్క్సిజం-లెనినిజం- మావోయిజం అధ్యయనం, క్షేత్రస్థాయి పోరాటాల అధ్యయనం గుణాత్మకంగా పరిణమించే దశలల్లో - ప్రపంచ విప్లవోద్యమాలతో పాటు ప్రపంచ సాహిత్యంలో వచ్చిన నవలా శిల్ప రీతులను అధ్యయనం చేయడం ద్వారా రూపొందినవి.

క్షేత్రస్థాయి ప్రజా సాహిత్య శిల్పాలను - విప్లవ శిల్పాలను వస్తువుకనుగుణంగా నవలల్లో చిత్రించడం కన్పిస్తుంది. వోరేచర్, సోషలిస్టు వాస్తవికత, ప్రజల వీరగాథల మ్యాజిక్ రియలిజం దాకా శిల్పం నవలల్లో కన్పిస్తుంది.

కొన్ని నవలల్లో వస్తువును బట్టి అన్ని రకాల శిల్పాలను వొకే నవలలో ప్రయేగించడం కన్పిస్తుంది. కొన్ని నవలల్లో పాత శిల్ప రీతులను విప్లవీకరించి నవలలు రాయడం కన్పిస్తుంది... సోషలిస్టు వాస్తవిక కథల్లో రాజకీయ నిర్మాణ విషయాలు, ఆర్థిక, తాత్విక విషయాలు ప్రవేశపెట్టడం, భావవాదం, అది వాస్తవికత, రొమాంటిజం కలెగల్సిన వాటిని వొదిలించుకోవడం, అభివృద్ధిచేసే వాటిని అభివృద్ధి చేయడం కన్పిస్తుంది. తాత్విక, రాజకీయార్థిక, వర్గపోరాట వస్తువులో శిల్పంలో ఆవిష్కరించడం జరిగింది.

ప్రజా కళారూపాల్లోని ప్రగతిశీలమైన అంశాలను శిల్పరీత్యా విప్లవీకరించడం జరిగింది.

అయితే విప్లవోద్యమం నుండి వస్తువుతో పాటు తగిన శిల్పం కుదరని నవలలు కూడా వచ్చాయి. ముఖ్యంగా విప్లవోద్యమంలో తలమునకలైన విప్లవోద్యమ కార్యకర్తలు అనివార్యంగా నవలలు రాయాల్సి రావడం వలన - క్షేత్రస్థాయి అనుభవం కలిగి, వ్యక్తీకరించే శిల్పాల గురించిన అధ్యయనం అందుబాటులోలేక, లేదా కొరవడినందున వస్తువుకు తగిన శిల్పం అమరని నవలలు వస్తాయి. బయటి పెటీబూర్జువా రచయితలకు క్షేత్రస్థాయి అనుభవంలేక స్వీయాత్మక ధోరణిలో నవలలు రాసినప్పుడు కూడా వస్తువుకు శిల్పానికి సమతుల్యం కుదరదు... పోరాటకారులు అందుచేతనే సమయాభావం వలన - నవల జోలికి పెద్దగా పోలేదు. రాసిన నవలలు శిల్పరీత్యా భిన్నమైనవి.

రచయితలు నిరంతరం విప్లవోద్యమాన్ని అధ్యయనం చేయడం, గతితార్కికంగా అర్థం చేసుకోవడంలోనూ, క్షేత్రస్థాయి ప్రజా జీవితంలో ఉండే సంబంధం వల్లా వస్తువు మీద కొంతమేర పట్టు సాధించగలరు. మనం ఎంచుకున్న వస్తువును మన పాఠకుల స్థాయిననుసరించి ఎప్పటికప్పుడు ఉన్నతీకరించుకోవాలి. అందుకు స్థానిక, జాతీయ, అంతర్జాతీయ నవలలను అధ్యయనం చేసి ఎప్పటికప్పుడు వస్తువుకు తగ్గట్టు శిల్పాన్ని ఉన్నతీకరించుకోవాలి. ఈ నిరంతర కృషిలేకపోతే చాలా నవలల్లో వస్తువు మారినా తగిన శిల్పం ఎంచుకోనందున పాఠకులకు నవల చేరదు. నవలలు లక్ష్యాన్ని సాధించలేవు.

ఏది ఏమైనా దండకారణ్య విప్లవోద్యమం మీద, ఆంధ్ర ఒరిస్సా బార్డర్, నల్లమల విప్లవోద్యమం నేపథ్యంలో తెలుగులో నవలలు రాలేదు. పంజాబీలో సత్నాం 'జంగల్‌నామా', ఇంగ్లీషులో యాన్ మిర్దాల్ 'భారత్‌పై అరుణతార', అరుంధతీరాయ్ 'కారడవిలో కామ్రేడ్స్‌తో', తెలుగులో పాణి 'జనతనరాజ్యం' రచనలు క్షేత్రస్థాయి పర్యాటక అనుభవాలుగా వచ్చాయి. ఇది ఒక రకమైన సాహిత్య శిల్పం. ఈ విషయం మీద ఇంకా నా దృష్టిలోకి రాని నవలలు ఉండవచ్చు. విప్లవోద్యమ నవలల శిల్పరీతుల మీద ఇంకా సమగ్రంగా అధ్యయనం చేయాలి.



ARUNATARA A Literary and Cultural Monthly Journal RNI Regn. No. 21152/72
SEPTEMBER-OCTOBER - 2022 VOL:50, ISSUE : 7, VIJAYAWADA



# అరుణతార నిర్వహణకు విరాళాలివ్వండి

# శాశ్వత నిధి ఏర్పాటుకు సహకరించండి

విప్లవ రచయితల సంఘం అధికార పత్రిక అరుణతార 1977 నవంబర్ నుంచి మాసపత్రికగా వస్తోంది. సాహిత్య సాంస్కృతిక సంస్థగా విరసం విప్లవ, విప్లవ సాహితోద్యమాల్లో నిర్వచించుకున్న తన రాజకీయ, సాహిత్య, మేధో పాత్రకు వాహికగా తెలుగు సమాజంపై ప్రభావం వేస్తున్నది. గత మూడు తరాలుగా ఎందరో రచయితల , బుద్ధిజీవుల ఆలోచనా వికాసానికి వేదికగా ఉన్నది. సాహిత్య పత్రిక అయినప్పటికీ సామాజిక, రాజకీయార్థిక, సిద్ధాంత విశ్లేషణలకు, చర్చలకు, అన్వేషణకు సృజనశీలమైన మాధ్యమంగా కొనసాగుతున్నది. నక్సల్బరీ శిశువుగా విరసం తాను ఎంచుకున్న విప్లవోద్యమ ప్రచార కర్తవ్యంలో అరుణతార పాత్ర గణనీయం. 1970లలో ఉత్తర తెలంగాణలో విప్లవోద్యమ పునర్నిర్మాణ దశ నుంచి ఇవాళ దేశవ్యాప్తంగా సాగుతున్న విప్లవ, ప్రజా పోరాట సంచలనాలకు అరుణతార తన శక్తనంతా వెచ్చించి అక్షరబద్ధం చేస్తున్నది. మరీ ముఖ్యంగా చత్తీస్‌ఘడ్‌లో సల్వాజుడుం దుర్మార్గాలు మొదలైనప్పటి నుంచి ఇవ్వాల్టి ఆపరేషన్ గ్రీన్‌హంట్ మూడో దశ, సాల్వాజుడుం రెండో దశ దాకా దండకారణ్య ప్రజా యుద్ధాన్ని, ప్రజారాజ్యాధికారాన్ని, ప్రత్యామ్నాయ రాజకీయ విధానాన్నీ, అక్కడ సాహిత్య, సాంస్కృతిక వికాసాన్నీ తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నది. విశ్లేషిస్తున్నది. దండకారణ్య విప్లవోద్యమానికి సంఘీభావ హస్తాన్ని అందిస్తున్నది. ఈ పనిలో ఇతర ప్రజాస్వామిక పత్రికల పాత్ర కూడా ఉన్నప్పటికీ అరుణతార దాన్నే ఒక ప్రధాన కర్తవ్యం స్వీకరించింది. ఇటీవల పెరిగిపోయిన హిందూ ఫాసిస్టు ప్రమాదానికి వ్యతిరేకంగా లౌకిక, ప్రజాస్వామిక కంఠస్వరాన్ని బలంగా వినిపిస్తున్నది. వేర్వేరు సామాజిక ఉద్యమాల ఆకాంక్షలను ఎత్తిపడుతూ వాటి న్యాయబద్ధతను విశ్లేషిస్తున్నది.

ప్రజాఉద్యమాల్లోని కార్యకర్తల సృజనాత్మక వ్యక్తీకరణలకు అరుణతార అవకాశం ఇవ్వడం వల్ల వాళ్లలోంచి ఎందరో ప్రతిభావంతులైన ఆలోచనాపరులు, రచయితలు తయారవుతున్నారు. అరుణతార ఈ పని ఆది నుంచి చేస్తున్నది. అందువల్ల ఒకపక్క లబ్ధప్రతిష్టుల రచనలతోపాటు ఎప్పటికప్పుడు కొత్త గొంతులు అరుణతారలో వినిపిస్తుంటాయి.

అయితే మొదటి నుంచీ అరుణతార అనేక ఆర్థిక, నిర్వహణ సమస్యలను ఎదుర్కొంటున్నది. ఒక్కోసారి ఈ ఇబ్బందులు కాస్త తక్కువగా ఉన్నా, ఇటీవల తీవ్రమైన సంక్షోభాల మధ్య ఎప్పటికప్పుడు అభిమానుల, మిత్రుల అండదండలతో నడుస్తున్నది. గతంలో ఒకసారి అరుణతార విరాళాలు వద్దు.. చందాలు కట్టండనే ఆదర్శాన్ని కూడా అమలు చేసింది. అయితే నానాటికి పెరుగుతున్న ప్రెస్ ఛార్జీలు, నిర్వహణ ఖర్చులు మోయలేని భారమయ్యాయి. దీంతో రెండు నెల్లకో సంచిక వచ్చిన సందర్భాలూ ఉన్నాయి. అయితే పేజీలు పెంచి పాఠకులకు మరిన్ని రచనలు అందిస్తూ వచ్చాం. ఈ అన్ని అనుభవాల దృష్ట్యా అరుణతారకు శాశ్వత నిధి తయారు చేయకుండా ఇక పత్రికను నాలుగు కాలాల పాటు నడపడం అయ్యేపని కాదని తేలింది. ఇంత కాలం అభిమానుల సహకారంతోనే నడుస్తూ వచ్చిన అరుణతార ఈసారి శాశ్వత నిధి కోసం మీ ముందుకు వచ్చింది. ఇవాళ ఉన్న విప్లవోద్యమ ప్రత్యేక పరిస్థితుల్లో అరుణతార అవసరం ఎంత ఉన్నదో పాఠకులకు తెలుసు. తెలుగు నేల మీద, దేశంలోని ఇతర ప్రాంతాల్లో, విదేశాల్లో ఉన్న అసంఖ్యాక విప్లవాభిమానులు తలా ఒక చేయి వేస్తే శాశ్వత నిధి సమకూరడం కష్టమేమీ కాదని మా నమ్మకం. దాంతోనే మీ ముందుకు వచ్చాం. విప్లవోద్యమ రాజకీయ, సాంస్కృతిక వేదిక అరుణతారకు మీవంతు విరాళాలు ఇవ్వాలని, ఇప్పించాలని కోరుకుంటూ...

అరసవిల్లి క్రిష్ణ - విరసం అధ్యక్షులు, రివేరా - విరసం కార్యదర్శి
వరవరరావు, టి. కృష్ణాబాయి, సిఎస్ఆర్ ప్రసాద్, జి. కళ్యాణరావు, వి. చెంచయ్య, అల్లం రాజయ్య,
ఎం. రత్నమాల, పాణి, పి. వరలక్ష్మి, రాంకీ

**చందాలు, విరాళాలు పంపాల్సిన చిరునామా :**

అరసవిల్లి క్రిష్ణ, **6-1/16-7A/1,** పెద్దిరాజు స్ట్రీట్, ప్రైజర్‌పేట, విజయవాడ-**520001**

**చెక్‌లు/డ్రాఫ్టులు/ఆన్‌లైన్‌లో పంపడానికి :**

A. Krishna, Bank : State Bank of India, A/c. No. 52018355595, IFSC : SBIN0020714,
Branch : Vagu Center, Vijaywada.

If undelivered please return to:
**ARUNATAARA**
6-1/16-7A/1, Peddiraju Street
Prizer peta, Vijayawada - 520 001
Andhrapradesh

TO
Mr/Mrs. DR KOLLA RAJ MOHAN
PRAGATHi NURSiNg HoME
CHiLAKALARIPETA
522616




EDITED, PRINTED, PUBLISHED BY ARASAVILLI KRSIHNA AND OWNED BY DUVVURI VENKATA KRISHNA RAO. PRINTED AT VISALAANDHRA VIGNANA SAMITHI, CHANDRAM BUILDINGS, CHANDRA RAJESWARA RAO ROAD, MACHAVARAM (PO), VIJAYAWADA - 520 004, ANDHRAPRADESH STATE (New Declaration Filed), PUBLISHED AT 6-1/16-7A/I, PEDDIRAJU STREET, PRIZER PETA, VIJAYAWADA - 520 001, ANDHRAPRADESH STATE, EDITOR : ARASAVILLI KRISHNA



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA101M203 |
|---|---|
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | sireesha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |